శ్రీః

# శ్రీ దేవీ మాహాత్మ్యము

# శ్రీ చండీనవశతీ మంత్రమాలా



ప్రచారకులు

శ్రీ గోపానందనాథులు

పరిష్కర్త

బ్రహ్మశ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ

శతావధాని

తాళ్లపాక అన్నమాచార్య కృతుల పరిష్కర్త

తిరుపతి

-ం-10-

అనువాదకులు

డాక్టర్ రాణి రామకృష్ణ M.Sc., Phd.

భాగ్యనగరము

# శ్రీ దేవీ మాహాత్మ్యము
# శ్రీ చండీ నవశతీ మంత్రమాలా

ప్రతులు: 1000
1991

ప్రతులకు:

శ్రీ గోపానందనాథులు
18-1-33, కపిలతీర్థం రోడ్
తిరుపతి - 517501

మూల్యము - రు =


**Also available at:**
12-2-830/33/1
Alapati Nagar
Mehdipatnam
HYDERABAD-500 028

Printed at:
**Prasad Enterprises**
**Phone : 65442**
Easwar Laser Graphics
Hyderabad

శ్రీ గణేశాయనమః
శ్రీబాలాత్రిపురసుందర్యై నమః

## ముందుమాట

శ్రీ చండీ నవశతిపై నేను ఈ వ్యాఖ్యను వ్రాయుటలో "చండీస్తవార్థప్రకాశః" అను సంస్కృత వ్యాఖ్య ఎంతయో ఉపకరించినది. శ్లోకములకు దండాన్వయము కాక, తాత్పర్యమును వ్రాసితిని. అనగా తెలుగుభాషకు సహజమగు వాక్య నిర్మాణమును పాటించుచునే, మూలశ్లోకములోని పదములన్నియు అనువదింపబడునట్లు ప్రయత్నించితిని.

శ్రీశ్రీశ్రీ కళ్యాణానందభారతి తరువాతి కాలములో శ్రీగోపానందనాథులు వామాచారమును నిరసించుటలో ప్రముఖులు. ఈ వ్యాఖ్యాన రచనను వారు నాకప్పగించుట నా అదృష్టముగా భావించు చున్నాను. మిత్రులు శ్రీరాఘవరావుగారి సహృదయత వలననే నాకీ అవకాశము లభించినది.

నేను మా తండ్రిగారు బ్రహ్మశ్రీ రాణి నరసింహశాస్త్రిగారి వద్ద అభ్యసించిన వేదాంతశాస్త్రము ఈ రచనలో నాకెంతయో ఉపకరించినది. కొంతభాగము చదివి వినిపింపగా వారు తమ ఆమోదమును తెలిపిరి.

నేనీ రచనను నాగురువులు శ్రీశ్రీశ్రీ పరిపూర్ణ ప్రకాశానంద భారతీ మహాయతీంద్రుల (పూర్వాశ్రమమున బ్రహ్మశ్రీ రాణి ప్రసాద చయనులు) గారి స్మృతికి అంకితము చేయుచున్నాను. ఇందులో ఏవేని దోషములున్న పండితులు మన్నింతురుగాక!

ఇట్లు
బుధజన విధేయుడు
దేవీ భక్తపాదరేణువు
రాణి రామకృష్ణ

భాగ్యనగరం
28-10-1990.

శ్రీః

# శ్రీచండీ నవశతీ మంత్రమాలా సమీక్ష

లోక కల్యాణదాయకమైన వైదికమతం వామకౌళాచార విషవాయువులలో చిక్కి కొంత ఉక్కిరిబిక్కిరైనది. శంకర భగవత్పాదుల వంటి తత్త్వవేత్తల అమృతస్పర్శతో వైదిక భారతం కొంత సురక్షితమైనా అవైదిక వామదురాచారపు మరకలు మాత్రం అక్కడక్కడ మిగిలి పోయినవి. ఈ కౌళవామాచారాలు భారతీయ సంస్కృతికే దిష్టిచుక్కలుగా నిలిచాయని వివేకానందుల వారు కూడా ఆవేదన పొందారు. ఈ దురాచారాలకు ముఖ్యపురుషుడు భాస్కరరాయలు. అతని శిష్యుడు ఉమానాథుడు, జ్ఞానానందగిరి. పరశురామకల్ప సూత్రాలను ఆధారముగ, పంచమకార సేవయే పరమపురుషార్థ సాధనముగ వీరు ప్రచారం సాగించారు. శీఘ్ర అనుకూల కార్యసిద్ధికి ఈ వామాచారమే ఏకైక మార్గమని నమ్మి నడచిన వైదిక పండితులు కూడా పంచమకారసేవ అవశ్యమని ప్రజలను మోహపరచి చండీదేవతా పూజలందు క్రూరమైన అవైదిక పద్ధతిని వ్యాపింపచేశారు. తత్ఫలితముగ మధుమాంసమైథునాదులతో కూడిన జుగుప్సాకరమగు, నీతిబాహ్యములయిన పూజలు వర్ధిల్లాయి.

నవార్ణ మంత్రము, నవరాత్రిపూజ, నవదుర్గలు, నవాంగములు, నవ భూతములు వీటి సాహచర్యంతో మంత్రాలు కూడా పూర్వము నవశతిగా వుండినవి. మధ్యలో కొందరు స్వార్థపరులు నవశతిని 'సప్తశతి'గా మార్చిరి. వాటిని తిరిగి శ్రీగోపానందనాథులు నవశతిగా ఉద్ధరించిరి. శ్రీగోపానందనాథులు శ్రీశ్రీశ్రీ జగన్మోహనానందనాథుల శిష్యులు. వందలకు వేలు వైదికవిధానంలో యజ్ఞయాగాది క్రతువులను నిర్వహించిన వారు. లెక్కకు మిక్కుటంగా శ్రీదుర్గాపరమేశ్వరాది ఆలయ విగ్రహ ప్రతిష్ఠాపనలను చేసినవారు. ప్రొద్దుటూరు సమీపంలో అసూర్యంపశ్యగ నిలచిన పురాణ సుప్రసిద్ధ కన్యతీర్థ మహాక్షేత్రాన్ని అగస్త్యాశ్రమాన్ని ఉద్ధరించి దేవతామూర్తులను ప్రతిష్ఠించి ఆలయమండప ప్రాకారాదులను నిర్మింపజేసి నిత్యపూజాపునస్కారాలను ఏర్పరచిన పుణ్యమూర్తులు. వీరిని ఆప్రాంతాలలో 'కన్యతీర్థమయ్య', 'గోపయ్యస్వామి' అని భక్తితో పిలుచుకొంటారు. అతుల నిష్ఠాగరిష్టమైన వైదిక పారాయణముతో, శాంతగంభీరముగ జీవయాత్ర సాగించే ఈ శ్రీవిద్యోపాసకమూర్తి ఎందరో ఆశ్రితులకు అంతేవాసులకు ఆధ్యాత్మభిక్ష ప్రసాదిస్తున్నవారు. ఆసేతు హిమాచలం పర్యటిస్తూ శంకరభగవత్పాదుల అడుగుజాడలలో వైదిక ధర్మరక్షణకు నిశ్శబ్ద కృషిని సాగిస్తున్న మహామనీషి. లోక కల్యాణంకోసం ఈ నవశతీ మంత్రమాలను "ఓం తామగ్నివర్ణాం

తపసా జ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషు జుష్టాం దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే సుతరసి తరసే నమః" అని అర్పణం చేసినవారు బ్రహ్మశ్రీ గోపానందనాథులు.

ఇంతగొప్ప కార్యక్రమాన్ని దీక్షగ చేపట్టిన శ్రీగోపానందనాథులు మావంటివారికి సుబోధకంగ అర్థ తాత్పర్యాదులతో ఈ దేవీమాహాత్మ్యాన్ని ప్రకటించిరి.

మనముందు బ్రహ్మశ్రీ గోపానందనాథుల "నవశతీ మంత్రమాలా దర్శనము" వున్నది. ఆధ్యాత్మక రసికులు అనుభవించి కృతార్థులగుదురుగాక.

గ్రంథసమీక్షకులు
కామిశెట్టి శ్రీనివాసులు.
లెక్చరర్, M.A.,
గోవిందరాజ స్వామి ఆర్ట్సు కాలేజ్
(అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరెక్టర్)
తిరుపతి.

* * *

శ్రీః
శ్రీ గురవేనమః
శ్రీ మాత్రేనమః

# శిష్టాచారము

శ్రుతి స్మృతి పురాణాదులలో ప్రకాశితమైనది వేద విజ్ఞాన సంపద. ఈ సంపదతో నలరారు నట్టిదే భారతీ సంప్రదాయము. ఇది సర్వోత్కృష్టమైనది. చతుర్దశ భువనములకు శాంతి సౌఖ్యములనిచ్చుఈ సంప్రదాయము అప్రతిహతముగా నిలచి యుండుటకు మూలకారణము ఇందు ప్రబోధితమైన శిష్టాచారము.

"గచ్ఛన్తీహసుసంతుష్టా ధర్మపంథాన ముత్తమమ్ ।
శిష్టాచారా మహాత్మానో యేషాం ధర్మః సునిశ్చతః ॥"
"అనసూయా క్షమా శాంతః సంతోషః ప్రియవాదితా।
కామక్రోధ పరిత్యాగః శిష్టాచార నిషేవణమ్"॥
"కర్మచ శ్రుత సంపన్నం సతాం మార్గమనుత్తమమ్।
శిష్టాచారం నిషేవన్తే నిత్యం ధర్మమనువ్రతాః"॥

ఇట్టి శిష్టాచారము సత్వగుణ ప్రధానమైనదగుటచే ధర్మబద్ధముగా నిలచి యున్నది. **ఇయ్యది** కర్మ జ్ఞానముల రెండింటికినీ ధ్యేయము.

పరబ్రహ్మము నిత్యము, నిరంతరము, శుద్ధచైతన్య తేజోవిలసితము. ఈ పరబ్రహ్మమును బోధించు విద్య శ్రీవిద్య. ఇయ్యది "పరా" "అపరా" అని రెండు విధములు. ఏ విద్యచే అక్షరమగు బ్రహ్మమును తెలసికొని జీవుడు ముక్తుడగునో ఆ విద్యను "పరా విద్య" అందురు. "అపరా విద్య" యన ఋగ్యజు స్సామాధర్వణ శిక్షాకల్ప వ్యాకరణ నిరుక్తి ఛందో జ్యోతిషములు. ఈ రెండు విద్యలున్నూ శ్రీ దక్షిణామూర్తి ఆదిగా అవిచ్ఛన్నమైన గురుపరంపరాప్రాప్తమై శ్రీవిద్య అని చెప్పబడుచున్నవి. ఐహికాముష్మికములకు ధ్యేయమైన ఈ శ్రీవిద్య ఆత్మసాక్షాత్కా

రమును అద్వైతానందసిద్ధినిగోరు ఉపాసకులకు చింతామణి వంటిది.

ఉపాసకునకు నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్ర ఫలభోగ విరాగము, శమ దమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము అను సాధన చతుష్టయము అవసరము. ఇది బ్రహ్మనిష్ఠకు సోపానములు. బ్రహ్మనిష్ఠ సద్గురు కరుణా లభ్యము.

సద్గురు లక్షణములు:-

"సుందరః సుముఖః స్వచ్ఛస్సుచిశ్చ బహుతంత్రవిత్ ।
అసంశయ స్సంశయచ్ఛిన్నిరపేక్షో గురుర్మతః"॥

శిష్య లక్షణములు:-

"చతుర్భిరాద్యైః సంయుక్తః శ్రద్ధావాన్ సుస్థిరాశయః ।
ఆస్తికో దృఢభక్తిశ్చ గురౌమంత్రేచ దైవతే ।
ఏవం విధోభవేచ్ఛిష్యః ఇతరో వ్యాధికృద్గురోః" ॥

కాన ఇట్టి సచ్ఛిష్యుడు సద్గురువు నాశ్రయించి, శుశ్రూష చేసి గుర్వనుగ్రహమున బ్రహ్మనిష్ఠతో అద్వైత సిద్ధిని పొందదగునని శిష్టాచార్యులు బోధించి యున్నారు. మూల ప్రకృతి అవ్యక్తము. సత్వరజస్తమోగుణ విశిష్టము. ఈ చరాచర ప్రపంచ మంతయు అవిద్యతో మాయతో నిండి యున్నది.

మనో వికారములకు రాగద్వేషములకు సుఖదుఃఖములకు రజోగుణము కారణ మగుచున్నది. అవివేకము బద్ధకము జడత్వము నిద్ర అజాగ్రత్త మూఢత్వములకు తమోగుణము కారణమగుచున్నది.

స్వమానిత్వము అహింసాది పంచనియమములు శ్రద్ధ భక్తి జ్ఞాన వైరాగ్యములకు సత్వగుణము కారణమగుచున్నది. "సత్వాత్సంజాయతే జ్ఞానమ్" అనినట్లు సాత్విక మార్గమే జ్ఞానసిద్ధికి, సుఖ శాంతికి ఆదర్శము.

"తామగ్ని వర్ణాం తపసాజ్వలన్తీం" అను శ్రుతి వాక్యముచే సాత్విక తప స్సమాధి యందుద్భవించు దివ్యతేజ స్వరూపమే ఆబ్రహ్మకీట జననియగు జగ న్మాత. ఆ దివ్యతేజమును పొందు సంప్రదాయము శ్రీవిద్యా సంప్రదాయము. ఇది కేవలము గురుముఖైకవేద్యము - పరంపరాప్రాప్తి సిద్ధము.

శ్రీవిద్యోపాసన యందు సమయ దక్షిణాచారములు వైదికములు. వామ కౌళాచారములు అవైదికములు. వైదికాచార బద్ధముగా దివ్యపురుషులగు సనకసనం దనాదులచే ప్రతిపాదితమై గురుపరంపరగా అవిచ్ఛిన్నముగా వచ్చుచున్నది 'సమయ' సంప్రదాయము. ద్వైతభావమును విడిచి అద్వైత సిద్ధిని పొందగల విశిష్టమార్గ బోధి తమీ సంప్రదాయము.

ఇందు చతుర్విధైక్య సంధానము, షడ్విధైక్య సంధానము అను రెండు మార్గ ములు సూచింపబడినవి.

1. పరదేవతా శ్రీచక్రయోరైక్యము
2. శ్రీచక్ర బ్రహ్మాండయోరైక్యము
3. బ్రహ్మాండపిండాండయోరైక్యము
4. మంత్రమాతృకా మంత్రదేవతయోరైక్యము అనునవి చతుర్విధైక సంధానములు.

1. శ్రీచక్రము 2. మాతృక 3. శ్రీవిద్య 4. అంబిక 5. బ్రహ్మాండము 6. పిండాండము ఈ ఆరింటి సామరస్యమును సంపాదించు అంతర్యాగము షడ్విధైక్యానుసంధానము.

కలాయాం బింద్వైక్యం తదనుచ తయోర్నాదవిభవే
తయోర్నాదైరైక్యం తదనుచకలాయామపితయోః।
తయోర్బిందోరైక్యం త్రితయ విభవైక్యం పరశివే
తదైవం షోడైక్యం భవతి హి సపర్యాసమయినామ్॥

1. 'కల'యనగా పరమాణువు.

2. బిందువు- పూర్ణబిందువు అవ్యక్తము. శుక్లబిందువు రక్తబిందువు మిశ్రమ బిందువు అనునవి వ్యక్తములు.

3. నాదము- పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అని నాల్గు విధములు.

i) పర - బింద్వధిష్ఠాత్రి - దీనినే శివ + శక్తి సామరస్య మండలమందురు - ఇది లింగ భేదరహితమైన "ఏక" "సర్వవ్యాపి" సర్వకారణమైన తేజోమయి. (Infinity)

ii) పశ్యంతి- బిందువు యొక్క కాంతి పుంజముల వికసనము వలన త్రికోణముత్పన్నమగుచున్నది. ఈ త్రికోణమును యోనిచక్రమందురు. ఇది "పశ్యంతి శక్తి" కి నిలయము. పర లేక బిందువు శివరూపము. త్రికోణము శక్తిరూపము. మాతాపితరులవలె జగదుత్పత్తికి వీరుభయులు సమానకారకులు. త్రికోణము ప్రథమ యోని చక్రము. దీని నుండి నవ యోనిచక్రములుత్పన్నమగుచున్నవి. అందుచే ఈ ఉత్పత్తికి ప్రథమ కారణము సహస్రారమండలమందలి "పర". ద్వితీయకారణము "పశ్యంతి". 'పర' యొక్క తేజోకిరణ ప్రసారము వలన బిందు వికసన సమయమందు 'పశ్యంతి' శక్తినుండి నాదము, అందుండి నవనాదములుత్పన్నమగుచున్నవి. అందుచే నవయోనులకు, నవనాదములకు, నవశక్తులకు, నవవర్గులకు ముఖ్య కారణము 'పర, పశ్యంతి' అను చక్రములు. ఆవిధముగనే ఈ జగద్వృక్షమునకు, (అనగా ఈ జగత్సృష్టికి) అక్షర మాతృకకు (పద, బీజ, సంఖ్యా, రేఖాత్మకమగు) సర్వశాస్త్ర సర్వశబ్దజాలములకు, ఈ 'బిందు' నాదములు బీజాంకురములుగా బోధపడుచున్నవి.

iii) మధ్యమ- ఇది స్థూలమధ్యమ, సూక్ష్మమధ్యమ అని రెండువిధములు.

వీనినే స్థూలనవవర్గమయీ సూక్ష్మనవనాదమయీ అని అందురు.

పర, పశ్యంతి, మధ్యమావస్థలను బహుసూక్ష్మమగు జ్ఞానదృష్టిచేతనే గ్రహింపసాధ్యము. అనగా పరాశబ్దమును పరానాదము చేతనే గ్రహింపనగును.

పరమాత్మస్వరూపము ప్రథమావస్థయైన 'బిందు'వునందు గ్రహింపదగును.

అనంతరము స్వాంతర్గతమైన "చిచ్ఛక్తి" ఆవిర్భవించుచున్నదిగాని ఇది 'పశ్యంతి' యని తెలియబడు ద్వితీయావస్థ.

శ్రుతి ॥ "యదస్తి సన్మాత్రం । యద్విభాతిచిన్మాత్రం । యత్ప్రియమానందం" । సద్వస్తుప్రకాశముచే 'పగలు, రాత్రి యని, ఇది ఇట్టిది, అది అట్టిది' అను జ్ఞానము కలుగుచున్నది. ఈ జ్ఞానమునే చిచ్ఛక్తి అని యందురు. "సోకామయత, సఈక్షతే", ఇత్యాది శివశక్తి సామరస్యరూపమును తెలుపును. శక్త్యావిర్భావాత్పూర్వము ఈశ్వరి కామనారూపముగా నుండును. ఇయ్యది యొక సూక్ష్మమధ్యమావస్థ.

సహస్రారాంతర్గత చంద్రమండల మందలి 'పరా' స్వరూపము "సాక్షి" యను పరమాత్మస్వరూపము. చూడబడు ప్రకృతి స్వరూపము 'జీవ' భావమును పొ ుదును.

శివశక్తి అనుహంసద్వంద్వము సహస్రారగతము - వాక్కునకు ప్రథమ మందు "పలుకవలె, మాట్లాడవలె, చెప్పవలె" నను 'ఇచ్ఛ' గలుగును. ఆ 'ఇచ్ఛ' శబ్దరహితము, అనగా వాక్కునకు పూర్వావస్థ. అది సహస్రార గతముగాన 'పరావస్థ.' ఈ 'పర' అను ఇచ్ఛ, సహస్రారమందు 'కామనా' రూపమునుండునని సమయాచార మతము బోధించుచున్నది.

(పశ్యంతి చక్రమగు 'యోనిచక్రము' పరాస్థానమని కౌళమతము బోధించును-)

**స్థూలమధ్యమః** - ఇయ్యది పశ్యంతి వైఖరీల మధ్యమావస్థ. ఇందు పశ్యంతి అవ్యక్త మాతృకగా యుండును. వైఖరి పంచాశద్వర్ణ విభాగముతో నుండును- ఈ రెండు అవస్థల మధ్య నవవర్గ విభాగమును తెలుసుకొనుడు. పశ్యంతి కన్న స్పష్టము, వైఖరికన్న అస్పష్టముకాన - దీనిని స్థూల మధ్యమ అందురు. అ క చ ట త ప య శ ళు ఎనిమిది వర్గులు, అకారాది స్వరములు పదునారు. ఇందు హ్రస్వములు ఎనిమిది. దీర్ఘములు ఎనిమిది. ఇది కల్పించబడిన అక్షర లిపి. వాస్తవమున వీనిని వుచ్చరించునపుడు కలుగు శబ్దము సత్యము. ఆ శబ్దమును 'మాతృక' అందురు. 'మాతృక' 'మంత్రాక్షరములు' తేజోమయములు. ఆ తేజస్సే 'పరమాత్మ.' మంత్రాక్షరములందు తేజస్సు ఉద్భవించును. ఆ మంత్రమునకు దైవము - తేజస్సు.

జలము ప్రాణమయమ్ము
మనస్సు అన్నమయము
వాక్కు తేజోమయము.

అందుచేత వాక్కు శుద్ధవాక్కుగా నుండవలెను. అనగా మంత్రము స్పష్టాక్షర ములతో, స్పష్ట పదములతో, స్పష్టమైన ఉచ్చారణతోనుండవలెను. అట్టి మంత్రము నందు శుద్ధ తేజస్సు ఉద్భవించి లోక కళ్యాణము చేకూర్చును. ఈ కార ణము చేతనే మంత్రములన్నియు నియమ బద్ధములు. విశేషములు గురుముఖైక వేద్యములు.

iv) వైఖరీ-

బీజము సహస్రార చక్రము
అంకురము - త్రికోణ చక్రము-

త్రికోణ చక్రభ్రమణమునందు అంకురించిన అకారాది పదునాలుగు స్వరములు స్ఫుటరూపములై పదునాలుగు కోణములుగా పదునాలుగు ధ్వనులు వినిపించును-

'పరా' 'పశ్యంతి' 'స్థూలమధ్యమ' అను శక్తిత్రయమువలన 'వైఖరీ'శక్తి ప్రాదు ర్భవించును. ఈ వైఖరీశక్తి ద్వారా అకారాది క్షకారాంతమైన ఏబది అక్షరములరాశి స్ఫుటాక్షర పంక్తిగా ఉత్పన్నమైనది.'

అందుచేత బింద్వాది చతుర్దశార పంచ చక్రాకారముగా వైఖరీశక్తి- వాగీశ్వరీ శక్తి ప్రకాశించుచున్నది. ఈ వైఖరీ శక్తిచే వేద శాస్త్రములన్నియు ప్రాదుర్భవిం చినవి.

"యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తే చ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతి లీనస్య యఃపరస్సమహేశ్వరః"

## మంత్ర స్వరూపము

మంత్రము "పద బీజ సంఖ్యారేఖాత్మకమ్" అని మంత్ర నిఘంటు తెలుపుచున్నది.

1. పదము రెండు విధములు:- 'శ్రుతి' 'స్మృతి' యని.

శ్రుతి అనగా వేదము - ఇది నిత్యము, అపౌరుషేయము- స్వతః ప్రమాణము. ఇవి 'కారణ' పదములు.

స్మృతి యనగా పురాణ శాస్త్రాదులు, ఋషి దర్శనములు- అనిత్యములు పౌరు షేయములు, పరతఃప్రమాణములు - 'కార్య' పదములు. శ్రుతి స్వరశాస్త్రములకు ఆధారమైయున్నది. ఇది నాలుగు శాఖలుగా 'ఓమ్' అను ప్రణవనాదమందు 'ఆవి ర్భవించినవి.

"సర్వే వేదా యత్ పదమామనన్తి।
తపమే సర్వాణిచ యత్ వదన్తి।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి।
తత్ తే పదమ్ సమగ్రహోన్బ్రవీమి ।।

2. బీజము:-

అక్షరములన్నియు 'అ'కారముతో మొదలై 'హ' కారముతో ముగియుచున్నవి. అ + హ, ఇవిముగిసినట్లు తెలుపు 'O' మొత్తము కలసి "అహం" అయినది. వర్ణములన్నియు 'అహం' అను నామమందు పుట్టినవి. 'ప్రజాపతి' యైన 'బ్రహ్మ' తాను ఈ వర్ణసమామ్నాయ శరీరమును తాల్చినట్లు దర్శించెను - అందుచే తాను ఎవరని తెలిసికొనుటలో తాను 'అహం' ( అ+ హ+ o) అని గ్రహించెను- 'అహం బ్రహ్మాస్మి' అని పలికెను. అందుచేత బ్రహ్మస్వరూపమైన అకారాది హకారాన్త వర్ణములన్నియు 'బీజ' ప్రపంచములోనివిగా గ్రహించనగును- ఇందలి విశేషములు గురుముఖైక వేద్యములు- వీటిని మంత్రసంకేతములుగా గ్రహింపనగును.

(N.B = మైత్రేయుడు విదురునకు తెల్పిన యుగలక్షణములను అనుబంధము నందు చూడుము.)

3. సంఖ్య- ఇది మంత్రమందలి అక్షర సంఖ్యను తెలుపును. బీజమునకు రేఖ, అనగా మంత్ర దేవతా రూపము లేక ఆకృతి. దీనిని సంఖ్యా శాస్త్రమందురు. వేద వాఙ్మయమందు ప్రతివాక్యమునకు, పదమునకు, అక్షరమునకు 'సంఖ్య' విలువగలదు.

'కాదినవ' 'టాదినవ' 'యాద్యష్ట' 'పాదిపంచ'_ ఇత్యాది వైదికమంత్ర సంఖ్యను తెలుపునదిగాన మంత్రసంఖ్యాశాస్త్రమందురు. అవ్యక్త సంఖ్యయొకటి గలదు. దీనిని బ్రహ్మసంఖ్య 'పరమ్' అని అందురు. ఈ పదము లింగత్రయము మూడింటియందును భావింపబడును-

పుం "పరః" - పురుషపరముగా "అహం" అని, ఋషులచే "ప్రసవ" అని. చెప్పబడినది. స్త్రీ "పర" - అవ్యక్త సంఖ్యను తెలుపునది. ఈ పైమూడింటికి పైన యుండు "వేదపరమ్" పరబ్రహ్మమును తెలుపునుగాన అవ్యక్త చక్రమగు బిందువు బ్రహ్మను తెలుపును- పురుష పర "ప్రసవీ" అనుటకు "నవో నవో భవతి జాయమానాః" అని "నవః" అని పురుషపరముగా తెలిపియున్నారు. నపుంసకపరముగా "నవ" అనగా నవసంఖ్య - నవసంఖ్యను పురుష ప్రజాపతి, ఈశ్వర అను పదములు ప్రథమ పురుషుడు అని చెప్పుచున్నారు-

ఈ పురుషుడే "అహం" అని భావించుచున్నాడు-

'అహం' అందలి -

అ - 1 (ఒకటి) కిని

హ - 8 (అష్ట) కును

0 - 0 (సున్న) ఈ మొత్తము 180 అయినది. అనగా అకారాది హకారాన్త

బిందుసహా "నేను వున్నాను" అనిన్నీ, ఏకాద్యష్టాన్తబిందుసహా 'అహం' అను దివ్య భావము కలుగుచున్నది. ఇట్టి "అహం" అను దివ్య సరస్సు నుండి అకారాద్యక్షరములు సంఖ్యలు ఉత్పన్నమైనవి. "అహం"ను "ఓం"ను ఒకే అక్షరముగా, పదముగా వ్యవహరింతురు.

అ+ఉ+మ = ఓం - పురుషపరముగా ప్రజాపతి అపరబ్రహ్మ, వ్యక్త అని భావింతురు - అదియే వేదాక్షరముగా, ఒకే అక్షరముగా, "బ్రహ్మ" "మహః" అని చెప్పాదురు-

"ఓం" పదమైనపుడున్న సంఖ్య 1, 3, 5 = 9

"అహం" ను పదముగా భావించినపుడు దాని విలువ 180, లేక, 90, లేక 18, లేక 9 - గా అనంతగణిత శాస్త్రమునకు కారణమైనది. ఏకాది అష్టాదశ పర్యాన్తా సంఖ్యా-

ఏక, దశ, శత, సహస్ర, అయుత, లక్ష, ప్రయుత, కోటి, అర్బుద, అబ్జ, ఖర్వ, విఖర్వ, మహాపద్మ, శంఖ, జలధి, అంత్యం, మధ్యం, పరార్థం ఏవం దశగుణితం- ఇది వ్యవహారావస్థ.

| | | |
|---|---|---|
| 1. | 1 | ఏక |
| 2. | 10 | దశ |
| 3. | 100 | శత |
| 4. | 1000 | సహస్ర |
| 5. | 10000 | అయుత |
| 6. | 100000 | లక్ష |
| 7. | 1000000 | ప్రయుత |
| 8. | 10000000 | కోటి |
| 9. | 100000000 | అర్బుద |
| 10. | 1000000000 | అబ్జ |
| 11. | 10000000000 | ఖర్వ |
| 12. | 100000000000 | విఖర్వ |
| 13. | 1000000000000 | మహాపద్మ |
| 14. | 10000000000000 | శంఖ |
| 15. | 100000000000000 | జలధి |

16. 1000000000000000 అంత్య

17. 10000000000000000 మధ్యమ

·18. 100000000000000000 పరార్ధ

ఈ పరార్ధము 18 దశ గుణితమైనపుడు 1+17 సున్నలు. పర 1+35. సున్నలు 36 - అందుచే ఈ పర సంఖ్యలోని మొత్తము 1-నుండి 8 సంఖ్యల లోని మొత్తమునకు సరిపోవును - 180 సంఖ్య పరార్ధములోని $180^0$ అంశలకు హేతువు - పూర్ణచక్రమునకు 180 + 180 = 360 అంశలు. అదే విధముగా కోణమందలి $90^0$ లున్నూ. అందుచే " నవోనవో భవతి జాయమానా" అను శ్రుతి వాక్యము- "తస్యవాచకః ప్రణవః" అనుస్మృతి వాక్యము-

మరియు

1. ఓం -9, 12, 18, 36, 90, 180, 360

2. యంత్ర, చక్ర, తారక, పురుష, శివ, ఆది, జప, అహం, గర్భ, ఆనంద, శరీర, రస, గతి, పద, అజ, భూమ, కర్త, ఈక్షతి, యజ, పరీశయ, తురీయ - ఇవి అన్నియు నవ సంఖ్యాత్మకములు.

3. బ్రహ్మ, ప్రజాపతి, విశ్వమ్, సర్వమ్, దహర - ఇవి పదునెనిమిది సంఖ్యాత్మక ములు.

4. చిత్, తత్, జీవ, దేవ, ఆత్మ- ఇవి ద్వాదశ సంఖ్యాత్మకములు.

పద, బీజ, సంఖ్య, రేఖలు నాలుగును ఒకే కారణముచే ఉద్భవించినవి. ఆకారణము 'పరమ్' "బ్రహ్మ" "పూర్ణమ్" అను పదములచే గ్రహింపదగును. పై విధముగా కలా బిందు నాదములు, అందుద్భవించిన, పద- బీజ-సంఖ్య- రేఖా త్మకమైన మాతృకాస్వరూప అక్షర ఉద్భవస్థితి, వాని శక్తిని తెలుపు బీజక్రియ, నవసంఖ్య లక్షణము, రూపము లేక చక్రలక్షణములను కొంత వఱకు విశదప ఱచి యున్నాను. అక్షరములు మంత్రములోని నామము తెలుపగా సంఖ్యలు వాని విలువలను బోధించును.

వీని సంపూర్ణ లక్షణము తేజస్స్వరూపము-

"పూర్ణమదః పూర్ణమిదం పూర్ణా త్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే।।"

అట్టి పూర్ణ పరబ్రహ్మను తెలుపునదే సమయమతము- వైదికమతము.

ఇట వామకౌళమత ప్రశస్తి అప్రస్తుతముగాదు.

సనత్కుమారసంహిత:-

"బాహ్యపూజానకర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః।

సాక్షాద్రఫలదాన్నృణాం ఐహికార్థైకసాధనాత్ ।।
బాహ్య పూజారతాః కౌళాః క్షపణశ్చకపాలికాః ।
దిగంబర ఐతిహాసాః కామికాస్తంత్రవాదినః ।।
అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః।
జీవన్ముక్తాశ్చరంత్యేతే త్రిషులోకేషు వర్తతః"।।

"కౌలాః ఆధారపూజారతాః।
క్షపణకాః యోనిపూజారతాః ।
కాపాలికాః దిగంబర శ్చోభయత్రరతాః।
బ్రహ్మవాదినః శుభాగమ పంచకోక్తార నిరతాః"।।

రజోగుణము తమోగుణము ప్రధానమై ప్రాపంచిక సుఖాపేక్షతో పంచమకారసేవనాది నీతిబాహ్యకరవృత్తివిధాన విశేషమైనది కౌళాచారము. సత్వగుణ ప్రధానముగా అంతర్యాగ బుద్ధితో మోక్షప్రాప్తికై శమదమాది షట్కసంపత్తి విశేషములతో వైదిక మార్గానుసారియైనది సమయమతము-

శ్రీ కృష్ణభగవానుడు-

"యజన్తే సాత్వికాదేవాన్యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః"।।

అనుటచే గుణప్రధానముగా సాత్వికులు దేవతలను, రాజసులు యక్షరాక్షసులను, తామసులు ప్రేత భూతగణాలను పూజింతురని తెలియుచున్నది.

**కౌళాచారమందు కులధర్మము :-**

పెయం మద్యం ఫలం ఖాద్యం సమాలోక్య ప్రియాముఖమ్
ఇత్యేవా చరణం జాప్యం పరిప్రాప్యం పరం పదమ్
తృణం వాప్యవిధానేన ఛేదయే న్నవకదాచన
విధినా గాం ద్విజం వాపి హత్వా పాపైర్నలిప్యతే ।।

(పంచమకారసేవనము గో బ్రాహ్మణ బలి)

**కుల మార్గనిష్ఠుడెవరు ?**

చతుర్వేదీ కుల జ్ఞానీ శ్వపచాదధమః ప్రియే।
శ్వప చోపి కుల జ్ఞానీ బ్రాహ్మణాదతి రిచ్యతే।
సర్వకర్మ విహీనోపి వర్ణాశ్రమ వివర్జితః।
కులనిష్ఠః కులేశాని భుక్తిముక్త్యోః సభాజనమ్।।

(చతుర్వేదములు చదివిన బ్రాహ్మణుడైనను కుల జ్ఞానము లేనిచో చండాలునికన్న నికృష్టుడు, కుల జ్ఞానము కలిగిన చండాలుడు బ్రాహ్మణునికన్న అధికుడు.)

సర్వేభ్యశ్చోత్తమా వేదా వేదేభ్యోవైష్ణవం పరం।
వైష్ణవా దుత్తమం శైవం శైవాద్దక్షిణ ముత్తమమ్।
దక్షిణా దుత్తమం వామం వామాత్సిద్ధాన్తముత్తమమ్।
సిద్ధాన్తా దుత్తమం కౌళం కౌళాత్పరతరం నహి।।

ఈ కౌళాచారము పరశురామునిచే ప్రతిపాదింపబడినట్లుగా కల్పించి వ్రాయబడిన "పరశురామ కల్పసూత్రము" ఆధారముగా పంచమకారసేవన పరమ పురుషార్థ సాధనయని, నిత్యనైమిత్తికోత్సవములు లేనిదే మంత్రగ్రహణమునకుగాని తదనుష్ఠాన మునకు గాని యధికారములేదని, ఘోషించుచున్నది. అవతారమూర్తి యగు పరశు రాముడు ఇట్టి నీచకృత్యములు బోధించునా? కౌళులు, క్షపణకులు, కాపాలికులు తాంత్రికుల పేరుతో పరమ నీచకృత్యములతో ప్రజలను భయభ్రాంతులను చేసి మోసపుచ్చుచున్నారు. వీరి దుష్కృత్యములకు అంతము లేకున్నది.

## శ్రీ చండీ నవశతీ మంత్రమాలా

శ్రీ జగన్మాత దుష్టశిక్షణార్థము శిష్టసంరక్షణార్థము ఆయా కాలమునకనుగుణ్య ముగా అనేకానేక దివ్యరూపములు దాల్చినట్లు పురాణములందు ప్రశంసింపబడినది. గురుపరంపర యందు 28వ వ్యాసుడైన శ్రీ కృష్ణద్వైపాయననామ వ్యాసులు వేదో ద్ధరణముతో పాటు అష్టాదశ మహాపురాణకర్తగా కీర్తింప బడియున్నాడు.

శ్రీ మార్కండేయ మహాపురాణాంతర్గత సావర్ణిక మన్వంతర కథాంతర్గతమున 78వ అధ్యాయమునుండి 90 వ అధ్యాయము వరకు శ్రీదేవీ మాహాత్మ్యము అభివర్ణింప బడినది. ఈ కథా వైశిష్ట్య మెఱిగిన ఋషిశ్రేష్ఠులు ఇందలి 578 శ్లోకములను నవశత మంత్రమాలగా నిర్ధరించి ఇహ పర సాధనకు భువన శాంతికి పారాయణ హోమాదులు నిర్వర్తించుచుండిరని "పురాకల్పే ఇదం దేవీ మాహాత్మ్యం నవశత శ్లోకాత్మకత్వాత్ నవశతీ సంజ్ఞామాసీత్" అనుటవలన తెలియుచున్నది. మరియు వామకేశ్వర తంత్రమందు

"నవార్ణానవచండీచ నవావరణ దేవతాః
నవశ్లోక శతాన్యేవం ద్వితయం నవరాత్రయోః
ఏతద్గోప్యతమం సర్వం నదేయం యస్య కస్యచిత్
రాజ్యందేయం శిరోదేయం దేయా నవశతీ నచ "

అనుటవల్లను, శ్రీచండీనవశతీ అరాధన సమయమతానుసారముగా అనాదిగా జరు గుచుండినట్లు తెలియుచున్నది.

అట్టి నవశతి మంత్రమాల జపహోమాద్యనుష్ఠానములకు సాధకునకు చాల బరువుగా నున్నదని, ఆతని సౌకర్యార్థమై పరమేశ్వరుడు సప్తశతిగా యుద్ధరించెనని ప్రచారము జరిగి సప్తశతిని కల్పించిరి. ఈ సప్తశతికి పూర్వాంగ ఉత్తరాంగములుగా మూల

మున లేనివి, తంత్ర గ్రంథములలోనివి అగు రహస్యత్రయ, సూక్తత్రయములను జేర్చి, కఠిన నిబంధనలు కల్పించి, వీనిని అంగములుగా పారాయణ చేయనిచో దేవి కోపించి శపించునని మహాభీతిని సాధకుని మనస్సునందు సృష్టించిరి. మూలమున నున్న శ్లోకములు నవశత మంత్రమాలగా నుండగా 'బరువుగా' కన్పించినదికాని, అంతకు మించిన రహస్యత్రయ, సూక్తత్రయ పారాయణ బరువుగా కన్పించినట్లు లేదు. ఈ రహస్యత్రయ సూక్తత్రయములందు కులధర్మము, కులాచారము, కులమార్గనిష్ఠ శ్రేష్ఠములుగా అభివర్ణించి యుండుటచేత, వైదికమతావలంబుల యందును గూడ శాక్తేయ సాంప్రదాయ పద్ధతి ప్రవేశింప జేసిన గాని తమ మతమునకు ప్రాధాన్యము సంతరిల్లదని శక్తిపూజాతత్పరులు సృష్టించిన తాంత్రిక ఇతిహాసమే ఈ సప్తశతి అని స్పష్టమగుచున్నది. స్వార్థపరులైన కొందరు ద్విజులు ఈ సప్తశతి వ్యాప్తికి తోడ్పడిరి. కులధర్మముగూర్చి పైన వ్రాసియున్నాము. అదియుగాక సప్తశతి ఏక చరిత్రముగాగాక, మూడు భిన్న చరిత్రలుగా, భిన్న న్యాస ములతో, ఆయా దేవతల మూలమంత్రములు లేకుండా పారాయణ విధింపబడినది. మంత్ర స్వరూపము లేని "ఉవాచ" లను మంత్రములుగా స్వీకరింపబడినవి. ఇంకను ద్విరావృత్తములు, త్రిరావృత్తములు పరిశీలించగా, సప్తశత సంఖ్య ఏదో విధముగా సాధించుటకు మాత్రమే ఆయాసపడినట్లు గోచరింపక మానదు- యధార్థముగా పర మేశ్వరుడే సప్తశతిని యుద్ధరించిన ఇట్టి లోపభూయుష్టమైన కార్యము చేయునా? అట్లు చేసియే యున్నచో శ్రీకృష్ణద్వైపాయనులు ఈ విషయము పురాణములో తప్పక తెలిపియుండెడి వారుగదా! కావుననే మంత్రలక్షణములులేని సప్తశతీ మంత్ర విభాగము కేవలము ఒక తాంత్రిక కల్పన. కాలాంతరమున సప్తశతిని పరమేశ్వరుడే యుద్ధరించె గాన అనుసరణీయమే అను భావనచేత, దేవి శాపభీతి వలననూ, జనులు దీనిని ఆదరించుటచే, క్రమేపి ఇది పరంపరా ప్రాప్తమను భావము స్థిరపడి నది. తరువాత కాలమువారు ఇందలి లోపములు తెలిసికొనియూ దేవి కోపమునకు గురికాగలమను మహాభీతిచే సప్తశతిని ఆదరించసాగిరి. ఆనాడు శాక్తేయులు సృష్టిం చిన మహాభీతియే నేటివరకు సప్తశతి మనుగడకు కారణమైనది.

పద బీజ సంఖ్యారేఖాత్మకము మంత్ర లక్షణమని పైన తెలిపియున్నాము- పదమనగా వేదము తదర్థబోధకముగుస్మృతి- బీజమనగా గురుముఖైక వేద్యమగు మంత్రసంకేతము. సంఖ్యయనగా వేదప్రోక్తమగు మంత్రాక్షర సంఖ్య-

ఛందస్సు- తత్త్వబోధకము.

లౌకికమగు గణితశాస్త్రప్రబోధిత మగు సంఖ్యసర్వజనానుభవసిద్ధము-

రేఖయనగా మంత్రదేవతా స్వరూపధ్యానము-యంత్రరేఖాలక్షణము-

గురు శిష్యలక్షణములు పైన తెలిపియున్నాము- శాస్త్రకారుడనగా మంత్రశాస్త్రమును సద్గురు ముఖతః ఉపదేశముపొంది మంత్ర లక్షణములను మంత్రార్థములను తెలిసి

యుపాసించువాడు- అట్లు తానుపాసించిన మంత్రమును సత్సంప్రదాయ పద్ధతిన, సచ్ఛిష్యునకు ఉపదేశించువాడు-

సప్తశతి మంత్రవిభాగమున పైనుడివిన మంత్రలక్షణములు లేవనుట సుస్పష్టము- అటులనే మంత్రము స్పష్టాక్షరములతో స్పష్టమైన పదములతో స్పష్టమైన ఉచ్చారణతో పలికినపుడు మాత్రమే శుద్ధ తేజస్సు ఉద్భవించునని గూడ పైన తెలిపియున్నాము-

సప్తశతి వ్యాఖ్యాతలు పండితులు అయిన బ్రహ్మశ్రీ జో॥ జనార్దన శాస్త్రిగారు వెలిబుచ్చిన ఈ క్రింది సందేహములు మేము ఒక పత్రిక యందు చదువుట తటస్థించినది:

1.“సంఖ్యతోనే సప్తశతి సంజ్ఞ ఏర్పడిన దన్నచో అ ఏడునూర్లేవి? శ్లోకములా? కాదే! 578 శ్లోకములే వున్నవి. మరి 700 మంత్రములనవలెను. వానిని సాధించుటకై ప్రాచీనులగు బహుతంత్రకారులు బహుప్రయాసలు పడిరి. ఉవాచలను మంత్రములుగా లెక్కించిరి. కొన్ని శ్లోకములను రెండు మూడుగా విరిచిరి. కొన్నిటిని రెండుసార్లు పఠించిరి--- ప్రతితంత్రమున ప్రతి గురు సంప్రదాయమున మత భేధములే. కొందరీనాటికి మంత్రవిభాగమునందు సంస్కారములు చేయవలెన నుచున్నారు, చేయుచున్నారు. ఒకరినొకరు కాదనుచున్నారు విమర్శించుచున్నారు, వెక్కిరించుచున్నారు. “ప్రతి శ్లోకంచ జుహుయాత్” అని వైకృతిక రహస్యము- దానికి సమన్వయ మింతేనా? ఇంతకును సప్తశతి యని మొదట అన్నదెవరు? ఏ ప్రమాణ గ్రంధమును ఈ పదము ప్రయోగింపబడినది?- ప్రకృతము అచ్చుపడిన నాగర తెలుగు లిపి ప్రతులందు మంత్ర విభాగ విషయమున నొక దాని కొకదానికి ఏదో భేదమే కనబడుచున్నది. అసలు మంత్రమనగానేమి? ఒక భావము పూర్తికాకుండానే రెండు మూడు విరుపులా? పూర్వోత్తర భావములు ఒక్కొక్క మంత్రముననే సంశ్లేషమా? ఉవాచకు గూడ మంత్రత్వమా? అధ్యాయాంతమున కాహుతియా? అదియు లెక్కలోనిదేనా? ఇట్టి యెన్నియో సంశయములు పొడచూపు చున్నవి. శ్రద్ధాళువులైన అనుష్ఠాతలను తికమకలు పెట్టు చున్నవి”.

శ్రీ శాస్త్రిగారి సందేహములు మేము ప్రచురించిన శ్రీ చండీనవశతిని వారు చూచిన తర్వాత వెలిబుచ్చినవగుటచే అందుకు మేము ఈ క్రింది జవాబు వ్రాయుచున్నాము- కారణమేమన స్వయముగా ఉపాసకులై యుండుటేగాక సప్తశతీ వ్యాఖ్యాతలు ప్రతిష్ఠాది యజ్ఞకర్తలైన వీరి సందేహములు తీర్చినయెడల పెక్కు మంది సాధకుల సందేహము తీర్చినట్లగును- శ్రీశాస్త్రిగారు వ్రాసినట్లు వెక్కిరించువారిలో మేము వుండమని వారికి తెలియుననియే మా భావన. సత్సంప్రదాయ రీతిని పాటించు సాధకుడు, “న క్రోధో నచమాత్సర్యం నలోభో నాఽశుభామతిః” అన్నవేదవాక్కును ప్రమాణముగా నెంచి, శాఖ, ప్రాంతీయాది సంకుచిత భావములకు అతీతముగా నిలుచును- సత్యాన్వేషణ సుబుద్ధి లక్షణము.

1. 578 శ్లోకములను 700 మంత్రములుగా ప్రాచీనులు బహుప్రయాసపడి చేసిరనుట సమంజసము. ప్రయాసలేకనే 700 మంత్రములను శాస్త్రబద్ధముగా చేయుట సాధ్యమా? అలోచించగలరు- ఉవాచలు 57, ద్విరావృత్తములు 2, త్రిరావృత్తములు 44, వెరసి 103 మంత్రములు 700లో త్రోసిపుచ్చగా శేషించిన 597 మంత్రములను 900 మంత్రములుగా విభజించుట మాకు ప్రయాసకాలేదు. కారణము మంత్రములు పూర్ణవాక్యములుగా యుండవలెనను నియమము పాటించుటచేతను, ఒక భావము పూర్తియగుటకు క్రియాపదము మంత్రములో లేని పక్షమున అనుషంగము చేయు పద్ధతిని అనుసరించుటచేతను నవశత మంత్రమాల సాధ్యమైనది.

2. శ్లోకమును ఎన్నివిరువులైన విరువవచ్చును గాని ప్రతి విరువు పూర్తి మంత్రముగానే యుండవలయును.

3. ఆదరాభిమానముతో ఎన్ని సార్లు పఠించిననూ ఉపాసకునికి ప్రమాదముండదు.

4. ఈ నాటికి గాని మరియొక నాటికిగాని శాస్త్ర పద్ధతిలో మంత్రవిభాగమందు సంస్కారములు జరుగుట తప్పు కానేరదు. కాని మంత్ర విభాగము ప్రాచీనమగు నవశతినుండి ఆధునికమగు సప్తశతిగా మార్పుచేయుట సాహసమేగదా మరి.

5. "ప్రతిశ్లోకంచ జుహుయాత్" అన్న వైకృతిక రహస్య వచనమునకు వివరణము రహస్యత్రయము ఖిలకాండలోనిది అని చెప్పి, వీనిని పారాయణయందు విధించిన వారు చెప్పవలసిన జవాబు. శ్రీ చండీ నవశతి సమయమత ప్రధానమైనది గాన రహస్యత్రయము మాకు లేదు-

6. సప్తశతి అన్నది ఏ గ్రంథమందున్నదో ఆ గ్రంథకర్తలే 'సప్తశతి' అని మొదట పలికిన వారని మా అభిప్రాయము. వీరెవరో శ్రీ శాస్త్రిగారికి తెలియకపోలేదు-

7. మిగిలినవి శ్రీ శాస్త్రిగారికి తెలియనివికావు.

చివరగా సప్తశతీ మంత్రవిభాగమునందు మార్పులు నిశ్చయముగా అవసరము. పండితులు సప్తశతి యందలి లోపములు గుర్తించి పరంపరాప్రాప్తముగాన అనుసరణీయము అను వాదన విస్మరించి సత్యమును గ్రహింపవలసియున్నది. మంత్రము మంత్రలక్షణములు, ఉపాసన, ఫలితములు విశదముగా తెలిసికొని ముందుకు సాగవలయును- సత్యాన్వేషులను జ్ఞానార్థులను శాఖ, ప్రాంతీయాది ద్వేషములు బాధించవు- అద్వైతసిద్ధికి తద్వారా సకల జీవరాసులకు, సకల భువనమునకు శాంతిని ఆకాంక్షించునది సమయమతము. వైదికపరమైన ఈ భారతీ సంప్రదాయమున సృష్టి స్థితి లయకారులను నడపించు జగన్మాత అఖండ (చ + అముండ) సచ్చిదానంద రూపిణి. నిరంతర ద్విజబృంద నిషేవిత. మద్యము, మాంసము, మనుజ, గో, శిశు, బ్రాహ్మణ హత్య-ఇత్యాది జీవహింసలతో కూడినది కౌళ సంప్రదాయము. ఈ సంప్రదాయము ద్విజులకు నిషిద్ధమైనది. అందుచేత ద్విజులు

సదాచారవర్తనులై "సర్వేజనాస్సుఖినో భవంతు" అను దివ్యభావనతో దేవిని ఆరాధింపవలయును. వీరు సూక్త్రయము నందలి కులధర్మము, కులాచారము, కులమార్గనిష్ఠలు వైదికాచారము కన్న శ్రేష్ఠమైనవి అని పారాయణ చేయవలసిన అగత్యము లేదు. పరంపరాప్రాప్త మన్న భావముతో చేయు వీని పారాయణ ఆత్మవంచనయే యగును గదా. తమది కాని దగు ఈ కులధర్మస్తోత్రము వలన వీరు ఆకాంక్షించునది, సాధించునది ఏమి? "ఏకైవాహం జగత్యత్ర" అన్న దేవిని అజ్ఞానులు ఒక క్రూర శక్తియైన తామసిగా భావించవచ్చునేమో గాని, వైదికాచారపరులమని చెప్పుకొను వారు గూడ ఆ భావనను బలపరచి, తదనుగుణముగా పూజా పద్ధతులను అనుసరించుట సన్మార్గము కానేరదు- అజ్ఞానులకు జ్ఞానమార్గము తెలుపవలయునేగాని, తమది కానిదగు కులమార్గమును స్తుతించి బలపరచరాదు- దేవీ భాగవతమున పేర్కొనినట్లు ఈనాటి ద్విజులు గౌతమ ఋషి శాపగ్రస్తులు. ఆ శాపవిమోచనమునకు తెలుపబడిన మార్గము నవలంబించి పరమేశ్వరీ కటాక్షమునకు పాత్రులగుటకు కృషి సలుపవలసియున్నది.

జగన్మాత వర్ణాశ్రమ విధాయిని. సకల సృష్టికి కారణ భూతమైన పంచభూతములకు వర్ణ ధర్మము విధింపబడినది. ఆత్మతత్వమెరిగి ధర్మమార్గముననుసరించవలసిన ద్విజులు, పరధర్మాభిలాషులైనచో పురుషార్థములకు తావులేదు-

> 8-7-90 Decan Chronicleయందు Mr. Sheldon Pollock, Professor of Sanskrit , University of Chicago, వారి ఆవేదన ఇట్లు ప్రకటితమైనది. "Indian Past is the longest continuous past in world history. The British came and made the unprecedented declaration that this intellectual wealth was worthless. Indians believed it and the thousand year history of Sanskrit tradition entered the period of steep and steady decline leading to the present state of near extinction. "
>
> వీరి ఆవేదన అట్టిది. పరభాషాసంస్కృతీ వ్యామోహముతో "అహింసా పరమోధర్మః" అన్న దివ్య వాక్కును మరచినాము. తాంత్రిక పరమైన ఆరాధన వేద ప్రచోదితము, అదియే భారతీయులందరి పూజా విధానము అన్నభావన ప్రపంచమంతటికి కలిగినది. నీతిబాహ్యకర విధులు వేద విరుద్ధములు, మన సంస్కృతి గొప్పది అన్న భావన ప్రబలుట లేదు. సదాచారము శిష్టవర్తన ప్రబలింప జేయవలసిన కాలము ద్విజుల కాసన్నమైనది. అందుకు నవశతి ఆరాధనయే వారికి శక్తిని స్ఫూర్తిని ప్రసాదించగలదు - శ్రీదేవీ నవరాత్రములందు శ్రీదేవీయాగములందు పూర్ణదీక్షాపరులైన ఉపాసకులను ఋత్విగ్గణముగా స్వీకరించి సకల భువన శాంత్యపేక్షతతో నవార్ణమంత్రానుష్ఠానము, నవశతీ పారాయణ హోమాదులు నిర్వర్తించవలసియున్నది.
>
> శ్రీ రుద్రాధ్యాయము ఏకాదశరుద్రాత్మక సదాశివ తత్వప్రబోధిని.

శ్రీమద్వాల్మీకి రామాయణము గాయత్రీమంత్ర తత్వార్థ బోధిని.

శ్రీ చండీ నవశతీ మంత్రమాల అఖండాద్వైతసిద్ధినిచ్చు నవాక్షరీ మంత్ర తత్వ ప్రబోధిని.

(మా ప్రథమ ద్వితీయ ముద్రణములందలి ఉపోద్ఘాతము, పండితాభిప్రాయములు చదువుడు-)

సమయ దక్షిణాచారపరులందరును "నారాయణ సమారంభాం..." అని పఠింతురు గాన అందరిదీ ఒకే సంప్రదాయము. మూల మంత్రము ఒకటే. అందుచేత నవాక్షరీ మంత్ర దీక్షాపరులు ప్రస్తుతము సప్తశతి పారాయణ చేయుచున్ననూ, సప్తశతి లోని లోపములు గ్రహించి, నవశతి పారాయణ చేయవచ్చును. పరంపర అనుటయందు వైదికాచార పరంపర అనియే అర్థము. పారాయణావిధానమందు పరంపరయుండదు- అనన్య భక్తిగల ఉపాసన ఫలదాయకము- ప్రధమములో మనవి చేసినట్లు- ఉపాసకులకు శిష్టాచారము ముఖ్యము. సత్యాన్వేషణరతి, అనన్య భక్తి ప్రధానములు. శాఖ, ప్రాంతీయ, ద్వేషములను విసర్జించి పవిత్ర భావముతో ఆసేతుహిమనగ పర్యంతము అలరారు వైదిక సాంప్రదాయ విశిష్టతను సంసేవించుటకు, సదా సర్వులు కృషిచేయవలెనను ధ్యేయముతో ఈ మనవి చేయుచున్నాము.

శ్రీ దేవీ నవశతి మంత్రమాలను పరిష్కరించి నాకు 30 సంవత్సరముల గా తోడునీడగాయుండె ఈ గ్రంధ ప్రచారమునకు తోడ్పడిన బ్రహ్మశ్రీ నౌరిపెద్ది రామసుబ్బశర్మగారి అకాల మృతికి నవశతి గ్రంథమండలి వారి తరపున, నా కుటుంబ సభ్యుల తరపున సంతాపమును తెలుపుకొనుచున్నాను. తెలుగున చక్కని విమర్శతోగూడిన ఉపోద్ఘాతము వ్రాసియుండిరి. దానిని ప్రచురించియే యున్నాము. సంస్కృత లిపిలో ఈ నవశతి గ్రంథమును వ్రాయించియున్నాము. అందుకుగూడ శ్రీశర్మగారు సంస్కృత భాషలో సంస్కృత లిపిలో తమ ప్రాణమిత్రునితో ఉపోద్ఘాతము వ్రాయించి ఇచ్చియున్నారు. ఆ గ్రంథము ప్రచురణకాకముందే శ్రీ శర్మగారు పరమపదము చేరిరి. వారి ఆత్మకు శాంతి చేకూరుగాక.

శ్రీ దేవీ నవశతి మంత్రమాలను శ్రుతి స్మృతి పురాణ ప్రమాణములతో చక్కని తెలుగు సేతను అందించినవారు శ్రీశ్రీశ్రీ పరిపూర్ణ ప్రకాశానంద యతీంద్రుల శిష్యులు, వేదాన్త శిరోమణి, వేదాన్త విశారద, తర్కాచార్య, సాహిత్య శిరోమణి, బ్రహ్మశ్రీ రాణి నృసింహశాస్త్రిగారి పుత్రులు అయిన బ్రహ్మశ్రీరాణి రామకృష్ణగారు. రాణి వంశజులు. వేదవిదులు. శ్రౌతులు, పండితోత్తములు. శ్రీరామకృష్ణగారు వేదశాస్త్రో

పనిషత్తులందేగాక M.S.c Phd చేసి డాక్టరేటు పొంది సదాచారపరులై సద్గుణశీలిగా ప్రశాంత జీవితమును గడుపుచున్నారు. శ్రీదేవి సంకల్పముచే వీరి పరిచయము గాయత్రీ ఉపాసకులైన శ్రీసందెపూడి వీర రాఘవ రావు గారి వలన చేకూరినది- వీరి తెలుగుసేత చదివిన భక్తజనులకు శ్రీదేవీ మాహాత్మ్యము సువిదితమై మానసోల్లాసమును, సుఖశాంతులను ప్రసాదించగలదు.

శ్రీ రామకృష్ణగారికి వారి కుటుంబమునకు శ్రీదేవి ఆయురారోగ్య ఐశ్వర్యములనిచ్చుగాక. అటులనే నాసంకల్పమునకు సహాయ సహకా రములందించిన శ్రీరాఘవరావు గారికిని, వారి కుటుంబమునకును, శ్రీ రామాబుక్ డిపో శ్రీశివరామయ్యగారికిని, శ్రీనారపరాజు వెంకట రమణరావు గారికిని, శ్రీ బెహరా సుబ్రహ్మణ్యారావు గారికిని, శ్రీ నిమ్మల శ్రీనివాస గౌడ్ గారికిని, గ్రంధ ముద్రణకు సదా మాతో డునీడగా నిలబడిన చిరంజీవి కృష్ణ కిశోర్ భక్త బృందమునకు శ్రీదేవి అన్నివిధముల సుఖసంతోషముల నొసంగుగాక---

అమూల్యమైన పండితాభిప్రాయములనందజేసిన పండితవర్యులందరికి మా ధన్యవాదములు. చక్కగా, సకాలములో యీ ముద్రణ చేసి ఇచ్చిన శ్రీ ఈశ్వర్ లేజర్ గ్రాఫిక్స్ వారికి, శ్రీదేవి ఆయురారోగ్యములనిచ్చి కాపాడుగాక.

సర్వేజనాస్సుఖినోభవంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీ గోషానందనాథులు
ప్రచారకులు-

శ్రీః

# శ్రీ చండీ సప్తశతీ మంత్రమాలా

## తెలుగు అనువాదము

## ప్రథమాధ్యాయము

## హరిః ఓమ్

## ఓం నమశ్చండికాయై

క్రౌష్టుకి ఇట్లు పల్కెను.

1. ఓ మార్కండేయా! నీవు గొప్ప ప్రజ్ఞగలవాడవు. అన్ని శాస్త్రములందు దిట్టవు. నీవు పవిత్రమైన దేవీ మాహాత్మ్యమును సంపూర్ణముగా వివరింప దగుదువు.

2. స్వామి! పూర్వమన్వన్తరమందు ఈ భూమండలము ఎవనిచే ప్రకాశింప చేయ బడెను? మనువు అని పేరు పొందిన ఈ సావర్ణి కుడెవడు?

3. చండికా దేవియే మహామాయ అనియు, ఆమెయే ఈ సమస్తమైన స్థావరజంగ మాత్మకమగు లోకత్రయమును వ్యాపించి యున్నదనియు కీర్తింపబడు చున్నది. ఈ చండికాదేవి ఎవరు?

4. ఓ మహాయోగీ! నీవు సర్వము తెలిసినవాడవు. ఆమెయొక్క పుట్టుకను గురించి వివరముగా చెప్పుడు. మీకు ప్రణమిల్లుచున్న నాకీ విషయమును చెప్పుట సర్వులకు ఉపకారమే యగును.

5. స్వాయంభువుడు మొదలుగా గల ఏడ్గురు మనువులు గురించి, వారి మధ్య కాలమందు గల దేవతలు, రాజులు, మునుల గురించి నాకు చెప్పితిరి.

6. ఓ మహామునీ! ఈకల్పములో పుట్టబోయే ఏడ్గురు మనువుల గురించి, దేవతలు మొదలగు వారి గురించి చెప్పుడు.

శ్రీ మార్కండేయుడు ఇట్లు పలికెను.

7. సూర్యుని కుమారుడగు సావర్ణి ఎనిమిదవ మనువు. సావర్ణి పుట్టుకను నేను విస్తరముగ చెప్పెదను. వినుము.

**విశేషాంశములు:** దేవీ మాహాత్మ్యము మార్కండేయుడు, భాగురిల మధ్య సంభాషణ రూపమున నున్నది. ఈ సంవాదమును త్రికాలజ్ఞులు, వేదవిత్తులు, పక్షిరూపులునగు మహర్షులు జైమినికి బోధించిరి. కాన "మార్కండేయ ఉవాచ" అను పలుకులు పక్షిరూపులగు మహర్షులవి. జైమిని నుద్దేశించి పలికినవి.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వన్తరములు, వంశానుచరితము అను అయిదు అంశములను పురాణములు వర్ణించును. వీనిలో నాల్గవదగు వంశాను చరితమును మార్కండేయుడు చెప్పుచున్నాడు. సావర్ణి దేవీప్రసాదము వలన మన్వన్తరాధిపతి అయెను. కాన ఈ వృత్తమును వర్ణించుట ద్వారా దేవీ మాహాత్మ్యమే వర్ణింపబడును. ఈ సావర్ణి గురించిన పురాణ గాథ సంక్షేపముగ నిట్లున్నది.

"సంజ్ఞా" అనునామె విశ్వకర్మ కుమార్తె. సూర్యుని భార్య. ఆమెకు వైవస్వతమనువు, యముడు అను ఇద్దరు కుమారులు, యమున అను కుమార్తె కలిగిరి. ఒకప్పుడు సంజ్ఞ తండ్రిఇంటికి వెళ్లదలచెను. కాని సూర్యుడు నిరాకరించెను. ఆమె అపుడు తన ప్రభావముచే తనకు ప్రతిరూపముగా ఛాయామయి యగు స్త్రీని సృష్టించి తన స్థానములో నిలిపి పుట్టింటికి వెళ్లెను. సూర్యుడు ఆ ఛాయారూపమును సంజ్ఞ అనియే భావించుచూ, ఆమెయందు సావర్ణి, శని అనుపుత్రులను, తపతి అను కన్యను పొందెను. సంజ్ఞ కొంతకాలము పుట్టింటనుండి, తిరిగి వచ్చి ఛాయను తనలోనికి ఉపసంహరించుకొనెను. తన అన్నయగు వైవస్వతమనువుతో సమానమైన వర్ణముగల ఛాయాపుత్రునకు సావర్ణియను పేరు కలిగెను.

8. మహాపురుషుడు, సూర్యపుత్రుడునగు సావర్ణి మహామాయ (దేవీనామధేయము) యొక్క అనుగ్రహముచే మన్వంతరప్రభువాయెను. ఆ విషయమును వివరించెదను.

**విశేషాంశములు:** సమస్త ప్రాణులు ప్రలయమునందు ఏతత్త్వమందు లయమగునో ఆతత్త్వమే మాయ (మాస్తి ప్రలీయన్తే యస్యామితి). అపరిచ్ఛిన్నసామర్థ్యముగల మాయారూపము గాన దేవి మహామాయ అనబడును. ఈ పదమునకు సాంఖ్యపరికల్పితమగు ప్రధానము అర్థము కాదు.

డెబ్బది ఒక్క దివ్యయుగముల కాలమునకు మన్వన్తరమని పేరు.

9. పూర్వము స్వారోచిష మన్వంతరమునందు చైత్ర వంశములో జన్మించిన సురథుడను రాజు సమస్త భూమండలమును పాలించెను.

**విశేషాంశములు:** చైత్రుడు స్వారోచిషమనువు యొక్క కుమారుడు "చైత్ర కింపురుషాద్యాశ్చ సుతాస్తస్య మహాత్మనః" అని మార్కండేయ పురాణము.

10. అపుడు సురథుడు ప్రజలను స్వీయపుత్రులవలె చక్కగా పాలించుచుండగా, 'కోలావిధ్వంసులు' అను రాజులతో విరోధమేర్పడెను.

**విశేషాంశములు:** 'కోలావిధ్వంసులు' అనగా శత్రురాజధానియగు 'కోలా' నగరమును నాశనము చేసినవారు అని అర్థము. ఈ పదము ఒకానొక క్షత్రియ కులమునకు పేరు. ఆ పేరు గల అదిమవాసులు ఈనాటికీ భారతదేశమునందు గలరు.

11. గొప్ప శక్తి గల సైన్యముతో కూడిన ఆ సురథునకు కోలావిధ్వంసులతో యుద్ధము జరిగెను.

12. కోలావిధ్వంసులు బలహీనులే అయినను, సురథుడు వారి చేతిలో ఓడి పోయెను.

విశేషాంశములు: యుద్ధములో జయాపజయములు సంపూర్ణముగా పురుష కారము పైన గాక, కొంతవరకు దైవముపై ఆధారపడి యుండును. దీనికి సరథుడే దృష్టాంతము.

13 ఆ మహాభాగుడు యుద్ధభూమిలో బలవంతులగు శత్రువులచే పరాజితుడై తన నగరమునకు వచ్చి తన రాజ్యమునకు మాత్రమే ప్రభువుగా నుండెను.

విశేషాంశములు: మహాభాగుడు అను విశేషణము యుద్ధమునకు పూర్వము సురథుని స్థితిని సూచించును. 'ప్రబల' అను విశేషణము యుద్ధము తరువాతి కోలావిధ్వంసుల స్థితిని సూచించును.

14. సురథుడు తన రాజధానిలో దుర్బలుడై ఉన్నప్పుడు కూడా, బలవంతులు, దుష్టులు, మోసబుద్ధి గలవారునగు మంత్రులు, గొప్ప పరాక్రమము గల వారయ్యు, శత్రుపక్షములో చేరిన కుమారులు కలిసి అతని సైన్యమును తమ వశము చేసికొని, కోశాగారమును అపహరించి వేసిరి.

విశేషాంశములు: 'సత్యోయం లోక ప్రవాదో యద్విపద్విపదం సంపత్సం పదమను బధ్నాతీతి!' ఆపదలుగాని, సంపదలుగాని వరుస వరుసగా వచ్చునను నానుడి నిజము. సురథుని విషయములో నట్లే జరిగెను.

15. అపుడు అధికారము కోల్పోయిన ఆ రాజు వేటయను మిషతో గుర్రమునెక్కి ఒంటరిగా దట్టమగు అడవిలో ప్రవేశించెను.

16. ఆతడు అడవిలో ఒక ఆశ్రమమును చూచెను. అది సుమేధసుడను బ్రాహ్మ ణ శ్రేష్ఠునిది. అచట క్రూరమృగములు కూడా హింసను విడనాడి తిరుగుచుండెను. ఆ యాశ్రమము మునులతో, శిష్యులతో ప్రకాశించుచుండెను.

విశేషాంశములు: సర్వకాల సర్వావస్థలయందు అహింసావ్రతమును పాటించు మహర్షుల సన్నిధిలో సింహ గజ, వ్యాఘ్ర మృగ, నకుల సర్ప, మార్జార మూషకాది సహజ వైరముగల జంతువులు కూడా తమ వైరమును విస్మరించి సంచరించును. ఈ విషయమునే పతంజలి మహర్షి యోగ సూత్రములలో నిట్లు చెప్పెను.

"అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః"

17. ఆ రాజు మహర్షిచే సత్కరింపబడిన వాడై ఆయన ఆశ్రమమునందే ఇటునటు సంచరించుచూ, కొంతకాలము ఉండెను.

విశేషాంశములు: 'కాలం' అను ద్వితీయా విభక్తి చేత, ఆ రాజు ఆశ్రమమును ఒక్క క్షణము కూడా వీడలేదని తెలియుచున్నది. "కాలాధ్వనో

రత్యన్త సంయోగే అని పాణిని సూత్రము.

18. విష్ణుమాయాప్రభావముచే సురథునకు తాను కోల్పోయిన రాజ్యాధికమునందు మమకారము బయలుదేరెను.

19. ఇట్టి మమకారముతో ఆకర్షింపబడిన మనస్సుకల ఆ రాజు అపుడు అచట ఇట్లు తలపోసెను. "శత్రువులచే బలాత్కారముగా అపహరింపబడిన నా రాజ్యమెట్లున్నదో? ఆ రాజధానిని ఒకప్పుడు నా పూర్వజులు పాలించిరి. ఇపుడది నాకు కాకుండ పోయినది. దుర్మార్గులగు నా భృత్యులు ధర్మబద్ధముగా పాలించుచున్నారో, లేదో, నాకు తెలియకున్నది.

20. గజములలో శ్రేష్ఠమైనట్టియు, శత్రువులకు దుర్జయమైనట్టియు, సదామదము అను పేరుగల (ఎల్లప్పుడు మదించి యుండునది) నా గజము శత్రువుల వశమై ఏమి సుఖములను పొందుచున్నదో నేనెరుంగను.

21. ఎవరైతే నా అనుగ్రహము వలన ధనమును, భోజనాదులను పొంది నన్ను నిత్యము సేవించెడివారో, వారీనాడు నిశ్చయముగా ఇతరరాజులను సేవించు చుందురు.

22. నా భార్య మిక్కిలి సుందరి. నా కుమారుడు కూడా మిక్కిలి సుందరుడు. భవనములు స్వర్గమును పోలియుండును. స్త్రీలు అప్సరసలను పోలియుందురు.

23. ఎంతో కష్టమునకోర్చి సంపాదించబడిన ఆ కోశము దుర్వ్యయము చేయు స్వభావముచే ఎల్లప్పుడు దుబారా ఖర్చుచేయు నామంత్రులచేత, కుమారునిచేత నాశనము చేయబడగలదు.

24. ఈ విధముగా ఆ రాజు పరిపరివిధముల తలపోయుచుండెను.

25. ఆ రాజు అచట ఋష్యాశ్రమ సమీపములో ఒక వైశ్యుని చూచెను. అతడు కుమారులు, మనుమలు మొదలగు స్వజనులచేత తరుమబడి, ఆ వనమునందు దుఃఖముతో సంచరించుచూ, దైన్యముతో నిండిన మనస్సు కలవాడై ఉండెను.

26. ఆ రాజు అతనిని ఇట్లు ప్రశ్నించెను. ఓయీ! నీవెవడవు? ఇచటకేల వచ్చితివి? నీవు దుఃఖించుచున్నట్లు, నీ మనసు దైన్యముతో నున్నట్లు కనబడు చున్నావు. కారణమేమి?

27. నీ మనసులో నున్న నిజమును పలుకుము. నీకు శుభము కలుగును. నీకిచట దుఃఖము ఉండబోదు. ఇంతవరకుగల దుఃఖము కూడా తొలగి పోవును.

28. ఆ రాజు యొక్క ప్రేమపూర్వకమగు ఈ మాటను విని, ఆ వైశ్యుడు సవినయముగా రాజునకిట్లు బదులిచ్చెను.

29. నేను ధనవంతుల కులములో పుట్టిన, 'సమాధి' యని ప్రసిద్ధిగాంచిన వైశ్యుడను.

30. ధనలోభము వలన నా పుత్రులు, భార్య నన్ను తరిమివేసిరి. నా భార్య, పుత్రులు, బంధువులు నా ధనమునవహరించిరి. ఆప్తబంధువులందరిచే తిరస్కరింపబడి, దుఃఖముతో అడవిని చేరితిని.

విశేషాంశములు: 'దారయన్తీతి దారాః' అను వ్యుత్పత్తిచే భర్తను వాని సోదరులనుండి విడదీయునది గనుక భార్య 'దార' యనబడును.

31. నేను అడవిలో నున్నవాడనై నా పుత్రులు, భార్య, బంధువుల యొక్క కుశలాకుశలములను గూర్చిన వార్తలను తెలియకున్నాను.

32. ఇప్పుడు వారందరు ఇంటిలో క్షేమముగా నున్నారో, లేదో నాకు తెలియకున్నది.

33. నా కుమారులెట్లు ఉన్నారు? సత్ప్రవర్తనులేనా? లేక దుష్టవ్యవహారము కలిగి ఉన్నారా? నాకు తెలియకున్నది.

34. ఓ రాజశ్రేష్ఠా! ఇదియే రాత్రింబగళ్లు నామనస్సు యందున్నది.

రాజిట్లు పలికెను.

35. ఏ భార్యాపుత్రాదులు లోభముతో ధనమును అపహరించి నిన్ను వెళ్లగొట్టిరో, వారియందు నీ మనస్సు ఏల ప్రేమబంధమునే కలిగియున్నది?

వైశ్యుడిట్లు పలికెను.

36. ఓ రాజా! నీవు నా గురించి పలికిన మాట సత్యమే.

37. నా మనస్సు కోపమును పొందజాలకున్నది. నేనేమి చయుదును?

38. ఏ పుత్రులు ధనలోభముచే తండ్రియందలి ప్రేమను విడచి, నన్ను వెళ్లగొట్టిరో, ఏ భార్య భర్త యందలి ప్రేమను విడిచిపెట్టినదో, ఏ బంధువులు నన్ను తమవానినిగా ప్రేమించలేదో, అట్టి పుత్రులయందు, భార్యయందు, బంధువులయందు నా మనస్సు అనురాగమునే కలిగి యున్నది.

39. ఓ గొప్ప బుద్ధిగల రాజా! బంధువులు దుష్టులేయైనను, నామనస్సు వారియందు ప్రేమనే కలిగియున్నది. దీనికి కారణమేమియో నాకు ఆలోచించినను తెలియకున్నది.

విశేషాంశములు: దారైషణ, పుత్రైషణ, విత్తైషణ అను ఏషణాత్రయము బంధహేతువు. ఇవి దేవభూయిష్ఠములని తెలిసియు, మానవుడు వీటిని తేలికగా పరిత్యజింపజాలడు. సురథుడు, సమాధి ఈ ఏషణాత్రయపీడితులే. ఏషణాత్రయము నతిక్రమించిన మహానుభావులు పరివ్రాట్టులగుదురు. వారిని గూర్చి బృహదారణ్యకోపనిషత్తు ఇట్లు చెప్పినది. "తే హస్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి".

40. వారి నిమిత్తమై నాకు వేడినిట్టూర్పులు, మనస్సులో దుఃఖము కల్గుచున్నవి.

41. నాకు ద్రోహము చేసినను, నా బంధువులపై నామనస్సులో కాఠిన్యము కలుగుట లేదు. ఏమి చేయుదును?

శ్రీ మార్కండేయుడు ఇట్లు పల్కెను.

42. ఓ భాగురీ! అపుడు వారిద్దరు కలిసి సుమేధసముని వద్దకు వెళ్ళిరి.

43. సమాధియను ఆ వైశ్యుడు, రాజశ్రేష్ఠుడగు సురథుడు కలిసి, ఆ మహర్షికి యథోచితముగ నమస్కారాదుల నాచరించి, ఆయనవద్ద కూర్చుని, తమ తమ అర్హతప్రకారము తమ కథలను చెప్పజొచ్చిరి.

రాజిట్లు పలికెను.

44. హే భగవన్ ! నేనొక సంగతిని మిమ్ముల నడుగ కోరుచున్నాను. మీరు చెప్ప ప్రార్థన.

విశేషాంశములు: భగవంతుడు సర్వజ్ఞుడు. "భగవన్" అని సంబోధించుటచే, తన యొక్క సంశయమును సుమేధసముని తప్పక తీర్చగలడని రాజు అభిప్రాయము అని స్పష్టమగుచున్నది.

45. అదియేదన, నామనస్సు నాఅధీనమందు లేకపోవుట వలన తరచు దుఃఖమునకు గురి యగుచున్నది.

46. ఓ మునిశ్రేష్ఠా ! నేను రాజ్యభ్రష్టుడను అని నాకు తెలియును. కాని అజ్ఞానికి వలె నాకు రాజ్యాంగములన్నిటియందు మమకారము మాత్రము వదలకున్నది. ఇట్లు యేల జరుగుచున్నది?

విశేషాంశములు: రాజ్యాంగములు ఏడు: రాజు, మంత్రి, ఖజానా, దేశము, దుర్గము, సేన, మిత్రులు అనునవి.

47. ఈ సమాధియను నాతడు పుత్రులచే, భార్యచే వెళ్లగొట్టబడెను. సేవకులచే బంధువులచే పరిత్యజింపబడెను. అయినను వారియందు మిక్కిలి అనురాగ మునే కలిగియున్నాడు.

48. ఈ విధముగా ఈతడు, నేను, మేమిద్దరము కూడా దోషము స్పష్టముగా కన్పడుచున్న విషయమునందు కూడా మమకారముచే నాకర్షింపబడిన మనస్సు గలవారమై మిక్కిలి దుఃఖించుచున్నాము.

49. ఓ మహాపురుషా ! జ్ఞానము గలవారమైనను మాకిద్దరికి ఇట్టి మోహము ఏల కల్గుచున్నది? మేము వివేకము కోల్పోయి మూఢులమగుటకు హేతువేది?

మహర్షి ఇట్లు చెప్పెను.

50. సమస్త ప్రాణులకు ఇంద్రియ గోచరములగు విషయములందు జ్ఞానము కలదు.

51. ఓ మహాభాగా ! ఈ ఇంద్రియగ్రాహ్యమగు జ్ఞానము విభిన్నరీతులలో నుండును.

విశేషాంశములు: విషయజ్ఞానము రెండు రకములు. చర్మము, నేత్రము, చెవి, ముక్కు, జిహ్వ అను ఇంద్రియములు క్రమముగా స్పర్శ, రూపము, శబ్దము, గంధము, రసములను గ్రహించును. ఇది మొదటిది. 'ఇది నాఇల్లు,

ఇది నా రాజ్యము. ఈమె నాభార్య' ఇత్యాది బుద్ధిపరికల్పితమగు విషయ జ్ఞానము రెండవది. ఈ రెండు విధముల జ్ఞానము సమస్త ప్రాణులకు గలదు.

౫౨ కొన్ని ప్రాణులు పగలు చూడలేవు. మరికొన్ని రాత్రి చూడలేవు. కొన్ని పగలు, రాత్రి కూడా సమానమైన దృష్టి కలిగి యుండును.

విశేషాంశములు: గుడ్లగూబ, బొద్దింక మొదలగునవి దివాంధములు. గ్రద్దలు, కాకులు మొదలగు ప్రాణులు రాత్రి చూడలేవు. పెద్దపులి, పిల్లి మొదలగునవి పగలు, రాత్రి సమానముగా చూడగలవు.

౫౩. మనుష్యులు జ్ఞానము కలవారను మాట నిజమే ! కాని కేవల ఇంద్రియ జ్ఞానము వలన ఏమి ప్రయోజనము? ఏలయన, పశు పక్ష్యాది ప్రాణులన్నియు జ్ఞానము కలవియే గదా !

౫౪ మనుష్యులకు గల జ్ఞానము మృగములకు, పక్షులకు కూడ గలదు. వాటికి గల జ్ఞానము మనుష్యులకు కూడ గలదు. అదేవిధముగా, మానవులకు, పశువులకు అజ్ఞానము కూడ సమానమే.

విశేషములు: "ఆహారనిద్రాభయమైథునాని సమానమేతత్పశుభిర్నరాణామ్". అనగా, ఆహారము, నిద్ర, భయము, సంతానోత్పత్తి అను నాల్గు అంశములలో మానవులకు, పశువులకు భేదము లేదు. ఈ విషయమునే మంత్రము లోని "అన్యత్" అనుపదము సూచించును.

౫౫. పక్షులు, తాము సంపాదించిన ఆహారమును పిల్లలకిచ్చివేసినచో ఆకలితో తాము బాధపడవలెనని తెలిసినను, తమ పిల్లలనోటికి జాగ్రత్తగా ఆహారము నందించును. సంతానమందలి ప్రేమ అనే మోహము వలన ఆకలితో బాధపడు అట్టి పక్షులను పరిశీలింపుము.

౫౬. ఓ మానవశ్రేష్ఠుడా ! మనమిప్పుడు పెంచి పోషించిన పిల్లలు వృద్ధాప్యములో మనల నాదరించ గలరు అనే ప్రత్యుపకార లోభము వలన మానవులు తమ కుమారులను ప్రేమించుచున్నారు. నీవిది కనుట లేదా?

౫౭ కుమారులు ప్రత్యుపకారము చేయక పోయినను, మానవులు సంసారస్థితికి కారణమగు మహామాయ యొక్క ప్రభావము చేత, మమకారమనే సుడి గుండముతో కూడిన మోహమనే జలఖాతమునందు పడిపోవుచున్నారు.

విశేషాంశములు: 'పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనం' అను రీతిని జననమరణ ప్రవాహమే సంసారమనబడును.

౫౮. కాని ఈ విషయములో నీవాశ్చర్యపడవలదు. ఇది జగత్ప్రభువగు శ్రీ మహావిష్ణువు యొక్క యోగనిద్రారూపమగు మహామాయ. ఆమె చేతనే జగత్తు మోహితము చేయబడుచున్నది.

విశేషాంశములు: జ్ఞానము, అజ్ఞానము ఒకే అధికరణమునందుండ జాలవని మనము తలచెదము. కాని అట్లు ఉండుట అనుభవసిద్ధము. ఇదియే యోగనిద్ర యనబడును.

"యోగో జ్ఞానం తథా నిద్రా తదభావేऽభిధీయతే|
ఉభయోశ్చైవ సంయోగో యోగనిద్రేతి కీర్త్యతే"||

అని యోగరహస్యమందు చెప్పబడెను. యోగమనగా జ్ఞానము. నిద్రయే అజ్ఞానము. ఈ రెండింటి యొక్క సామానాధికరణ్యమే యోగనిద్ర.

59. భగవతి, మహామాయా స్వరూపురాలు నగు ఆ దేవి విజ్ఞానముగల వారి మనస్సులను కూడా బలముగ నాకర్షించి మోహితులను చేయును.

**విశేషాంశములు:** భగవతీ లక్షణమిట్లు చెప్పబడెను.

"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః|
జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా"||

సమగ్రమగు ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము కలది గనుక దేవి భగవతి యనబడును. దేవీ భాగవతము భగవతీలక్షణమునిట్లు చెప్పెను. "ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానామాగతిం గతిమ్| అవిద్యావిద్య యోస్తత్త్వం వేత్తీతి భగవత్యసౌ". అనగా ఈ దేవి సృష్టి ప్రలయములను, ప్రాణుల జననమరణములను అవిద్య, విద్యల తత్త్వమును ఎరుంగునది గాన భగవతి యనబడును.

ఈ మంత్రము "బలవానింద్రియగ్రామో విద్వాంసమపకర్షతి" అను వ్యాసుని శ్లోకమును గుర్తునకు తెచ్చును.

ఇచట ఒక శంక ఉదయించును.

"యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః|
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః"||

ఇత్యాది శ్రుతులు, "ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి" అను స్మృతియు, జ్ఞానికి మోహము లేదని చెప్పుచుండగా, జ్ఞానికి కూడ మోహము కలుగుననుట ఎట్లు పొసగును?

జ్ఞానము రెండు విధములు. అపరోక్షము, పరోక్షము. పైనుదహరించిన శ్రుతిస్మృతులు అపరోక్ష జ్ఞానికి మోహము లేదని చెప్పు చున్నవి. పరోక్ష జ్ఞానికి అద్వైత సాక్షాత్కార పర్యంతము మోహము, సంసారము తప్పవు. ఈ విషయమునే శ్రీమచ్ఛంకరభగవత్పాదు లిట్లు చెప్పిరి.

"శ్రుతి శత నిగమాన్త శోధకానప్యహహ ధనాద్యభిదర్శనేన సద్యః|
కలుషయతి చతుష్పదాద్యభేదాదఘటితఘటనా పటీయసీ మాయా"||

60. ఆమెయే స్థావర జంగమాత్మకమగు జగత్తును సృష్టించుచున్నది.

**విశేషాంశములు:** "మత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్" అని దేవ్యథర్వోపనిషత్తు చెప్పుచున్నది.

ఈ మంత్రములో సృష్టి స్థితి లయములకు ఉపలక్షకము. దేవీ భాగవత మిట్లు చెప్పుచున్నది.

"సా విశ్వం కురుతే కామం సా పాలయతి సర్వదా|
కల్పాన్తే సంహరత్యేషా త్రిరూపా విశ్వమోహినీ"||

వరములనిచ్చు ఆ దేవి ప్రసన్నురాలైనచో, మానవులకు ముక్తి నిచ్చును.

ఆమెయే మోక్షకారణమగు సనాతనమగు పరా విద్యా స్వరూపురాలు.

విశేషాంశములు: "నాన్యః పంథా విద్యతేऽయనాయ", "విద్యయాऽమృత మశ్నుతే" ఇత్యాది శ్రుతులచేత, "జ్ఞానాదేవ తు కైవల్యం" ఇత్యాది స్మృతులచేత వర్ణింపబడిన బ్రహ్మవిద్య దేవీ స్వరూపమే.

ఆ సర్వేశ్వరేశ్వరియే సంసారబంధమునకు కారణము.

విశేషాంశములు: సర్వేశ్వరేశ్వరి యనగా బ్రహ్మాది ప్రభువులను కూడ నియమించునది. సంసార బంధమనగా 'కర్మవిద్య' యని అర్థము. ఎలయన, కర్మవిద్య పుణ్యము ద్వారా సుఖమును కలుగజేసి, జీవునకు బంధహేతువే అగును. అట్టి కర్మవిద్య కూడ దేవీ స్వరూపమే.

ముండకోపనిషత్తులో విద్యలు రెండుగా విభాగము చేయబడినవి. "ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ యద్బ్రహ్మవిదో వదంతి పరా చైవాపరా చ| తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదస్సామవేదో ऽథర్వవేదశ్శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి| అథ పరా యయా తదక్షరమధి గమ్యతే"| ధర్మాధర్మ సాధన తత్ఫల విషయమగు విద్య అపరా విద్య. ఉపనిషద్వేద్యమగు అక్షర పరబ్రహ్మవిషయమైన విద్య పరావిద్య. ఇట్టి రెండు విద్యలు దేవీ స్వరూపమే.

రాజు ఇట్లు పలికెను.

హే భగవన్! ఏదేవిని మీరు 'మహామాయా' అని వర్ణించితిరో, ఆమె ఎట్లు పుట్టెను? హే మహర్షీ! ఆమె చరిత మెట్టిది?

విశేషాంశములు: సమష్టి అజ్ఞానమునకు మాయ అని పేరు. జగన్మాత ఆమె మాయయే అయినచో, ఆమె మోక్షహేతు వెట్లగును? అను ప్రశ్న ఉదయించును. ఈ మంత్రములలో 'మాయా' పదమునకు సమష్ట్యజ్ఞానము అర్థము కాదు. మాయాకార్య జగచ్ఛరీరావచ్ఛిన్న పరాశక్తి 'మహామాయా' అని చెప్పబడును. కాలోత్తరమునందీ విషయము స్పష్టము చేయబడినది.

"మాయాశక్త్యాదిశబ్దాశ్చ విశిష్టస్యైవ వాచకాః|
తస్మాన్మాయాది శబ్దైస్తు బ్రహ్మైవేహాన్యముచ్యతే"|

మాయ, శక్తి అను శబ్దములు మాయావిశిష్ట, శక్తివిశిష్ట పరబ్రహ్మమునే బోధించును.

బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడగు ఓ మహర్షీ! ఆదేవి ఎట్టి స్వభావము గలది? ఆమె స్వరూప మెట్టిది? ఆమె ఎట్లు ఉద్భవించెను? ఈ విషయ మంతయు నేను వినగోరుచున్నాను.

విశేషాంశములు: దేవీ మాహాత్మ్యమును వర్ణించుటకు బ్రహ్మవేత్తయే అర్హుడు అని ఈ మంత్రములో సంబోధన సూచించును.

మహర్షి ఇట్లు పలికెను.

66. ఈ జగత్తు సనాతని యగు ఆ దేవి యొక్క స్వరూపమే. ఆమె చేతనే ఈ జగత్తంతయు వ్యాప్తమై యున్నది.

విశేషాంశములు: 'నిత్యా' అనుటచే ఆమెకు ఉత్పత్తి లేదనియు, 'జగన్మూర్తిః' అనుటచే ఆమె రూపము వర్ణింప శక్యము కాదనియు తెలియుచున్నది.

67. అయినప్పటికి ఆమె అనేక రూపములలో ఉద్భవించును. అట్టి ఉద్భవమును గూర్చి చెప్పెదను వినుము.

విశేషాంశములు : దేవి నిత్యయే అయినను, ఉపాధికృతమైన శివా, చండీ గౌరీ ఇత్యాది రూపములతో ఉద్భవించును.

68. ఆమె నిత్యురాలే అయినను,ఆమె దేవతల కార్యసిద్ధి కొరకు ఆవిర్భవించి నపుడు 'పుట్టెను' అని ప్రజలు వర్ణింతురు.

**విశేషాంశములు:** పూర్వకర్మకు తగిన జన్మను పొందుట ఉత్పత్తి. ఇట్టి ఉత్పత్తి దేవికి లేదు. ఆమె స్వేచ్ఛగా లోకానుగ్రహార్థము రూపమును ధరించును. ఇది ఆవిర్భావము.

69. ప్రలయ కాలమునందు జగత్తంతయు ఒకే సముద్రము కాగా, సర్వసమర్థు డగు విష్ణు భగవానుడు ఆదిశేషుని తల్పముగా చేసి, యోగనిద్రను పొందెను. అపుడు మధుకైటభులని ప్రసిద్ధిచెందిన ఇద్దరు ఘోర రాక్షసులు విష్ణువు యొక్క చెవి గులిమి నుండి జన్మించి, బ్రహ్మను హింసించుటకు యత్నించిరి.

విశేషాంశములు: కల్పాంతమునందు పుష్కరావర్తకాది మేఘములు జగత్తును ఏకార్ణవముగా చేయును.

70. సృష్టికర్త యగు బ్రహ్మ విష్ణువు యొక్క నాభి కమలమందున్న వాడై, నిద్రించుచున్న జనార్దనుని, ఇద్దరు భయంకరాకారులగు రాక్షసులను చూచెను. తేజశ్శాలులలో శ్రేష్ఠుడగు బ్రహ్మ ఏకాగ్రమైన హృదయముతో యోగనిద్రను స్తుతించెను. ఆమె విష్ణువు యొక్క నేత్రముల నాశ్రయించి ఉండెను. ఆమెయే విశ్వమునకు ప్రభ్వి. ఆమెయే జగత్తు యొక్క సృష్టిస్థితిలయ ములకు హేతువు. ఆమె విష్ణువునకు కూడ మోహము కలిగించగల సాటిలేని మహా మహిమాన్విత. విష్ణువును నిద్రలేపుట కొరకై ఆమెను బ్రహ్మ ఇట్లు స్తుతించెను.

విశేషాంశములు: ఈ మంత్రములో నిద్రాం అను పదము 'యోగనిద్రాం' అనుదానికే పునరనువాదము. అంతే గాని, తామస రూపిణి యని అర్థముకాదు. 'స్థితి సంహారకారిణీం', 'అతులాం' 'జగద్ధాత్రీం' అను విశేషణములు దేవి కేవల తమో గుణాత్మిక కాదని స్పష్ట పరచుచున్నవి. మరియు పరమేశ్వరుని

నుండి సాక్షాత్తుగా వేదములను స్వీకరించిన ఆదికవియగు బ్రహ్మచే ఉపాసింపబడు దేవి కేవల తామస రూపిణి కాజాలదు.

## బ్రహ్మకృత దేవీ స్తోత్రము

71. నీవే స్వాహాకారము.

**విశేషము:** దేవతల నుద్దేశించి ఆహుతులను అగ్నియందు సమర్పించునపుడు 'స్వాహా' అని ఉచ్చరింతురు. అగ్నయే స్వాహా, సోమాయ స్వాహా ఇత్యాది. ఈ పదమునకు త్యాగము అని అర్థము. యాస్కాచార్యులు స్వాహాపదమును 'సుష్ఠు ఆహ' అని నిర్వచించెను. అనగా ఏ దేవత నుద్దేశించి హవిస్సు త్యాగము చేయబడినదో, ఆ దేవత చేయు ప్రశంసయే స్వాహా పదమున కర్థము.

72. నీవే స్వధవు.

**విశేషాంశములు:** పితృదేవతలకు నివేదన చేయునపుడు స్వధాయని ఉచ్చరింతురు. 'పితృభ్యః స్వధా'. స్వధాయనగా తన బంధువులగు పితరులను పోషించుట అని యర్థము.

73. నీవే వషట్కారము.

**విశేషాంశములు:** యజ్ఞములో దేవతలకు హవిస్సు నిచ్చు సందర్భములో 'వషట్ ' అని ఉచ్చరింతురు. ఈ విధముగా యజ్ఞమందలి సర్వమంత్రములు దేవీ రూపములే. అనగా 'కర్మవిద్య' లేక 'అపరవిద్య' ఆమె రూపమే అని ఈ మంత్రముల తాత్పర్యము.

74. స్వరము నీ స్వరూపమే.

**విశేషాంశములు:** "స్వః" అనగా స్వర్గము. జ్యోతిష్టోమాది యజ్ఞఫలమగు స్వర్గము నీ స్వరూపమే. లేదా, అకారాది పదహారు అచ్చులు నీ స్వరూపమే. లేదా, షడ్జాది సప్తస్వరములు నీ రూపమే. లేదా, ఉదాత్తానుదాత్త స్వరితము లనే వైదిక స్వరములు నీ రూపమే అని యర్థము.

75. దేవతలు భుజించు అమృతము నీ స్వరూపమే.

**విశేషాంశములు:** మానవుని శిరస్సునందలి సహస్రార పద్మమునందున్నదై శ్రీ త్రిపుర సుందరి అమృత ధారలతో దేహము లోని డెబ్బది రెండువేల నాడులకు చైతన్యము నొసగునని సౌందర్యలహరి లో వర్ణింపబడెను.

"సుధాధారా సారైశ్చరణయుగలాంతర్విగలితైః
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయ మహసః|
దేవి అట్టి సుధామయి. మరియు సుధామయియగు దేవిని హృదయము నందు సదా ధ్యానించు సాధకుడు విషసర్పముల దర్పము నడంచ గలడు. జ్వరపీడితుల బాధను తన చల్లని చూపులతో తొలగించగలడు.

కిరన్తీ మంగేభ్యః కిరణనికురుంబామృతరసం హృది త్వామాధత్తే హిమకరశిలా మూర్తిమివ యః| స సర్పాణాం దర్పం శమయతి శకుంతాధిప ఇవ జ్వర ప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాధారసిరయా||
ఇట్లు దేవియేగాక దేవీభక్తులు గూడ సుధామయులే.

76. ఓ దేవీ! వేదసారమగు ప్రణవము నీ స్వరూపమే.

విశేషాంశములు: ఓంకారము సాక్షాత్తు పరబ్రహ్మమే. "ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపాప్నవానీతి" అని తైత్తిరీయోపనిషత్తు. "సర్వే వేదా యత్పద మామనంతి ....... తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యో మిత్యేతత్" అని కఠోపనిషత్తు ఓంకారమును వర్ణించెను. అట్టి ఓంకారము దేవీ స్వరూపమే.

77. ప్రణవమునందు సంహితాది వికారములు లేకుండగ నున్నట్టియు, తాల్వాది స్థాన విశేషములచే ఉచ్చరింప శక్యము కాని అర్ధమాత్ర నీవే.

విశేషాంశములు: మార్కండేయ పురాణములో ఓంకారములోని బిందు స్వరూపమునిట్లు చెప్పిరి.

నిర్గుణా యోగిగమ్యా చ అర్ధమాత్రోర్ధ్వ సంస్థితా! వాచ్యాస్త్రిస్రోऽర్ధమాత్రా తు వచసో సా న గోచరా". ఓంకారము నందలి అకార, ఉకార, మకారములు ఉచ్చార్యములే. ఇవియే గాక, ఓంకారమునందు సంహితాది గుణములు లేనట్టియు, వాక్కులకు గోచరము కానట్టియు, యోగులకు మాత్రమే సాక్షాత్కరించే బిందువు గలదు. దీనినే ౕ అను సంజ్ఞచే సూచించెదరు.

78. నీవే సంధ్యవు.

విశేషాంశములు: సంధ్యయనగా ప్రాతర్మధ్యాహ్న సాయంసంధ్యలందు భక్తులచే ఉపాసింపబడు దేవతయని అర్థము. భారద్వాజ స్మృతియందు సంధ్యాపదమిట్లు వివరింపబడెను.

'బ్రహ్మాద్యాకారభేదేన యా భిన్నా కర్మసాక్షిణీ|
భాస్వతీశ్వర శక్తిస్సా సంధ్యేత్యభిహితా బుధైః||

బ్రహ్మాదిరూపములను ధరించి, కర్మసాక్షియై, జగత్తును ప్రకాశింపజేయు ఈశ్వర శక్తియే సంధ్య యనబడును. కాలికాపురాణము సంధ్యాపదమును మరో విధముగా నిర్వచించెను.

"బ్రహ్మణో ధ్యాయతో యస్మాత్సమ్యగ్జ్ఞాతా వరాంగనా|
అతస్సంధ్యేతి లోకేऽస్మిన్ నామ తస్యా భవిష్యతి"||

బ్రహ్మ జగన్మాతృ దివ్యరూపమును చక్కగా ధ్యానమునందు సాక్షాత్కరించు కొనెను. కాన ఆమెకు 'సంధ్య' యని పేరు.

79. నీవు సావిత్రివి.

విశేషాంశములు: సర్వోత్తమమగు గాయత్రీ మంత్రమే సావిత్రి యనబడును. సావిత్రియే వేదమునకు ఆదియని మనువు చెప్పెను.

"ఓంకారపూర్వికాస్తిస్రో మహావ్యాహృతయోऽవ్యయాః|
త్రిపదా చైవ సావిత్రీ విజ్ఞేయం బ్రహ్మణో ముఖమ్"||

ఓంకారముతో గూడిన భూః, భువః, సువః అను వ్యాహృతులు, సావిత్రియు వేదమునకు అదియని తెలియవలెను. భారద్వాజస్మృతి ఇట్లు చెప్పెను.

"సవితృప్రకాశకరణాత్సావిత్రీత్యభిధా భవేత్|
జగతః ప్రసవిత్రీతి సావిత్రీ తేన వా స్మృతా"||

సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలగు జ్యోతిస్సులు స్వయంప్రకాశములు కావు. వాటి ప్రకాశము దేవి అనుగ్రహమువలన కలిగినదే. కాన ఆమెకు సావిత్రి (సూర్యుని ప్రకాశింపచేయునది) అని పేరు. జగత్తునకు జనని కనుక ఆమెకు సావిత్రియను పేరు తగియున్నది.

80. నీవు వేదజననివి.

విశేషాంశములు: "ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్". ఆ దేవి నుండియే వేదములు పుట్టినవి. "అరే అస్య మహతో భూతస్య నిశ్వసితమేతదృగ్వేదో యజుర్వేద స్సామవేదో ऽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకా సూత్రాణ్యను వ్యాఖ్యానాన్యస్యై వైతాని సర్వాణి నిశ్వసితాని" అని శ్రుతి. వేదములకు, ఇతిహాస పురాణాది సమస్త విద్యలకు ఆమెయే జనని.

81. నీవే పరదైవము.

విశేషాంశములు: 'సా కాష్ఠా సా పరా గతిః' యని శ్రుతి.

82. ఈ జగత్తు నీచే ధరింపబడు చున్నది.

విశేషాంశములు: ఈ జగత్తునకు నీవే అధిష్ఠానము అనగా ఈ జగత్తు నీయందే కల్పింపబడినది అని యర్థము.

83. ఈ జగత్తు నీచే సృష్టింపబడు చున్నది.

84. ఓదేవీ ! ఈ జగత్తు నీచే పాలింపబడుచున్నది.

85. నీవే ఎల్లప్పుడు ఈ జగత్తును ప్రళయకాలమందు భక్షించుచున్నావు.

విశేషాంశములు: కఠోపనిషత్తు పరమాత్మతత్త్వమును చరాచరజగత్తు యొక్క అత్త (భక్షించునది) గా ఉపదేశించెను.

"తస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః|
మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః||"

"అత్తా చరాచర గ్రహణాత్" అను బ్రహ్మ సూత్రముకూడ ఈ విషయమునే వివరించును.

పై మూడు మంత్రములలో చెప్పబడిన విషయమునే "యతోవా ఇమాని భూతాని జాయన్తే| యేన జాతాని జీవన్తి| యత్ప్రయన్త్యభి సంవిశన్తి" అను

శ్రుతి, "జన్మాద్యస్య యతః" అను బ్రహ్మ సూత్రము వివరించు చున్నది.

86. ఓ జగన్మయీ! సృష్టికాలమందు నీవే సృష్టి క్రియా రూపమున నున్నావు.

87. పాలనకాలమందు నీవే పాలనక్రియారూపమున నున్నావు.

88. ఓ జగన్మయీ! ఈ జగత్తు యొక్క సంహారకాలమందు నీవు సంహారక్రియా రూపమునే నున్నావు.

**విశేషములు:** ఈ మంత్రములలో ఒకే దేవీస్వరూపము కర్తృ కర్మ క్రియాత్మకముగా వర్ణింపబడెను.

89. విద్యలలో కెల్ల గొప్పదియగు బ్రహ్మవిద్య నీవే.

90. నీవే మహామాయవు.

**విశేషాంశములు:** ఈ మంత్రములో 'మాయా' శబ్దమునకు మూలావిద్య అర్థము. ఇట్లు పరస్పర విరుద్ధములగు విద్య, అవిద్యలు రెండు దేవీ రూపముగనే వర్ణింపబడెను.

91. గొప్ప మేధాశక్తివి నీవే. గ్రహణ, ధారణ, క్షమ, మగు ధీ శక్తివి నీవే.

92. గొప్ప స్మృతివి నీవే. సంస్కార రూపముతో కూడిన జ్ఞానము (అనుభవరూపము) నీవే.

93. జగన్మోహిని స్వరూపము నీవే.

**విశేషాంశములు:** మేధాస్మృతులు, మోహము పరస్పర విరుద్ధములైనను, దేవీరూపములే.

94. నీవు భగవతివి.

95. నీవు మహాదేవివి.

96. నీవు మహాసురివి.

**విశేషాంశములు:** ఈ రెండు మంత్రములు మరల దేవి యొక్క పరస్పర విరుద్ధరూపములను చూపును. ఆమెయే ఇంద్రాది దేవతా రూపముగను, హిరణ్యాక్షాది రాక్షస రూపముగను విలసిల్లు చున్నది.

97. సమస్త జగత్తునకు నీవే మూలప్రకృతివి.

98. నీవు సత్త్వరజస్తమోగుణములను ప్రవర్తింప జేసెదవు.

**విశేషాంశములు:** ప్రతి కార్యమునకు నిమిత్త కారణము, ఉపాదానకారణము అని రెండు కారణము లుండును. కుండకు మట్టి ఉపాదానము. కుమ్మరివాడు నిమిత్త కారణము. కాని జగత్తు విషయములో అట్లు కాదు. జగత్తునకు ఉపాదానము, నిమిత్తము ఒకటియే. దేవియే జగత్తునకు నిమిత్తకారణమని 83-85 మంత్రములలో చెప్పబడెను. ఇచట ఆమెయే జగత్తునకు ఉపాదానమని చెప్పబడినది. అనగా దేవి జగత్తునకు అభిన్న నిమిత్తోపాదానము.

ఈ విషయమునే "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్" అను బ్రహ్మసూత్రము చెప్పుచున్నది.

99. నీవు కాల రాత్రివి.

100. నీవు మహా రాత్రివి.

101. నీవు మోహ రాత్రివి.

102. నీవు దారుణ రాత్రివి.

103. నీవు ఘోర రాత్రివి.

**విశేషాంశములు:** కాలరాత్రి, మహారాత్రి, మోహరాత్రి శబ్దములు క్రమముగా దైనందిన ప్రలయ, బ్రహ్మప్రలయ, మహాప్రలయ దేవతలను చెప్పును. సప్తశతిలో 'దారుణా' అను పదము మోహరాత్రి విశేషణముగా వ్యాఖ్యానింప బడెను. కాని మోహరాత్రి కంటె భిన్నమైన 'దారుణరాత్రి' కలదు. శక్తి సంగమ తంత్రమిట్లు వర్ణించెను.

"దీపోత్సవ చతుర్దశ్యాః కాలరాత్రిస్తు పర్వ సా|
మహారాత్రిర్మహేశాని యద్యమావాస్యయా యుతా||
జన్మాష్టమీ మహేశాని మోహరాత్రిరితి స్మృతా|
వైశాఖశుక్లగాక్షయ్యతృతీయా దారుణోచ్యతే
ఘోరరాత్రిర్మార్గశిరః కృష్ణపక్షాష్టమీ మతా"||

104. సంపద లేక శోభ నీ స్వరూపమే.

**విశేషాంశములు:** "ఋచస్సామాని యజూగ్ంషి| సా హి శ్రీరమృతా సతామ్"|| అని చెప్పబడిన శ్రౌత 'శ్రీ' నీవే అనియు అర్థము.

105. నీవు జగన్నియన్తవు.

106. నీవు లజ్జాభిమానియగు దేవతవు.

107. నిశ్చయాత్మకమగు బుద్ధివి నీవే.

**విశేషాంశములు:** అంతఃకరణము ఒకటేయైనను, అది నిర్వర్తించు కార్యములను బట్టి వేర్వేరు పేర్లు కలిగి యుండును. సంకల్పవికల్పాత్మక మైనది మనస్సు. నిశ్చయాత్మకమైనది బుద్ధి. స్మృతి రూపమైనది చిత్తము.

108. శాస్త్ర నిషిద్ధములగు అధర్మ కార్యములందు విముఖత అనే ధార్మిక సంస్కారము నీవే.

109. నీవు పుష్టివి.

**విశేషాంశములు:** పుష్టులు పది. వాక్పుష్టి, జ్ఞానపుష్టి, శరీరేంద్రియపుష్టి, గృహక్షేత్రపుష్టి, ధనధాన్యపుష్టి, ప్రజాపుష్టి, పశుపుష్టి, గ్రామ పుష్టి, ధర్మపుష్టి, అణిమాద్యైశ్వర్యపుష్టి. ఈ పుష్టులన్నియు దేవీ రూపమే.

110. తుష్టి నీ స్వరూపమే.

విశేషాంశములు: తుష్టి యనగా అహారశయనాది ఇంద్రియ సుఖసాధనములు తనకు లభించిన దానికంటె అధికముగా కావలెననే తృష్ణ లేకుండుట. ఈతుష్టి యొక్క మాహాత్మ్యమిట్లు వర్ణింపబడెను.

"యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్|
తృష్ణాక్షయసుఖస్యైతే కలాం నార్హన్తి షోడశీమ్"||

ఈ లోకములో ఏ ఇంద్రియ సుఖములు కలవో, స్వర్గాది లోకములందు ఏ దివ్య సుఖములు కలవో, అవి అన్నియు కలిపి తుష్టి వలన కలిగే ఆనందములో పదునారవవంతు కూడ కాజాలవు. అట్టి తుష్టి దేవి రూపమే.

111. నీవు శాన్తివి.

విశేషాంశములు: శాన్తి యనగా చిత్తసమాధానము. అనగా చిత్తము ఎట్టి కల్లోలములు లేకుండగా, ప్రశాన్తముగా ప్రవహించుట. ఇట్టి శాన్తి దేవీరూపమే. మరియు, శాన్తియనగా అవిద్యాబీజములతో సహా సంసారము యొక్క ఉపశమము. అదియే మోక్షము. అట్టి మోక్షము దేవీరూపము.

112. క్షమ నీ రూపమే.

విశేషాంశములు: ఇతరులు అపకారము చేసినపుడు ప్రతీకారము చేయుగల శక్తి కలిగియున్నను, అట్లు చేయకుండుట క్షమ లేక క్షాన్తి యనబడును. ఈ దివ్యగుణము దేవీరూపమే.

113. నీవు ఖడ్గధారిణివి.

114. నీవు శూలధారిణివి.

115. నీవు భయమును గొల్పు అకారము గలదానవు.

116. నీవు గదాధారిణివి.

117. నీవు చక్రధారిణివి.

118. మరియు నీవు శంఖమును ధరింతువు.

119. నీవు ధనుర్ధారిణివి.

120. నీవు బాణములు, భుశుండము, పరిఘ అను అయుధములను ధరింతువు.

విశేషాంశములు: దేవి పైన చెప్పబడిన అయుధములను ధరించుట మాత్రమే కాదు. అయుధములు కూడ దేవీరూపమే. అందుచేతనే శూలమునుండి శూలమును సృష్టించుట ఇత్యాదులు సాధ్యపడెను.

'ఘోరా' యను మంత్రము రక్తము చిందుచున్న నరశిరస్సును చేతదాల్చిన మహాకాళీ రూపమును సూచించునని కొందరి భావము. కాని ఘోరశబ్దమునకు భయమును గొల్పు అకారము అని అర్థము చెప్పిన చాలును. దేవి చేతిలోని ఖడ్గాద్యాయుధములు రాక్షసులకు భయమును గొల్పుచునే యుండును. ఆమె

భక్తులకెన్నడును భయమును కలిగించదు. ఇట్టి భయంకరత్వమును సాధించుటకై దేవిచేతిలో రక్తము చిందుచున్న నరశిరస్సును కల్పించుట సమర్థనీయము కాదనియు, ఇది కౌలాచారమునుండి సంక్రమించిన దోషమనియు ప్రచారకుల అభిప్రాయము. సమయాచారపారదృశ్వలగు శ్రీశంకరులు 'సౌందర్యలహరి' లో ఎచటను రక్తమును గూర్చి ప్రసంగించలేదు. మరియు, శివునికి 'ఘోరా', 'శివా' అను రెండు తనువులను వర్ణించిన రుద్రాధ్యాయము నందు కూడ రక్తప్రసక్తి ఎచ్చటను గానరాదు. ఉపాసకు లీ విషయమును పరిశీలింతురు గాక.

121. నీవు సుందరివి.

122. నీవు అతి సుందరివి.

123. నీవీ లోకములోని అన్ని సుందరవస్తువుల కంటె అధికమైన సౌందర్యము గల దానవు.

124. నీవు శ్రేష్ఠురాలవు. శ్రేష్ఠవస్తువులలో కెల్ల శ్రేష్ఠవస్తువు నీవే.

విశేషాంశములు: ఆత్మతత్త్వ నిరూపణమునందు "నేతి నేతి" పదములచే మిథ్యా తత్త్వములనన్నిటిని నిరాకరించగా పరిశిష్టమైన 'సత్యస్య సత్యం' అని వర్ణింపబడిన ఏ పరతత్త్వము కలదో అది నీవే అని తాత్పర్యము.

125. నీవే పరమేశ్వరివి.

126. హే సర్వజగద్రూపిణీ ! ఈ జగత్తులో ఎక్కడ ఏ వస్తువు ఉన్ననూ, అది కార్యముగానీ, కారణముగానీ, చేతనముగానీ, జడముగానీ, వర్తమానమందుగానీ, భూతభవిష్యత్తులందు గానీ, అట్టి వస్తువు లన్నింటిలో ఏ శక్తి గలదో, ఆ శక్తి నీవే. అట్టి నిన్ను నేనేమి స్తోత్రము చేయగలను!

విశేషాంశములు: ఈ మంత్రము "సర్వం ఖల్విదం బ్రహ్మ", "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తి కించన" ఇత్యాది శ్రుతులయందు చెప్పబడిన దేవియొక్క సర్వాత్మకత్వమును బోధించును.

విశ్వములోని ప్రతిపదార్థము అణువులనుండి నిర్మాణమైనది. ప్రతి అణువులోను అంతర్నిహితములైన ప్రోటాను, ఎలక్ట్రాను మొదలగు అత్యంత సూక్ష్మకణములు సంతత నిర్విరామ చలనము నందుండును. ఈ చలనము శక్తియే. ఈ విధముగా సర్వవ్యాపి యగు శక్తి దేవీరూపమే.

127. ఎవడు జగత్తును సృష్టించి, పాలించి, సంహరించుచున్నాడో, అట్టి శ్రీమహావిష్ణువునే నీవు నిద్రావశుని గావించితివి. అట్టినిన్ను స్తోత్రము చేయ సమర్థుడీ జగత్తునందెవడు కలడు?

విశేషాంశములు: విష్ణువే త్రిమూర్త్యాత్మకుడై సృష్టి స్థితి సంహారములను చేయుచున్నాడని భావము. అట్టి విష్ణువునే మోహింపజేసిన దేవి జగన్మోహినియే.

128. నీ చేతనే విష్ణువు, నేను, శివుడు శరీరధారణము చేయింపబడితిమి. అట్టి నిన్ను స్తోత్రము చేయగల శక్తి ఎవడికి గలదు?

129. ఓ దేవీ ! నాచే స్తుతింపబడిన నీవు నీయొక్క అతిశయించిన మహిమలతో ఈ దుర్జయులగు మధుకైటభులను రాక్షసులను మోహింపజేయుము

విశేషము: దేవిచే మోహింపచేయబడినచో మధుకైటభులను జయించుట సులభము కాగలదని బ్రహ్మయొక్క ఆకాంక్ష.

130. జగత్ప్రభువగు విష్ణువు తొందరగా జాగరూకుడగునట్లు అనుగ్రహింపుము.

131. ఈ మహాసురులను సంహరించు ప్రేరణ విష్ణువునకు కల్గునట్లు అనుగ్రహింపుము.

మహర్షి ఇట్లు పలికెను.

132. విష్ణువు యోగ నిద్రను వీడి, మధుకైటభులను సంహరించుటకు గాను, బ్రహ్మ తామసియగు యోగమాయను స్తుతించెను. అంతట ఆదేవి విష్ణువు యొక్క నేత్రములు, నోరు, నాసిక, బాహువులు, హృదయము, వక్షస్థలముల నుండి తేజస్స్వరూపముతో నిర్గమించి బ్రహ్మకు దర్శనమిచ్చెను.

విశేషాంశములు: ఈ మంత్రములో 'అవ్యక్త జన్మనః' అను పదమును విష్ణువునకు విశేషణముగ అన్వయించినచో, 'అప్రసిద్ధమైన జన్మగలవాడు' అనగా 'జన్మలేనివాడు' అని అర్థము. 'అవ్యక్తము' అను పదమునకు 'పరమాత్మ' అనుఅర్థము సుప్రసిద్ధమే. కాన, 'పరమాత్మనుండి జన్మించిన వాడు అని అర్థము చెప్పి బ్రహ్మకు అన్వయించవచ్చును. ఈ రెండు అన్వయములలో రెండవదే శ్రేష్ఠము. ఎలయన, ఈపదము 'బ్రహ్మణః' అను పదమునకు ప్రక్కనే 'విష్ణోః' అను పదమునకు బహు దూరమున నున్నది.

దేవి 'నిద్రా' యని, 'యోగనిద్రా' యని వర్ణింపబడెను. కాని 'నిద్రా' యను పదము యోగనిద్రకే అనువాదము. యోగనిద్రకు, నిద్రకు ఎంతయో భేదముగలదు. యోగనిద్రలో జ్ఞానాంశముండును. నిద్ర అజ్ఞానాకారము.

'యోగో జ్ఞానం తథానిద్రా తదభావేఽభిధీయతే|
ఉభయోశ్చైవ సంయోగో యోగనిద్రేతి కీర్త్యతే'||

అని యోగరహస్యము. విష్ణువు ప్రాకృతునివలె నిద్రించుటలేదు. యోగనిద్రలో నున్నాడు. మరియు, నిద్రకు రాత్రికాలసంబంధము గలదు. యోగనిద్రకు లేదు. కనుక 'యోగనిద్రా' అని వర్ణింపబడిన దేవి శుద్ధసత్త్వస్వరూపిణియే. తామసి కాదు. 'తామగ్ని వర్ణాం తపసా జ్వలన్తీం' అని శ్రుతి. కాన ఆమె తాపసి. బ్రహ్మవిద్యయందు తమోగుణానికి అవకాశము. లేదు.

133. యోగనిద్రావిముక్తుడైన విష్ణువు ఏకార్ణవము నందలి శేషతల్పమునుండి లేచెను.

134. అపుడు విష్ణువు దుర్మార్గులయినట్టియు, గొప్ప బలము, పరాక్రమము కలిగినట్టియు, కోపముతో ఎర్రనైన నేత్రములు కలిగినట్టియు, బ్రహ్మను సంహరించుటకు సంసిద్ధులగుచున్న ఆ మధుకైటభులను చూచెను.

విశేషాంశములు: ఈ శ్లోకములో "మధుకైటభౌ దురాత్మానౌ" అనుచోట ఒక అక్షరమధికమైనను, ఛందస్సునకు వికృతి లేదు. ఏలయన, "న వా ఏకే నాక్షరేణ ఛన్దాంసి వియన్తి నవా ద్వాభ్యాం," అను శ్రుతిచే, ఛందస్సులు ఒకటి, రెండు అక్షరముల తేడా ఉన్నను వికృతిని పొందవు.

135. అపుడు సర్వసమర్థుడగు శ్రీహరి యుద్ధసన్నద్ధుడై, బాహువులే ఆయుధములు కాగా, వారిద్దరితో ఐదువేల సంవత్సరములు పోరు సలిపెను.

విశేషము: మధుకైటభులు నిరాయుధులు గనుక విష్ణువు వారితో ఆయుధములు లేకుండగనే యుద్ధము చేసెను.

136. అతిశయించిన బలముతో మదించిన వారిద్దరు మహామాయచే మోహితులై 'మా నుండి ఏదేని వరమును కోరుకొనుము' అని విష్ణువుతో పలికిరి.

విశేషము: 'ఈ రాక్షసులను మోహింపచేయుము' అని బ్రహ్మ మహామాయను కోరియుండెను. ఆమె అట్లే చేసెను. దానితో వారిలో యుక్తాయుక్త వివేకజ్ఞానము నశించి విష్ణువునకు వరమీయ సిద్ధపడిరి.

శ్రీ భగవానుడిట్లు పలికెను-

137. మీరు నాయందు ప్రసన్నులైనచో, మీరిద్దరు ఈనాడు నాచే వధింపబడుదురు గాక!

138. ఈ సమయములో మరొక వరముతో పనియేమి? ఇదియే నేను కోరు వరము.

మహర్షి ఇట్లు పలికెను.

139. ఈ విధముగా వంచింపబడిన వారిద్దరు జగత్తంతయు జలమయమగుట చూచి, కమలలోచనుడగు విష్ణుభగవానునితో ఇట్లు పలికిరి.

140. నీయుద్ధముచే మేము ప్రీతి చెందితిమి. నీచేతిలో మరణము మాకు శ్లాఘ్యమే. ఎచట భూమి నీటితో నిండి లేదో, మమ్ములను అచట చంపుము.

విశేషము: జగత్తంతయు ఏకార్ణవమగుటచే తమను వధించు స్థలమే ఉండజాలదని మధుకైటభుల అభిప్రాయము.

141. శంఖము, చక్రము, గదలను ధరించి శ్రీమహావిష్ణువు 'సరే' యని పలికి వారి శిరస్సులను తన తొడపైనుంచి చక్రముతో నరికివేసెను.

విశేషము: యుద్ధప్రారంభములో విష్ణువువద్ద ఆయుధములు లేవు. మధుకైటభులు నిరాయుధులు. యుద్ధధర్మాన్ననుసరించి శత్రువుల వద్ద ఆయుధములు లేనపుడు ఆయనాయుధములు ధరించరాదు. కాని ఇపుడు రాక్షస సంహారము కొరకు శంఖము, చక్రము, గదలను ధరించెను. యుద్ధసమయము గనుక పద్మమును ధరించలేదు. మరియు రాక్షసుల శిరస్సులను పట్టుకొనుటకై ఒక హస్తము అవసరము కూడా. తాను నీటిపై కూర్చుండుటచే, తన తొడ జలములేని ప్రదేశమాయెను.

142. బ్రహ్మచే స్వయముగా స్తుతింపబడినదై దేవి ఈ విధముగ ('ఐం' కారబీజస్వరూపిణిగా తేజస్వరూపిణిగా) ఆవిర్భవించెను. ఆమెయొక్క ప్రభావ మును తిరిగి నీకు చెప్పెదను. వినుము.

ఇది శ్రీమార్కండేయ మహాపురాణమందు సావర్ణికమన్వంతరగాథలో దేవీ మాహాత్మ్యము నందు 'మధుకైటభవధ' అని ప్రసిద్ధి గాంచిన, మూల గ్రంథ మంత్రవిభాగరూపమగు నవశతీ మంత్రమాలయందు ప్రథమాధ్యాయము సమాప్త మయ్యెను.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః
# ద్వితీయాధ్యాయము
## ఓం నమశ్చండికాయై

మహర్షి ఇట్లు పలికెను.

143. పూర్వము మహిషుడు రాక్షసప్రభువుగను, ఇంద్రుడు దేవతలకు ప్రభువుగను ఉండగా, వంద సంవత్సరముల పూర్తికాలము దేవాసుర సంగ్రామము జరిగెను.

144. ఆ యుద్ధమునందు మహాబలశాలురగు రాక్షసులచే దేవసైన్యము ఓడింపబడెను. మహిషాసురుడు దేవతలనందరిని జయించి, స్వర్గాధిపతి అయెను.

145. అపుడు ఓటమిని పొందిన దేవతలు పద్మసంభవుడగు బ్రహ్మను ముందిడుకొని, శివవిష్ణువులున్న స్థానమునకు వెళ్లిరి.

146. దేవతలు తమకు కలిగిన పరాభవము యొక్క వివరములను, మహిషాసురుని చేష్టలను, జరిగినది జరిగినట్లుగా, ఆ శివకేశవుల యెదుట చెప్పిరి.

147. "సూర్యుడు, ఇంద్రుడు, అగ్ని, వాయువు, చంద్రుడు, వరుణుల యొక్క, ఇతర దేవతల యొక్క అధికారములను ఆ మహిషుడే స్వయముగా నిర్వహించు చున్నాడు."

148. "దుర్మార్గుడగు ఆ మహిషునిచే దేవతలందరు స్వర్గమునుండి తరుమబడినవారై మానవులవలె భూమియందు సంచరించుచున్నారు."

149. ఈ మహిషాసురుని కృత్యములన్నియు మీకు వివరించితిమి. మిమ్ములనే శరణు పొందితిమి. ఆ మహిషుని వధగురించి ఆలోచించవలెను.

విశేషము: మంత్రములో 'వః' అని బహువచన ముండుటచే, బ్రహ్మతో సహా త్రిమూర్తులను శరణు పొందిరని భావము.

మహర్షి పల్కెను.

150. దేవతల ఈ పలుకులు విన్న శివకేశవులు, కనుబొమలు ముడివడుటచే, భయంకరములగు ముఖములు గలవారై కోపమును పొందిరి.

151. అపుడు అతిశయించిన కోపముతో నిండిన విష్ణువు యొక్క ముఖమునుండి గొప్పతేజస్సు బయల్వెడలెను. తరువాత బ్రహ్మ, శివుల ముఖముల నుండి కూడ తేజస్సులు బయలుదేరెను.

152. ఇంద్రుడు మొదలగు దేవతల శరీరముల నుండి కూడ మహత్తరమగు తేజస్సు వెలువడెను. ఆ తేజస్సులన్నియు ఒక్కటి అయ్యెను.

153. ఆ దేవతలచట జ్వలించుచున్న పర్వతమువలెనున్న. గొప్ప తేజోరాశిని చూచిరి. దాని జ్వాలలచే దిగంతములు వ్యాప్తమయ్యెను.

154. అచట సర్వదేవతల శరీరములనుండి ఉద్భవించి, ఒక్కటిగా కలిసి పోయి, కాంతితో ముల్లోకములను వ్యాపించిన సాటిలేని ఆ తేజస్సు స్త్రీ రూపమును పొందెను.

155. శివుని తేజస్సు వలన ఆమె ముఖము ఏర్పడెను.

156. యముని తేజస్సు వలన కేశము లేర్పడెను.

157. విష్ణు తేజస్సుచే బాహువు లేర్పడెను.

158. చంద్రుని తేజస్సుచే స్తనద్వంద్వమేర్పడెను.

159. ఇంద్రతేజస్సుచే నడుము ఏర్పడెను.

160. వరుణ తేజస్సుచే పిక్కలు, తొడలు ఏర్పడెను.

161. భూమి యొక్క తేజస్సుచే పిరుదు లేర్పడెను.

162. బ్రహ్మతేజస్సుచే పాదము లేర్పడెను.

163. .సూర్యతేజస్సుచే ఆమె కాలివ్రేళ్లు ఏర్పడెను.

164. వసువుల తేజస్సుచే చేతివ్రేళ్లు ఏర్పడెను.

165. కుబేరుని తేజస్సుచే ముక్కు ఏర్పడెను.

166. దక్షుడు మొదలగు ప్రజాపతుల తేజస్సు చే ఆమెయొక్క దంతము లేర్పడెను.

167. అదే విధముగా అగ్నియొక్క తేజస్సుచే ఆమె మూడు నేత్రములేర్పడెను.

168. ఉభయ సంధ్యల తేజస్సుచే కనుబొమ లేర్పడెను.

169. వాయువు యొక్క తేజస్సుచే చెవులేర్పడెను.

170. మరియు ఇతర దేవతల తేజస్సులుకూడ కలిసి, మంగళ స్వరూపురాలగు దేవి ఆవిర్భవించెను.

విశేషాంశములు: ఇతర దేవతలనగా అరుణ కార్తికేయాదులు. దేవీ భాగవత మిట్లు చెప్పెను. 'అధరశ్చాతి రక్తోZస్యాస్సంజాతోZరుణ తేజసా, ఉత్తరోష్ఠస్తథా రమ్యః కార్తికేయస్య తేజసా'. ఆమె యొక్క ఎర్రని క్రింది పెదవి అరుణుని తేజస్సువలన, పై పెదవి కార్తికేయుని తేజస్సు వలన ఏర్పడెను.-

వాస్తవములో జగన్మాత యొక్క ఏ శక్త్యంశములు, దేవతల యందున్నవే, అవియే తేజో రూపముగ, బయల్వెడలి, ఒకచో గూడి, దేవీ రూపము ఆవిర్భవించెను. ఈ విషయమునే లక్ష్మీ పాంచరాత్రమిట్లు చెప్పెను.

"మదీయాశ్శక్తి లేశా యే తత్తద్దేవశరీరగాః సంభూయ తే మమాభూవన్ రూపం పరమశోభనమ్".

171. అపుడు మహిషాసురునిచే పీడితులగు దేవతలు సమస్త దేవతల తేజస్సుల రాశి నుండి ఆవిర్భవించిన ఆమెను చూచి ఆనందమును పొందిరి.

172. అపుడు దేవతలు ఆమెకు తమ తమ ఆయుధములను కూడ ఇచ్చిరి.

172-1 జయశీలముగల ఆ దేవినుద్దేశించి జయమును గోరు ఆ దేవతలు పెద్దస్వరముతో జయజయధ్వానములు చేసిరి.

173. పినాకపాణియగు శివుడు శూలమునుండి శూలమును సృష్టించి ఆమె కిచ్చెను.

174. విష్ణువు తన చక్రమునుండి చక్రమును తీసి ఇచ్చెను.

175. వరుణుడు శంఖమును ఇచ్చెను.

176. అగ్ని ఆమెకు శక్తి అను ఆయుధమును ఇచ్చెను.

విశేషము: శక్తి యనగా మహారాష్ట్ర భాషలో 'సైతి' అని ప్రసిద్ధి పొందిన ఆయుధ విశేషము.

177. వాయువు బాణములతో నిండియున్న రెండు అంబుల పొదులను, ధనస్సును ఇచ్చెను.

178. దేవతల ప్రభువగు ఇంద్రుడు వజ్రము నుండి వజ్రమును తీసి ఆమె కిచ్చెను.

విశేషము: ఈ వజ్రమును పూర్వము దేవియే ఇంద్రున కిచ్చినదని బ్రహ్మాండ పురాణములో చెప్పబడెను. దేవికి, ఆమె ఇంద్రునకు ఇచ్చిన ఆయుధమునకు అభేదమే. కనుక, వజ్రాయుధమునుండి మరియొక వజ్రాయుధమును తేజోరూపముగా సృష్టించుట సాధ్యపడెను.

179. వేయికన్నుల ఇంద్రుడు ఐరావతమను దిగ్గజము నుండి ఘంటను తీసి ఆమెకిచ్చెను.

**విశేషాంశములు:** ఈ ఆయుధముల నిచ్చు ప్రక్రియలో ఒక విశేషము గమనింపదగినది. ఒక దేవతకు ఏ ఆయుధము స్వలక్షణమో, దాని నుండి మరియొకటి సృష్టించి దేవికి ఈయబడును. ఉదాహరణకు శివుడు తన శూలమునుండి మరియొక శూలమును తీసి ఇచ్చెను. ఏది తన ఆయుధము కాదో, అప్పుడు అదియే ఈయబడెను. ఐరావత ఘంట ఇంద్రుని స్వలక్షణము కాదు గనుక, అదియే ఈయబడెను.

180. యముడు కాలదండము నుండి దండము తీసి ఇచ్చెను.

181. వరుణుడు పాశమును కూడ ఇచ్చెను.

విశేషము: ఇది వరుణుని రెండవ దానము. కాన 'చ'కారము ప్రయోగింపబడినది.

182. దక్షాది ప్రజాపతులలో నొకడు అక్షమాలను ఇచ్చెను.

183. బ్రహ్మ కమండలము నిచ్చెను.

విశేషము: వామన పురాణములో బ్రహ్మయె అక్షమాలను, కమండలమును ఇచ్చినట్లు చెప్పబడెను. ఆ పక్షములో ప్రజాపతి శబ్దము బ్రహ్మకు విశేషణము.

184. సూర్యుడు సమస్తరోమకూపములందు తన కిరణముల నిచ్చెను.

విశేషము: రోమకూపముల సంఖ్య మూడున్నర కోట్లు.

185. మృత్యుదేవత ఆమెకు ఖడ్గమును, స్వచ్ఛమగు డాలును ఇచ్చెను.

186. క్షీర సముద్రము స్వచ్ఛమగు హారమును, నిత్య నూతనమగు వస్త్రయుగ్మమును, ప్రకాశించుచున్న చూడామణిని, కుండలములను, గాజులను, నిర్మలమైన అర్ధచంద్రమను శిరోభూషణమును, అన్ని చేతుల యందు భుజకీర్తులను, స్వచ్ఛమగు నూపురములను, సర్వోత్తమ మగు కంఠహారమును. అన్ని వ్రేళ్లయందు శ్రేష్ఠమగు అంగుళీయకములను ఇచ్చెను.

విశేషాంశములు: వీటినన్నిటిని క్షీరసముద్రాధిదేవత ఇచ్చెను. అర్ధచంద్ర పదమునకు సాక్షాత్తు అర్ధచంద్రుడనియే అర్థము చెప్పవచ్చును. ఏలయన, దేవి అర్ధచంద్రుని కూడ ధరించును. దేవి యొక్క బాహువులు అనంతము.

187. విశ్వకర్మ ఆమెకు అతి స్వచ్ఛమగు గండ్ర గొడ్డలిని, అనేక విధములైన అస్త్రములను, మరియు భేదింప శక్యముకాని కవచమును ఇచ్చెను.

188. సముద్రాధిదేవత ఆమెకు వాడని పద్మములతో కూడిన ఒక మాలను శిరస్సుపై, మరియొక మాలను వక్షస్థలమునందు, అతి సుందరమగు ఒక పద్మమును చేతియందు ధరించుటకు ఇచ్చెను.

189. హిమవంతుడు సింహ వాహనమును, వివిధ రత్నములను ఇచ్చెను.

190. కుబేరుడు అమృతముతో నిండిన పానపాత్రను ఇచ్చెను.

191. ఈ భూమిని మోయునట్టియు, సమస్త సర్పములకు ప్రభువైన శేషుడు గొప్ప మణులతో అలంకరింపబడిన నాగహారమును ఆమెకు ఇచ్చెను.

విశేషము: నాగహారమనగా వేయి సర్పములతో కూడిన వర్తులాకారపు మాల. ఇట్టి మాలను దేవి శిరస్సుపై ధరించునని యామలమునందు చెప్పబడెను.

192. ఇతర దేవతలు కూడా భూషణములు మరియు ఆయుధములతో దేవిని సమ్మానించిరి. ఆమె అనేక పర్యాయములు గొప్ప అట్టహాసముతో బిగ్గరగా నాదము చేసెను.

193. ఆమె యొక్క భయంకరమగు నాదము చేత ఆకాశమంతయు నిండి పోయెను.

194. ఆకాశము కూడ పట్టజాలని ఆ అద్భుతమగు శబ్దము చేత గొప్ప ప్రతిధ్వని కలిగెను.

195. సమస్త భువనములు కలత చెందెను.

196. సముద్రములు కూడ కంపించెను.

విశేషము: సముద్రము కంపించుట .యనగా ఉత్తుంగ తరంగములు చెలియలికట్టను దాటినవి అని భావము.

197. భూమి కదలి పోయెను.

198. పర్వతములన్నియు చలించెను.

199. సింహముపై ఆసీనురాలైన ఆ దేవిని చూచి, దేవతలు, ఆనందముతో జయవచనములు పల్కిరి.

200. మహర్షులు భక్తితో వినమ్రమైన అంతఃకరణము, దేహము గలవారై ఈ దేవిని స్తుతించిరి.

201. ముల్లోకములు సంపూర్ణముగ క్షోభించుటను గనిన ఆ రాక్షసులు ఆయుధము లను ధరించి, సైన్యములనన్నిటిని సిద్ధము చేసుకొని, యుద్ధమునకు సన్నద్ధులై యుండిరి.

202. "ఆ! ఇదియేమి?" అని కోపముతో పలికిన వాడై మహిషాసురుడు రాక్షసులం దరితో కూడి ఆ శబ్దము వచ్చిన దిక్కునకు పరుగెత్తెను.

203. అపుడాతడు దేవిని చూచెను. ఆమెయొక్క కాంతులచే ముల్లోకములు వ్యాపింపబడెను. ఆమె పాదముల బరువుచే భూమి అవనతమయ్యెను. ఆమె కిరీటము ఆకాశమును తాకుచుండెను. ఆమె ధనస్సు యొక్క నారిత్రాటి ధ్వనిచేత సప్త పాతాళములు కల్లోలమగుచుండెను. ఆమె దిక్కులనన్నిటిని తన వేయి బాహువులతో వ్యాపించి యుండెను. ఆరు లక్షల నలభై వేల చెలికత్తెలు ఆమెను చుట్టువారియుండిరి.

204. అపుడు ఆ దేవికి, రాక్షసులకు మధ్య యుద్ధము ఆరంభమయ్యెను. అనేక విధములుగా ప్రయోగింపబడిన శస్త్రములతో, అస్త్రములతో దిక్కులన్నియు ప్రకాశించుచుండెను.

విశేషము: కంటికి కనబడు లక్ష్యమును భేదించు ఆయుధము శస్త్రము. ఈ కాలములో తుపాకీ వంటిది. కంటికి కనబడని లక్ష్యమును కొట్టు ఆయుధము అస్త్రము. ఇది ఈనాటి క్షిపణి వంటిది.

205. మహిషాసురుని సేనా నాయకుడగు చిక్షురుడను మహాసురుడు చతురంగ బలముతో కూడిన వాడై దేవితో యుద్ధము చేసెను.

విశేషము: చతురంగ బలమనగా రథములు, ఏనుగులు, గుర్రములు, పదాతులతో కూడిన సైన్యము.

206. చామరుడను మరియొక రాక్షసుడు కూడ చతురంగ బలసమేతుడై యుద్ధము చేసెను.

207. ఉదగ్రుడను గొప్ప రాక్షసుడు అరవై వేల రథములతో కూడినవాడై యుద్ధము చేసెను.

208. మహాహనువు అను రాక్షసుడు ఒక కోటి రథములతో కూడినవాడై యుద్ధము చేసెను.

209. అసిలోముడను మహారాక్షసుడు ఐదు కోట్ల రథములతో కూడి యుద్ధము చేసెను.

210. బాష్కలుడను సేనాని అరువది లక్షల రథములతో కూడిన వాడై యుద్ధము చేసెను.

211. ఉగ్రదర్శనుడను సేనాని వేలాది ఏనుగుల, గుఱ్ఱముల గుంపులతో, కోటి రథములతో పరివేష్టితుడై యుద్ధము చేసెను. కాలుడు ఏబది లక్షల రథములతో, అంతే సంఖ్యగల రాక్షసులతో కూడిన వాడై యుద్ధము చేసెను. ఉగ్రాస్యుడు, ఉగ్రవీర్యుడు, మహాబలశాలి యగు త్రినేత్రుడు, కరాలుడు, తామ్రుడు, అంధకుడు, దుర్ధరుడు, దుర్ముఖుడు మరియు ఉద్ధతుడు అను మహాబలులగు రాక్షసులు యుద్ధము చేసిరి.

**విశేషాంశములు:** ఈ మంత్రములలోని సంఖ్యలు స్థూల దృష్టికి అతిశయోక్తులుగా భాసింప వచ్చును. ఇట్టి పెద్ద సంఖ్యలు మన అనుభవమునకు విరుద్ధములే అయినను, అసంభవములు మాత్రము కాదు. ఖగోళ శాస్త్రము లోని సంఖ్యలన్నియు ఈ తీరునే ఉండును. ఉదాహరణకు, కొద్దినెలల క్రితం ఎన్.జి.సి. ఎక్స్ 7457 అను గెలాక్సీ కనుగొనబడెను. ఇది భూమి నుండి 400 లక్షల కాంతి సంవత్సరముల దూరమున నున్నది. ఒక కాంతి సంవత్సరమనగా 365 x 24 x 60 x 60 x 1,86,000 మైళ్లు. ఆ గెలాక్సీ మధ్య భాగములో సుమారు ముప్పది వేల సూర్యులు ఉన్నారు.

దేవీ మాహాత్మ్యము ముల్లోకములకు చెందిన గాథ. కాన ఇట్టి పెద్ద సంఖ్యలలో విడ్డూరమేమియు లేదు.

212. బిడాలుడను రాక్షసుడు అయిదు వందల కోట్ల రథములతో కూడిన వాడై అచట యుద్ధము చేసెను.

213. ఇతరులగు మహాసురులు కూడ వేలాది సంఖ్యలో రథములతో, ఏనుగులతో, గుఱ్ఱములతో కూడిన వారై రణరంగమునందు దేవితో యుద్ధము చేసిరి.

214. అప్పటి యుద్ధమునందు వేల కోట్ల రథములు, ఏనుగులు, గుఱ్ఱములు మహిషాసురుని పరివేష్టించి యుండెను.

**విశేషాంశములు:** పురాణ, వైదిక సాహిత్యములోని సంఖ్యామానము ఈ విధముగ నున్నది. ఏక, దశ, శత, సహస్ర, అయుత, లక్ష, ప్రయుత, కోటి, అర్బుద, అబ్జ, ఖర్వ, నిఖర్వ, మహాపద్మ, శంఖ, జలధి, అంత్య, మధ్య, పరార్ధములు అను సంఖ్యలు క్రమముగా ఒక దానికంటె మరియొకటి పది రెట్లు ఉండును.

215. అపుడు దేవితో రాక్షసులకు లోక వినాశకరమగు భయంకరమైన యుద్ధము జరిగెను. భూత వినాశమే జరుగునా అను విధముగా భయమును కలిగించు యుద్ధమది.

216. ఆ రాక్షసులు తోమరము, భిన్దిపాలము, శక్తి, ముసలము, ఖడ్గము, పరశువు, పట్టిశము అను ఆయుధములనుపయోగించి దేవితో యుద్ధముచేసిరి.

విశేషాంశములు: మంథాకారముకల లోహమయమగు ఆయుధము తోమరము. తీక్ష్ణధారగల లోహదండము పట్టిశము. శిలాఖండములను విసురు సాధనము భిందిపాలము.

217. కొందరు రాక్షసులు దేవిపై శక్త్యాయుధములను విసరిరి.

218. కొందరు దేవిపై పాశములను ప్రయోగించిరి.

219. మరి కొందరు ఆ దేవిని కత్తి దెబ్బలతో హింసించుటకు సిద్ధమైరి.

విశేషాంశములు: దేవికి దూరముగా నున్నవారు ఆయుధములను విసరిరి. ఆమెకు దగ్గరగా నున్నవారు ఆయుధములతో ఆమెను సాక్షాత్తుగా హింసించుటకు సిద్ధపడిరి. ఇదియే ప్రక్షేపమునకు, ప్రహారమునకు తేడా.

220. అపుడా చండికా దేవియు తన శస్త్రాస్త్రములను వర్షింపజేయుచూ, ఆ శస్త్రములను, అస్త్రములను అవలీలగా ఛేదించెను.

221. సర్వసమర్థురాలగు ఆ దేవి అలసట ఎరుగని ముఖము కలదై, దేవర్షులు స్తుతించుచుండగా, రాక్షసులదేహముల యందు శస్త్రాస్త్రములను ప్రయోగించెను.

222. దేవి యొక్క వాహనమగు ఆ సింహము కూడ కోపించినదై, జూలువిదల్చి, అడవులలో అగ్నివలె, రాక్షససైన్యములందు విహరింపజొచ్చెను.

223. అంబిక యుద్ధరంగమునందు- యుద్ధము చేయుచూ, ఏ నిశ్వాసములను విడిచెనో, అవియే వెంటనే వందలాది, వేలాది దేవీగణములుగా ఉద్భవించెను.

224. ఆ గణములు దేవియొక్క శక్తిచేత వృద్ధి పొందినవారై పరశువు, బిందిపాలము, ఖడ్గము, పట్టిశము, అను ఆయుధములతో రాక్షస సమూహములను నాశనము చేయుచు, యుద్ధము చేయ జొచ్చిరి.

225. ఆ యుద్ధమహోత్సవము నందు ప్రమథగణములు 'పటహములు' అను వాద్యములను వాయించిరి.

226. ఆ యుద్ధమహోత్సవమునందు మరి కొన్ని ప్రమథ గణములు శంఖము లను ఊదిరి.

227. ఆ యుద్ధమహోత్సవమునందు మరి కొందరు మృదంగములను వాయించిరి.

228. దేవతల జయమును కోరు ఋషులు వారిని స్తుతించిరి.

229. అపుడు దేవి త్రిశూలముతో, గదతో, శక్త్యాయుధములతో, 'రిష్టి' అను రెండు వైపుల పదును గల ఆయుధములతో, ఖడ్గాద్యాయుధములతో వందలాది బల శాలులగు రాక్షసులను సంహరించెను.

**విశేషాంశములు:** దేవతలు దేవికి ఇచ్చిన అయుధములలో 'రిష్టి' అను ఆయుధము లేదని శంకించనక్కర లేదు. విశ్వకర్మ ఇచ్చిన ఆయుధముల నేకములు. వాటిలో రిష్టి ఉండుట సంభవమే. ఖడ్గమునకు పదును ఒకవైపు ఉండగా, రిష్టికి రెండు వైపుల ఉండును.

230. దేవి కొందరు రాక్షసులను ఘంటాధ్వనిచే మూర్ఛితులను, చేసి పడవైచెను.

231. దేవి కొందరు రాక్షసులను పాశముతో బంధించి నేలపై ఈడ్చెను.

232. దేవి చేత కొందరు రాక్షసులు వాడి కత్తి దెబ్బలతో రెండుగా చీల్చబడిరి.

233. మరి కొందరు రాక్షసులు గదయొక్క దెబ్బచే శిథిలమైన దేహము గలవారై నేలపై పడి దీర్ఘ నిద్రను పొందిరి.

234. (దేవిచేత) ముసలము చేత గట్టిగా కొట్ట బడిన కొందరు రాక్షసులు రక్తము గ్రక్కుకొనిరి.

235. దేవి కొందరు రాక్షసులను నేలపై బడవైచి శూలముతో వక్షస్థలమును చీల్చెను.

236. కొందరు రాక్షసులు యుద్ధరంగమునందు దేవి ప్రయోగించిన బాణములచే (అవకాశము లేకుండగ) కప్పబడిన దేహము కలవారై, తత్పూర్వము మరణించినవారి ననుసరించుటకోయన్నట్లు ప్రాణములను విడనాడిరి.

237. దేవి కొందరు రాక్షసుల చేతులను తెగగొట్టెను.

238. దేవిచే మరికొందరి మెడలు తెగ గొట్టబడెను.

239. కొందరు రాక్షసుల తలలు తెగి నేల గూలెను.

240. కొందరు రాక్షసులు దేహమధ్యభాగము నందు చీల్చివేయబడిరి.

241. కొందరు మహాసురులు కాలిపిక్కలు తెగి నేలకూలిరి.

242. కొందరిని దేవి ఒక చేయి, ఒక కన్ను, ఒక కాలు మాత్రమే రెండు ముక్కలుగా నిలువుగా చీల్చి వేయగా, వారు నేల గూలిరి.

243. శిరస్సు తెగి క్రిందపడిన కొన్ని కబంధములు (తలలేని మొండెములు) తిరిగి లేచినవి.

244. శ్రేష్ఠమగు ఆయుధములను ధరించిన కబంధములు దేవితో యుద్ధము చేసెను.

245. మరి కొన్ని కబంధములు అక్కడ యుద్ధరంగములో తూర్యధ్వనుల లయను అనుసరించి నాట్యము చేసెను. ఓ మహారాజా! అనేక కోట్ల కబంధములు ప్రతిక్షణమునందు బయలు దేరి తిరిగి దేవితో యుద్ధము చేసినవి.

246. శిరస్సు తెగిన కబంధములు - తిరిగి శిరస్సు ధరించి, ఖడ్గము, శక్తి, రిష్టి అను ఆయుధములను చేత ధరించి "నిలు నిలు" అని దేవిని ఉద్దేశించి పలుకు చుండెను. శరీరము గగుర్పొడిచే ఆ భయంకరయుద్ధము నందు రక్తముతో తడిసిన కబంధములు యుద్ధము చేయజొచ్చెను.

విశేషాంశములు: యుద్ధములో పదికోట్ల వీరులు మరణించినపుడు ఆ ఆవేశమునకు ఒక కబంధములేచి అనేక చేష్టల నాచరించును. అట్టిమూడు రకముల చేష్టలు పై మంత్రములలో వర్ణింప బడెను. కొన్ని కబంధములు కేవలము లేచి నిలబడినవి. మరికొన్ని నాట్యము చేయగా, మరికొన్ని తిరిగి శిరస్సును పొంది మాటలాడినవి. దేవితో యుద్ధము చేయుట కబంధము లన్నిటికి సమానమే.

247. ఆ మహాయుద్ధము జరిగిన చోట నేలగూలిన రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, రాక్షసులతో నిండి భూమిమీద కాలుమోప వీలు లేకుండెను.

248. అచట వెనువెంటనే రాక్షస సైన్యమధ్యభాగము నందు ఏనుగులు, రాక్షసులు, గుఱ్ఱముల యొక్క రక్తము విశాలమగు ఏరులై ప్రవహించెను.

249. మరియు జగన్మాతయగు దేవి రాక్షసులయొక్క ఆ గొప్ప సైన్యమును, పెద్దగడ్డి పోగును, కట్టెల మోపును అగ్ని దగ్ధమొనర్చు రీతిని, నాశనమొనర్చెను.

250. ఆ సింహము కూడ జూలు విదల్చుచూ, పెద్దనాదము చేయుచూ, రాక్షసుల దేహములనుండి ప్రాణముల నపహరించు చున్నట్లుండెను.

విశేషాంశములు: సింహనాదము విన్నంతనే రాక్షసుల ప్రాణములు పోయినట్లుండెనని భావము.

251. అచట దేవియొక్క ప్రమథ గణములు రాక్షసులతో చేసిన యుద్ధమునకు మెచ్చి, దేవతలు అంతరిక్షము నుండి పుష్పవర్షము కురిపించుచూ, ఆ గణములకు అధీశ్వరియగు జగన్మాతను స్తుతించిరి.

విశేషాంశములు: 215-251 మంత్రములలో వ్యాసమహర్షిచే ప్రయోగింప బడిన దేవీ, అంబికా అను నామములు సర్వశక్తి సమాహార రూపిణియగు జగన్మాతను సూచించును.

ఇది శ్రీ మార్కండేయ మహా పురాణ మందు సావర్ణికమన్వంతర గాథలో, దేవీ మాహాత్మ్యమునందు 'మహిషాసుర సైన్య వధ'అని ప్రసిద్ధి గాంచిన, మూల గ్రంథ మంత్ర విభాగ రూపమగు నవశతీ మంత్రమాలయందలి, ద్వితీయాధ్యాయము సమాప్తమయ్యెను.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః
# తృతీయాధ్యాయము
## ఓం నమశ్చండికాయై

మహర్షి ఇట్లు పలికెను.

252. అపుడు సంహరింప బడుచున్న ఆ సైన్యమును చూచి మహాసురుడు, సేనానాయకుడునగు చిక్షురుడు కోపించి జగన్మాతతో యుద్ధము చేయుటకు ఉపక్రమించెను.

253. యుద్ధము నందు ఆ రాక్షసుడు, మేఘము మేరు పర్వత శిఖరమును జలధారలతో ముంచెత్తిన రీతిని, దేవిని బాణ వర్షముతో ముంచెత్తెను.

విశేషాంశములు: చిక్షురుడు కురిపించిన బాణ వర్షమునకు దేవిపై ఎట్టి ప్రభావము గలదో ఉపమానము స్పష్టపరుచుచునే యున్నది.

254. అపుడు దేవి వాని బాణ సమూహములను అవలీలగనే ఛేదించి, వానిరథము యొక్క గుఱ్ఱములను, వాటిని నడుపు సారథిని కూడ సంహరించెను.

255. దేవి వెను వెంటనే ధనస్సును, మిక్కిలి ఎత్తైన ధ్వజమును ఛేదించెను.

255-1 తరువాత దేవి విరిగినధనస్సుగల చిక్షురుని, వాని అవయవములందు వేగముగా దూసుకుపోవు బాణములతో కొట్టి పీడించెను.

256. చిక్షురుని ధనస్సు విరిగెను. రథము భగ్నమయ్యెను. అశ్వములు, సారథి చంపబడిరి. అపుడా రాక్షసుడు కత్తి, డాలును చేత బట్టి దేవిపై ఉరికెను.

257. పదునైన ధారగల కత్తితో సింహమును శిరస్సునందు కొట్టి, చిక్షురుడు మిక్కిలి వేగముతో దేవిని కూడ ఎడమ చేతిపై కొట్టెను.

258. ఓ రాజ కుమారా! కత్తి దేవి భుజమునకు తగిలి విరిగి పోయెను.

259. అపుడా చిక్షురుడు కోపముతో ఎఱ్ఱనైన కళ్లు గలవాడై శూలమును తీసు కొనెను.

260. అపుడు చిక్షురుడు, ఆకాశమునందలి సూర్యబింబము వలె, తేజస్సుతో వెలిగి పోవుచున్న ఆ శూలమును భద్రకాళిపై ప్రయోగించెను.

విశేషాంశములు: 'భద్రం కలయతీతి' అను వ్యుత్పత్తిచే, భద్రకాళియనగా సుఖములనిచ్చు దేవి. "భద్రం కర్ణేభి శృణుయామ దేవాః, భద్రంపశ్యేమాక్ష భిర్యజత్రాః" అని శ్రుతి. అట్టి భద్రములను ఇచ్చునది దేవి.

261. మీదకు వచ్చుచున్న ఆ శూలమును చూచి, దేవి తన శూలమును విడిచెను.

262. దేవి యొక్క శూలము చేత ఆ శూలము వంద ముక్కలుగా చేయబడెను.

263. ఆ రాక్షసుడు కూడ దేవి యొక్క శూలము చేత వంద ఖండములుగా చీల్చబడెను.

264. మహిషుని సేనా నాయకుడు, గొప్ప పరాక్రమ శాలియగు ఆ చిక్షురుడు వధింపబడగనే, చామరుడను రాక్షసుడు ఏనుగు నెక్కి వచ్చెను.

265. అపుడా చామరుడు దేవిపై శక్తిని విడిచిపెట్టెను.

266. వెంటనే జగన్మాత హుంకారముచే ఆ శక్తిని ఎదుర్కొనగా, అది తనకాంతిని కోల్పోయి, నేలపై బడెను.

267. భగ్నమై నేల కూలిన శక్తిని చూచి దేవి యందు కోపించిన వాడై చామరుడు శూలమును విసిరెను.

268. దేవి దానిని కూడ బాణములతో ఛేదించెను.

269. ఆ రాక్షసుడు శూలము వ్యర్థమగుట చూచి, ధనస్సును తీసుకొనెను. ఆతడు తన లాఘవమును ప్రదర్శించుచూ, దేవిని, ఆమె వాహనమును కూడ బాణములతో కొట్టెను.

270. అపుడు సింహము ఎగిరి, ఏనుగు యొక్క కుంభస్థలమధ్యమందు నిలిచి, ఆ రాక్షసునితో గొప్ప బాహుయుద్ధము చేసెను.

271. అపుడు వారిద్దరు (సింహము, చామరుడు) యుద్ధము చేయుచునే ఏనుగు పైనుండి నేలపై బడిరి. వారిద్దరు గొప్ప కోపముతో భయంకరమగు దెబ్బలను కొట్టుకొనుచు యుద్ధము చేసిరి.

272. అపుడు సింహము వేగముగ ఆకాశములోకి ఎగిరి చామరునిపై బడి పంజాదెబ్బతో వాని తలను వేరు చేసెను.

273. ఆ యుద్ధము నందు దేవి ఉదగ్రుని శిలలు, వృక్షములు మొదలగు వాటితో కొట్టి చంపెను.

274. దంతములతో కరిచి, పిడికిళ్లతో, అరచేతులతో కొట్టి, దేవి చేత కరాలుడు చంపబడెను.

విశేషాంశములు: మంత్రములోని దంత పదమును బట్టి కరాలుని సింహము సంహరించెనని భావించుట కవకాశము గలదు. కాని ముందు, వెనుక మంత్రములలో దేవి చేసిన సంహారమే చెప్పబడినదిగాన, తన్మధ్య పతితమగు కరాల సంహారము కూడ దేవి చేసినదే అనుట యుక్తము."దన్తముష్టితలైః" అనగా 'ఏనుగు దంతపు పిడిగల కత్తి యొక్క ధారలచేత' అని అర్థము చెప్పి, దేవియే కరాలుని సంహరించెనని చెప్పవచ్చును.

275. కోపించిన దేవి గదయొక్క దెబ్బలతో ఉద్ధతుని పిండి చేసెను.

276. పరమేశ్వరి బాష్కలుని భిందిపాలముతో సంహరించెను.

277. పరమేశ్వరి తామ్రుని బాణములతో సంహరించెను.

278. పరమేశ్వరి అంధకుని కూడ అటులనే సంహరించెను.

279. పరమేశ్వరి ఉగ్రాస్యుని త్రిశూలముతో సంహరించెను.

280. పరమేశ్వరి ఉగ్రవీర్యుని కూడ త్రిశూలముతో సంహరించెను.

281. పరమేశ్వరి అటులనే మహాహనుని కూడ త్రిశూలముతో సంహరించెను.

282. పరమేశ్వరి త్రినేత్రుని కూడ శూలముతో సంహరించెను.

283. దేవి కత్తితో బిడాలుని తలను దేహము నుండి వేరుచేసి, పడవేసెను.

284. ఆ యుద్ధమను ఉత్సవమునందు ఆ దేవి కత్తితోనే అసిలోముని నరికెను.

285. దేవి అతిభయంకరములగు కత్తి దెబ్బలతో ఉగ్రదర్శనుని పడ గొట్టెను.

286. దేవి దుర్ధరుడు, దుర్ముఖుడు అను ఇద్దరిని బాణములతో యమసదనమునకు పంపెను.

287. కాలరాత్రి రూపురాలగు ఆమె కాలదండముతో కాలుని పడగొట్టెను.

288. దేవీ గణములు, సింహము, దేవి కూడ బిగ్గరగా జయనాదమును చేసిరి.

289. ఈ విధముగా తన సైన్యము నశించుచుండగా,. మహిషాసురుడు తన మహిషరూపముతో ఆ దేవీగణములను భయ పెట్టెను.

290. ఆ రాక్షసుడు మహిష రూపముతో దేవీనిశ్వాసమునుండి జన్మించిన గణములలో కొందరిని తుండముతో కొట్టి భూమియందు పడ వైచెను.

291. ఆ రాక్షసుడు మహిషరూపముతో మరి కొన్ని దేవతా గణములను డెక్కలతో కొట్టి భూమిపై పడవైచెను.

292. ఆ రాక్షసుడు మహిష రూపముతో మరికొందరిని తోకతో కొట్టి భూమిపై పడవైచెను.

293. ఆ రాక్షసుడు మహిషరూపముతో మరి కొందరిని కొమ్ములతో చీల్చి నేలగూల్చెను.

294. ఆ రాక్షసుడు మహిషరూపముతో మరి కొందరిని తన వేగముచే భూమిపై పడ వేసెను.

295. ఆ రాక్షసుడు మరికొందిరిని తన నాదముచే భూమిపై పడవైచెను.

296. ఆ రాక్షసుడు మహిషరూపముతో మరికొందరిని తాను గిర గిరి తిరుగుతూ, నేలపై బడవైచెను.

297. ఆ రాక్షసుడు మహిష రూపముతో మరి కొందరు దేవీ గణముల వారిని తన నిశ్వాస వాయువుల చేతనే నేలపై బడ వేసెను.

298. ఆ రాక్షసుడు ప్రమథ గణములను ఈ విధముగా నేల గూల్చి, మహాదేవి యొక్క సింహమును సంహరించుటకు పరుగెత్తెను.

299. అప్పుడు జగన్మాతకు కోపము వచ్చెను.

300. గొప్ప పరాక్రమము గల ఆ మహిషుడు కూడ కోపము పొంది, డెక్కలతో భూతలమును చూర్ణము చేయుచున్నవాడై, కొమ్ములతో ఎత్తైన పర్వతములను విసిరి, నాదము చేసెను.

301. ఆ మహిషుడు వేగముగ తిరుగుట చేత భూతలము పగిలి శిథిల మయ్యేను.

302. ఆ మహిషాసురుని తోకచేత కొట్ట బడిన సముద్రము భూప్రదేశము నంతటిని ముంచివేసెను.

303. ఆ మహిషాసురుని కొమ్ముల విసురునకు మేఘములు శకలములై చెల్లా చెదరయ్యెను.

304. ఆ మహిషాసురుని శ్వాసవాయువులచే పైకి ఎగురగొట్టబడిన వందలాది పర్వతములు ఆకాశము నుండి క్రింద బడినవి.

305. ఈ విధముగా కోపముతో మండిపడుతూ మీదకు వచ్చుచున్న మహిషా సురునిచూచి, ఆ చండిక అపుడు వాని వధ కొరకు కోపమును పొందెను.

306. ఆమె వానిపై పాశమును విసిరి, బలశాలియగు ఆ రాక్షసుని బంధించెను.

307. ఆ మహా సంగ్రామములో ఈ విధముగ బంధింప బడిన ఆ రాక్షసుడు మహిష రూపమును విడిచి పెట్టెను.

308. అపుడా మహిషాసురుడు వ్యాఘ్రరూపమును ధరించగా, దేవి వానిని తిరిగి బంధించెను.

309. తరువాత ఆ మహిషాసురుడు ఖడ్గమృగమయ్యెను. దేవి వానిని మరల బంధించెను.

310. ఆ పై మహిషాసురుడు వరాహమయ్యెను. దేవి మరల వానిని బంధించెను

311. అపుడు వాడు వెంటనే సింహమయ్యెను. దేవి వానిని తిరిగి బంధించెను.

312. జగన్మాత సింహరూపమున నున్న వాని శిరస్సు నరకబోవునంతలో, వాడ కత్తి చేతబట్టిన పురుషుని రూపము ధరించి కనబడెను.

313. అపుడు దేవి వెను వెంటనే వాని కత్తిని, డాలును తదుపరి వానిని బాణములతో ఛేదించెను.

314. అపుడాతడు పెద్ద ఏనుగు అయెను.

315. ఏనుగు రూపమున నున్న ఆ మహిషుడు తొండముతో బలశాలియగు సింహమును లాగి గర్జించెను.

316. సింహమును లాగుచున్న ఏనుగు యొక్క తొండమును దేవి కత్తితో తెగవేసెను

317. అపుడా మహాసురుడు తిరిగి మహిషరూపమును దాల్చెను. ఎప్పటి వలెనే స్థావర జంగమాత్మకమగు ముల్లోకములను క్షోభింప జేసెను. మాయావియగు

ఆ రాక్షసుడు యుద్ధ ప్రారంభములో మహిషముగను, తరువాత వ్యాఘ్రము గను, ఖడ్గ మృగముగను, వరాహముగను, సింహముగను, పురుషునిగను, గజముగను, తిరిగి మహిషముగను రూపుదాల్చెను.

318. అపుడు జగన్మాతయగు చండిక కోపించినదై ఉత్తమమగు సురను అనేక పర్యాయములు పానము చేసెను. ఎర్రని నేత్రములు కలదై నవ్వెను.

**విశేషాంశములు:** ఈ మంత్రమునందు ఉత్తమపానము అనగా సుగంధభరిత మగు మద్యమని చండికోపాస్తి దీపికాకారులు వ్యాఖ్యానించిరి. ఆమె మద్య పానము చేతనే 'అరుణలోచన' అయినదనియు, హాసముకూడ మద్య ప్రభావ మేననియు వర్ణించిరి. ఈ వ్యాఖ్యని ప్రచారకులు తిరస్కరించుచున్నారు. మద్యపానము మహాపాతకములలో నొకటి. ఛాందోగ్యోపనిషత్తు మద్యపానమును గురుతల్పగమనము, బ్రహ్మహత్యలతో కలిపి లెక్కించెను. "స్తేనో హిరణ్యస్య సురాం పిబంశ్చ గురోస్తల్ప మావసన్ బ్రహ్మహా చైతే పతన్తి చత్వారః పంచమశ్చాచరంస్తైరితి". మద్యపానము చేయువానితో కలిసి తిరిగినను పతితుడగునని ఛాందోగ్యము వర్ణించెను. అట్టి మద్యము ఉత్తమ పానమెట్లగును? ఇది వామాచార ప్రభావముచే కలిగిన దురవస్థ అని ప్రచారకుల విశ్వాసము. అరుణ లోచనత్వము మద్యపానలింగము కాదు. దేవి సర్వారుణ. అంతేగాక, అతిమధురమగు సుధాపానము వలన గూడ అరుణలోచనత్వము, హాసము, మాటల తొట్రుపాటు కలుగును.

319. ఆ రాక్షసుడు కూడ బలము, పరాక్రమము, గర్వములతో నిండిన వాడై గర్జించెను. కొమ్ములతో పర్వతములను చండిక పైకి విసిరెను.

320. ఆమెయు తనపై విసరబడిన ఆ పర్వతములను బాణ సమూహములతో చూర్ణము చేయుచున్నదై, సుధాపానముచే ఎర్రనైన నోటితో తడబడుచున్న అక్షరములతో, ఆ మహిషునితో నిట్లు పలికెను.

321. ఓరీ మూర్ఖా! నేను సుధాపానము చేయు వరకు, నీవు కొద్దిసేపు గర్జించు చుండుము. నేను నిన్ను ఇక్కడనే సంహరించిన వెంటనే దేవతలు గర్జించెదరు.

ఋషి పలికెను

322. ఇట్లు పలికి, ఆమె ఎగిరి ఆ రాక్షసుని పైకురికి, పాదముతో వానిని తొక్కి పట్టి కంఠమునందు శూలముతో పొడిచెను.

323. అపుడా రాక్షసుడు దేవియొక్క పాదముచే తొక్కబడినవాడై తన మహిషా కారము యొక్క ముఖమునుండి పురుషరూపముగ బయటకు వచ్చుచూ, సగము మాత్రమే రాగలిగెను. ఇంతలో దేవియొక్క పరాక్రమము వాడు పూర్తిగా బయటకు రాకుండు నట్లు చేసెను.

324. ఆ బలశాలియగు రాక్షసుడు సగము మాత్రమే బయటికి వచ్చి యుండియు, యుద్ధము చేయుచునే ఉండెను. దేవి తన చేతియందలి వాడి కత్తితో వాని శిరస్సును ఖండించి పారవైచెను.

ముల్లోకములకు సుఖమునిచ్చు ఆ దేవి ఈ విధముగా ఆ మహిషాసురుని భృత్యులతో, మిత్ర గణములతో సహా సంహరించెను. అపుడు మహిషుడు సంహరింప బడగనే, ముల్లోకములయందలి ప్రాణులన్నియు, దేవతలు, రాక్షసులు, మనుష్యులతో సహా జయ జయ ధ్వానములు చేసిరి.

325. అపుడు రాక్షస సైన్యమంతయు హాహాకారములు చేయుచూ; పలాయనము చిత్తగించెను.

326. దేవతా గణములు, దేవీగణములు అన్నియు గొప్ప ఆనందమును పొందినవి.

327. దేవతలు దేవర్షులతో కలిసి ఆ దేవిని స్తుతించిరి.

**విశేషాంశములు:** ఈ అధ్యాయములో వ్యాసమహర్షి అంబికా, దేవీ, భద్రకాళీ, పరమేశ్వరీ, కాళరాత్రి, మహాదేవీ, చండికా, జగన్మాతా అను నామములను ప్రయోగించెను. ఇవి అన్నియు మహిషాసురమర్దినియగు పరాశక్తిని బోధించును.

328. దేవతలు అంతరిక్షములో విమానములందున్నవారై పూలవానలను కురిపించిరి.

329. విశ్వావసువు మొదలగు గంధర్వ పతులు గానము చేసిరి.

330. అప్సరసలు గుంపులుగా నాట్యము చేసిరి.

330-1 అపుడు మహిషాసుర సంహారము కాగానే ఇంద్రుడు మొదలుగా గల దేవతా గణములన్నియు దేవిని స్తోత్రము చేయ ప్రారంభించిరి.

**విశేషాంశములు:** మహిషాసుర వధ తర్వాత దేవతలు చేసిన స్తుతికి 'మహిషాన్తకరీ సూక్తము' అని పేరు. ఈ సూక్తము ప్రధానముగా అతి సుందరమైన వసంత తిలక వృత్తములో నున్నది. ఈ సూక్తము గురించి లక్ష్మీతంత్రములో ఇట్లు చెప్పబడెను. "మహిషాన్తకరీసూక్తం దృష్టం దేవైర్మహర్షిభిః". అనగా దేవతలు, మహర్షులు మహిషాన్తకరీసూక్తమును ప్రత్యక్షము చేసుకొనిరి. కాన ఈ సూక్తము వేదము వలె అపౌరుషేయము. చండీ నవశతిని పారాయణ చేయుటకు సాధకుడు గురూపదేశము పొంది యుండ వలెను. కాని ఈ సూక్తము విషయములో అట్టి నియమము లేదు. దీనిని సర్వులు పఠించి తమ తమ ఆపదలను నివారించుకొనగలరు.

## "మహిషాన్తకరీ సూక్తమ్"

### మకుటం

తాం దుర్గాం దుర్గమాం దేవీం దురాచార విఘాతినీమ్।
నమామి భవభీతోఽహం సంసారార్ణవ తారిణీమ్॥

**మకుటార్థము:** నేను సంసారము వలన భయమును పొందియున్నాను. దురాచారులను నాశనము చేయునట్టియు, సంసారమనే సముద్రమును

దాటుటకు నావయైనట్టియు, పాపాత్ములకు పొందశక్యము కాని దుర్గా దేవిని నమస్కరించు చున్నాను.

**ఋషి పలికెను.**

331. గొప్ప పరాక్రమశాలియు, దుర్మార్గుడునగు ఆ మహిషుడు, వాని రాక్షస సైన్యము దేవిచేత నశింప చేయబడగనే, ఇంద్రాది దేవతా గణములు మెడ, భుజములు వంచి నమస్కరించు వారై, ఆనందము వలన కలిగిన రోమాంచముచే సుందరమగు దేహములు గలవారై, ఆమెను వాక్కులతో స్తుతించిరి.

**విశేషాంశములు:** "ప్రహర్ష పులకోద్గమము" చక్కని భక్తికి నిదర్శనము. ఇంద్రాదులవలె సాధకులు కూడ ఈ స్తోత్ర భావమును అనుసంధానము చేసి 'ప్రహర్ష పులకోద్గమ చారుదేహులు' అయినచో, మానవ దేహమును ధరించిన కృతార్థత కలుగును. 'చంపూ భాగవతము' లోని ఈ శ్లోకమును గమనింపుడు.

'ఆనందాశ్రుఝరీ పరీతనయనా స్సంఫుల్లరోమచ్ఛటాః
స్వేదాపూరిత గద్గద ధ్వని భృత స్సంక్షీణ వేద్యాన్తరాః|
ధన్యాః కేచన చిన్మయీం పశుపతే రానంద కందాయితాం
అంబ త్వామనుచింతయంతి కరుణాకల్లోలినీ మాదరాత్||

ఆనంద బాష్పములతో కన్నులు నిండగా, రోమాంచము గలవారై, స్వేదము కలిగి, డగ్గుత్తిక గల కంఠముతో, సర్వము మరిచి, ధన్యులు కొద్ది మంది కరుణా సముద్రు రాలగు జగన్మాతను ధ్యానింతురు.

**దేవతలు పలికిరి.**

332. దేవి తనశక్తిచే ఈ జగత్తంతయు వ్యాపించియున్నది. దేవతలందరి శక్తుల కలయికయే దేవిగా మూర్తీభవించెను. ఆమెను సమస్త దేవతలు, మహర్షులు పూజింతురు. అట్టి జగన్మాతకు భక్తితో ప్రణమిల్లు చున్నాము.

**విశేషాంశములు:** పరమాణువుల లోని కదలిక నుండి గ్రహముల చలనము వరకు ఈ జగత్తులో ఏ చైతన్యము, లేక శక్తి, గలదో, అది దేవీ రూపమే. ఈ విషయమునే 'ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్' అను శ్రుతియు చెప్పుచున్నది. సమస్త దేవతల తేజస్సులు ఒకచోట గూడి దేవిగా ఆవిర్భవించిన విధము ద్వితీయాధ్యాయము నందు వర్ణింప బడెను.

333. ఆమె మాకు శుభముల నిచ్చుగాక!

**విశేషాంశములు:** శుభములు రెండు విధములు. మొదటిది అభ్యుదయము లేక యోగ క్షేమము. పశుపుత్రాది లక్షణము. రెండవది నిశ్శ్రేయసము అనగా మోక్షసామ్రాజ్యము. ఈ రెండు శుభములు దేవ్యనుగ్రహలభ్యములే. 'యో యదిచ్ఛతి తస్య తత్'.

334. ఏ దేవి యొక్క సాటిలేని మహిమను, బలమును వర్ణించుటకు బ్రహ్మావిష్ణు మహేశ్వరులు కూడ సమర్థులు కారో, అట్టి చండిక సమస్త జగత్తును రక్షించుట కొరకు, రాక్షస భయమును తొలగించుట కొరకు సంకల్పించు గాక!

విశేషాంశములు: దేవి సంకల్పించుటయే తడవుగా శిష్టరక్షణ, దుష్టశిక్షణ జరుగునని భావము.

335. పుణ్యాత్ముల ఇండ్లలో ఏ సంపద గలదో, అది స్వయముగా నీవే.

విశేషాంశములు: శ్రీః అనగా గృహక్షేత్రారామాది సంపద మాత్రమే గాదు. ఈ సంపద అశాశ్వతము. "ఋచస్సామాని యజూగ్ంషి| సా హి శ్రీరమృతా సతామ్||" అని శ్రుతి. మానవుని ఆధ్యాత్మికోన్నతికి సాధనమగు వేద విద్యయే అమృతమగు శ్రీ.

336. అట్టి నిన్ను నమస్కరించుచున్నాము. ఓ దేవీ! జగత్తును పరిపాలింపుము.

337. పాపాత్ముల ఇండ్లలోని దారిద్ర్యముకూడ స్వయముగ నీవే.

విశేషాంశములు: లక్ష్మి, అలక్ష్మి రెండునూ దేవీ రూపములే. ప్రకృతిలోని సౌందర్యము, ప్రకృతి సృష్టించు బీభత్సము రెండునూ దేవి లీలలే. దేవి సృష్టి కర్త్రి మాత్రమే గాదు. సంహారిణి కూడ ఆమెయే. జన్మలో, మరణములో, ఆరోగ్యములో, రోగములో, శాంతిలో, యుద్ధములో, పూర్ణిమ నాటి వెన్నెలలో, అమావాస్యనాటి చిమ్మ చీకటిలో, ఆ దేవీ మాహాత్మ్యమునే దర్శింపవలెనని పెద్దలు చెప్పుదురు.

338. అట్టి నిన్ను నమస్కరించుచున్నాము. ఓ దేవీ! జగత్తును పరిపాలింపుము.

339. జ్ఞానుల హృదయములందు ఏ జ్ఞానము కలదో, అది స్వయముగ నీవే.

విశేషాంశములు: జ్ఞాతకంటె భిన్నమైన జ్ఞానము లేదు. జ్ఞాతృ స్వరూపమే జ్ఞానము. అదియెట్లన, సూర్యుని కంటె సూర్యప్రకాశము భిన్నము కాదు. సూర్యుని యందు ప్రకాశరూప వ్యాపారమేమియు వేరుగా లేదు. కాన జ్ఞానుల హృదయములోని జ్ఞానము దేవియే. శ్రుతి ఇట్లు చెప్పుచున్నది "నాన్యోఽతోఽస్తి ద్రష్టా".

340. అట్టి నిన్ను నమస్కరించుచున్నాము.
ఓ దేవీ! జగత్తును రక్షింపుము.

341. సత్పురుషుల హృదయములో ఏ శ్రద్ధ గలదో, అది స్వయముగ నీవే.

విశేషాంశములు: శ్రద్ధ యనగా దేవ గురుజనశాస్త్ర వచనాదుల యందు ప్రమాణ బుద్ధి. శ్రద్ధ మూఢవిశ్వాసము కంటె భిన్నమైనది. మూఢవిశ్వాసమునకు అజ్ఞానము ఆధారము. శ్రద్ధయందు ఆలోచనా శక్తి, విమర్శాత్మక ప్రవృత్తి, తత్త్వనిర్ణయమందలి ఆసక్తి మిళితమై యుండును. శ్రద్ధావంతునకే సమస్త విద్యలు ప్రకాశించును.

342. అట్టి నిన్ను నమస్కరించు చున్నాము. ఓ దేవీ! జగత్తును రక్షింపుము.

343. సత్కుల సంజాతుల హృదయములందు ఏ లజ్జగలదో, అదిస్వయముగ నీవే.

విశేషాంశములు: లజ్జ యనగా అధర్మాచరణము వలన కలిగిన సిగ్గుకాదు. కుల స్త్రీలయందు సహజముగ భాసించు పవిత్ర సంస్కార రూపమగు సిగ్గు 'లజ్జ' యన బడును.

344. అట్టి నిన్ను నమస్కరించుచున్నాము. ఓ దేవీ! జగత్తును పరిపాలింపుము.

345. ఓ దేవీ! రాక్షసులు, దేవతలు, ప్రమథ గణములు మొదలగు వారందరి యందు నీరూపము ఊహకందనిది. అట్టి నీ రూపము నేమివర్ణింపగలము?

విశేషాంశములు: దేవతల యెదుట నున్న దేవి రూప మెట్టిది? ఆమె కాంతిచే ముల్లోకములు నిండుచుండెను. ఆమె కిరీటము ఆకాశము నంటుచుండెను. ఆమె సహస్ర బాహువులు దిగంతములందు వ్యాపించి యుండెను. ఇట్టి దివ్యరూపమును వర్ణించుట దేవతలకు మాత్రమెట్లు సాధ్యమగును?

346. ఓ దేవీ! రాక్షసుల వినాశహేతువైనట్టియు, రాక్షసులు, దేవతలు, ప్రమథ గణములు మొదలగు వారందరియందు సర్వాతిశాయియగు నీ పరాక్రమము నెట్లు వర్ణింపగలము?

347. ఓ దేవీ! అసుర ప్రభువగు మహిషుడు, దేవీ గణములు ప్రముఖముగా గల యుద్ధములందు నీయొక్క అద్భుతమగు కర్మలను ఏమి వర్ణింపగలము?

విశేషాంశములు: దేవి యొక్క అద్భుత చరితములనగా, ఆమె శరీరము నకు తగులుట తోడనే చిక్షురుని ఖడ్గము భగ్నమగుట, ఆమె యొక్క హుంకారము చేతనే చామరుని శక్తి నిర్వీర్యమగుట ఇత్యాదులు.

348. ఓ దేవీ! నీవే జగత్తులన్నిటికీ కారణమగు చున్నావు.

349. నీవు త్రిగుణాత్మికవైనను దేవతలు నిన్ను తెలియకున్నారు.

విశేషాంశములు: దేవియొక్క నిర్గుణ పరబ్రహ్మ స్వరూపమును దేవతలు కూడ తెలియకున్నారని వేరుగా చెప్పనేల? "దేవైరత్రాపి విచికిత్సితం పురా న హి సుజ్ఞేయమణురేష ధర్మః" అని యముడు నచికేతునితో అనును. ఈ పరబ్రహ్మము అను ధర్మము అతి సూక్ష్మము. దీని విషయములో దేవతలు కూడ సందేహమునే పొందుచుందురు.

350. ఓ దేవీ! హరిహరాదులు కూడ నిన్ను తెలియకున్నారు.

351. ఓ దేవీ! నీవు ఆద్యన్తములు లేని దానవు.

352. ఓ దేవీ! నీవే సర్వజగదధిష్ఠానము.

353. ఓ దేవీ! ఈ జగత్తంతయు నీ అంశయే.

354. ఓ దేవీ! నీవే అవ్యాకృతము.

355. ఓ దేవీ! నీవే పరాత్పరవు.

356. ఓ దేవీ! నీవే ప్రకృతివి.

357. ఓ దేవీ! నీవే అద్యూరాలవు.

విశేషాంశములు: ఈ పైమంత్రములలో దేవి మూలప్రకృతి రూపముగా స్తుతింపబడినది. మార్కండేయ పురాణ మిట్లు చెప్పుచున్నది.

"అనాద్యంతం జగద్యోని త్రిగుణ ప్రభవాత్మకమ్|
మానాతీతమవిజ్ఞేయం యచ్చ సర్వత్ర వర్తతే||

ప్రధాన కారణం ప్యేత దవ్యక్తాఖ్యం మహర్షయః|
ఆహుశ్చ మూల ప్రకృతిమ్||

అనాది, అనన్తము, జగత్కారణము, త్రిగుణాత్మకము, అపరిచ్ఛిన్నము, ఇంద్రియజ్ఞానాతీతము, సర్వగతము అగు మూలప్రకృతిని మహర్షులు 'అవ్యక్తము' అని చెప్పుచున్నారు. ఈ మూలప్రకృతియే పరమాత్మ యొక్క శక్తి, లేక ఈశ్వర శక్తి. ఈ శక్తి మూలకము గనే నిర్గుణ పరబ్రహ్మము నుండి సృష్టి స్థితి లయములు ప్రవర్తిల్లు చున్నవి. అగ్ని యొక్క దాహక శక్తి అగ్ని నుండి వేరు కానట్లు, ఈశ్వర శక్తి ఈశ్వర భిన్నము కాదు. కనుక ఈ శక్తి సాంఖ్య పరికల్పిత మగు, జడమగు ప్రధానము కాదని గ్రహింపవలెను. సాంఖ్య ప్రధానము 'అశబ్దము' అనగా వేదప్రతిపాద్యము కానిది కనుక అప్రమాణము.

ఛాందోగ్యోపనిషత్తు ఇట్లు వర్ణించెను. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్". దీనిపై శ్రీమచ్ఛంకర భాష్యమిట్లున్నది. "సదేవ సదిత్యస్తితామాత్రం వస్తు సూక్ష్మం నిర్విశేషం సర్వగత మేకం నిరంజనం నిరవయవం విజ్ఞానం యదవగమ్యతే సర్వవేదాన్తేభ్యః ఇదం జగన్నామ రూపక్రియావద్వికృతముపలభ్యతే యత్తత్సదేవ ఆసీత్|" నామరూపాత్మకమగు ఈ జగత్తు ఉత్పత్తికి పూర్వము కేవల సద్రూపముగ నుండినది. అట్టి సద్రూపమే దేవీతత్త్వము.

ఈ జగత్తంతయు పరబ్రహ్మయొక్క అంశము మాత్రమే అనుటలో ప్రమాణము లగు శ్రుతిస్మృతులేవన - "పాదోఽస్య విశ్వా భూతాని" (పురుష సూక్తము), "విష్టభ్యాహ మిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్" (భగవద్గీత) ఇత్యాది.

ఓ దేవీ! యజ్ఞము లన్నిటి యందు దేనిని ఉచ్చరించుటచే దేవతలందరు తృప్తిని పొందెదరో, అట్టి స్వాహాకారము నీవే.

పితృదేవతలు తృప్తి పొందుటలో కూడ నీవే కారణము. ఇందు చేతనే జనులచే నీవే 'స్వధ' అని ఉచ్చరింప బడుచున్నావు.

360. ఓ దేవీ! అతి దుష్కరములగు మహావ్రతములతో గూడిన మోక్ష హేతువగు బ్రహ్మవిద్య నీవే.

360-1ఓ దేవీ! ఇంద్రియములను లెస్సగా నియమించి నట్టియు, నిత్యానిత్య వస్తువివేకముగల జ్ఞానులచే అభ్యసింపబడు బ్రహ్మవిద్య నీవే.

360-2ఓ దేవీ! తొలగిన సమస్త దోషములు గల మోక్షకాములగు మునులచే అభ్యసింప బడునట్టియు, పరమ పవిత్రమైనట్టియు, సర్వోత్తమమగు బ్రహ్మ విద్య నీవే.

విశేషములు: శమదమాది షట్క సంపత్తి, నిత్యా నిత్య వస్తు వివేకము, ఇహాముత్ర ఫలభోగ విరాగము అనునవి మహా వ్రతములు. బ్రహవిద్య సర్వ విద్యలలో శ్రేష్ఠమగుటకు హేతువేమనగా "యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమితి" అని ఛాందోగ్యము. దీనిపై "సర్వానపి వేదానధీత్య సర్వం చాన్యద్వేద్యమధిగమ్యాప్యకృతార్థ ఏవ భవతి యావదాత్మతత్త్వం న జానాతి" అని శ్రీమచ్ఛంకరభాష్యము. పరమకారణమగు పరబ్రహ్మతత్త్వము తెలిసినచో, కార్యరూపము, కారణానన్యము అగు జగత్తంతయు తెలిసినట్లే. సర్వవేదములు అధ్యయనము చేసినను, ఇతర విద్యలనెన్నిటిని స్వాధీనము చేసుకొన్నను, బ్రహ్మవిద్యను తెలియనంత వరకు కృతార్థత లేదు. అందుచేతనే గీతాచార్యులు "అధ్యాత్మ విద్యా విద్యానాం" అనిరి.

361. ఓ దేవీ! నీవు శబ్దస్వరూపురాలవు.

362. నీవు అతి పవిత్రమైన అను శబ్దముగల దానవు. అనగా స్పష్టమైన ఉచ్చారణతో గూడిన శబ్దము గలదానవు.

363. ఋక్కులకు, యజుస్సులకు నీవే ఆధారము.

విశేషాంశములు: వృత్త బద్ధములగు మంత్రములు ఋక్కులు. గద్యాత్మక మంత్రములు యజుస్సులు.

364. ఓ దేవీ! బిగ్గరగా గానము చేయుటచే రమ్యమైన పదోచ్చారణము గల సామలకు నీవే ఆధారము.

365. ఓ దేవీ! వేద విద్య నీవే.

విశేషాంశములు: కూర్మపురాణములో పార్వతి హిమవంతునికి ఇట్లు ఉపదేశించెను.

"నాన్యతో జ్ఞాయతే ధర్మో వేదాద్ధర్మో హి నిర్బభౌ|
తస్మాన్ముముక్షుర్ధర్మార్థం మద్రూపం వేదమాశ్రయేత్"||

"ధర్మమును తెలియుటకు వేదముతప్ప గత్యంతరము లేదు. ధర్మము వేదము వలననే ప్రకాశించును. కాన మోక్షార్థులు నా రూపమగు వేదమును ఆశ్రయించ వలెను." మరియు,

"మమైవాజ్ఞా పరాశక్తి ర్వేదసంజ్ఞా పురాతనీ|
ఋగ్యజుస్సామరూపేణ సర్గాదౌ సంప్రవర్తతే||"

"నా ఆజ్ఞా రూపమగు వేదము సృష్ట్యాదియందు ఋగ్యజుస్సామరూపముగ ప్రవర్తిల్లును" అని పార్వతి చెప్పెను. ఈ విధముగ వేదము సాక్షాత్తు దేవీ స్వరూపమే.

366. దారిద్ర్యము మొదలగు మహాదుఃఖములను తొలగించి, ప్రజలందరికి క్షేమమును కలిగించు కృషి, గోరక్షణము, వాణిజ్యము ఇత్యాది విద్యలు నీవే. మరియు తర్కవిద్య, దండనీతి ఇత్యాది విద్యలు నీవే.

విశేషాంశములు: పై మంత్రములలో దేవియే సర్వవిద్యాస్వరూపురాలుగా వర్ణింప బడెను.

367. సమస్త వేద శాస్త్రముల సారము నెరింగిన బుద్ధిశక్తికి అధిష్ఠానమగు సరస్వతివి నీవే

368. విష్ణు హృదయము నందెల్లపుడు నివసించు లక్ష్మివి నీవే.

369. చంద్రశేఖరుని వామ భాగము నందు స్థిరముగ నుండు పార్వతివి నీవే.

370. దుస్తరమగు సంసార సముద్రమును దాటించుటలో అప్రతిహతమగు శక్తి గల నౌక యగు దుర్గవు నీవే.

విశేషాంశములు: ఇటు వంటి భావమునే శ్రీ శంకరాచార్యులు సౌందర్యలహరిలో ప్రకటించిరి.

"గిరామాహుర్దేవీం ద్రుహిణ గృహిణీ మాగమ విదః
హరేః పత్నీం పద్మాం హరసహచరీ మద్రితనయామ్|
తురీయా కాపి త్వం దురధిగమనిస్సీమ మహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషి!"

ఓ దేవీ! నీవే పరమాత్మ శక్తివి. పండితులు నిన్నే చదువుల తల్లియగు సరస్వతిగను, విష్ణువు యొక్క సహచారిణియగు లక్ష్మిగను, శివుని అర్ధాంగి యగు పార్వతిగను వర్ణింతురు. కాని నీవు మహామాయవు. నీ మహిమ అనంతము. నీవే ఈ జగచ్చక్రమును త్రిప్పుచున్నావు. సరస్వతీ, లక్ష్మి, పార్వతులకు అతీతమగు తురీయ తత్త్వమే నీవు.

371. నీ ముఖము చిన్న చిరునవ్వుతో కూడినది. స్వచ్ఛమైనది. పూర్ణిమనాటి చంద్రబింబమును పోలినది. బంగారము వలె ఉత్తమమగు కాంతితో శోభించునది. కోపించిన మహిషాసురుడు అట్టి నీ ముఖమును చూచి కూడా నీపై దాడి చేయగల్గుట గొప్ప ఆశ్చర్యము.

విశేషాంశములు: చంద్రునిలో మచ్చ ఉండును. దేవిముఖము చంద్రబింబమును పోలినను, మచ్చ లేనిది అని వ్యతిరేకాలంకారము. రమ్యమైన వస్తువును చూచిన కోపమే కలుగదు. అట్టిది మహిషాసురుడు ప్రహారమునకు ఉద్యుక్తుడగుట ఆశ్చర్యకరము.

372. ఓ దేవీ! ఉదయించు చంద్రునివంటి కాంతి గలిగి, కోపముతో కనుబొమల వక్రతచే భయమును కలిగించు నీ ముఖమును చూచి కూడ మహిషుడు వెంటనే ప్రాణములను విడువకపోవుట అత్యాశ్చర్యము.

373. కోపించిన యముని దర్శించి ఎవరు జీవించ గలరు?

374. ఓ దేవీ! ప్రసన్న రాలవు కమ్ము. నీవు ప్రసన్నురాల వైనచో శ్రేయస్సు కలుగును.

375. నీవు ఎవరిపై కోపింతువో, వారి వంశములను వెనువెంటనే నాశనము చేసెదవు.

376. నీ కోపఫలము ఇపుడే ప్రత్యక్షముగా కనబడుచున్నది. ఏలయన, మహిషాసురుని యొక్క ఈ అతివిశాలమైన సైన్యము నీచే నశింప చేయబడినది.

377. ఇహలోక సుఖములను, పరలోక సుఖములను ఇచ్చు నీవు ఎవరియందు ప్రసన్నురాల వగుదువో, వారే ఎల్లపుడు అన్ని దేశములయందు పూజింప బడుదురు. వారికే సంపదలు లభించును. వారికి కీర్తి కలుగును. వారికి ధర్మార్థ కామ మోక్షములను పురుషార్థములు క్షీణించకుండును. వారికి కుమారులు, భృత్యులు, భార్య వినీతులై ఉందురు. వారే కృతకృత్యులగుదురు.

378. ఓ దేవీ!పుణ్యాత్ముడు ఎల్లపుడు ప్రతిదినము గొప్ప ఆదరముతో సమస్తమైన ధర్మకార్యములను చేయును.

379. తరువాత నీ అనుగ్రహముచే స్వర్గమును కూడ పొందును.

380. ఓ దేవీ! కావున నీవే రెండు లోకములందు కూడ ఫలమును ఇచ్చుదానవు.

విశేషాంశములు: ఈ మంత్రములలో దేవియే కర్మఫల ప్రదాత్రియని చెప్ప బడినది. కర్మయే ఫలహేతువు గనుక, ప్రాణులనుభవించు సుఖదుఃఖములు పూర్వకృత సుకృత దుష్కృతములపై ఆధారపడి యుండును గనుక, కర్మజన్యమగు అపూర్వమే ఫలమీయ సమర్థమై యుండ, వేరుగా కర్మఫల ప్రదాతృత్వము దేవికెట్లు సంభవించెడిని? అని శంకింపవలదు. ప్రత్యక్షముగ నశించు కర్మనుండి భావరూపమగు ఫలము లభింపజాలదు. మరియు, అ చేతనమగు కర్మాపూర్వమునకు ఫల ప్రదాతృత్వము సంభవింపదు. లోకములో కూడ కర్మద్వారా రాజానుగ్రహము పొంది, తద్ద్వారా మానవుడు ఫలమును పొందుచున్నాడు. శ్రుతియు కర్మ ఫలప్రదాత ఈశ్వరుడే యని చెప్పుచున్నది. "స వా ఏష మహానజ ఆత్మాన్నాదో వసుదానః". ఈ విషయమునే వేదవ్యాసుఖు "ఫలమత ఉపపత్తేః" 'శ్రుతత్వాచ్చ' అను బ్రహ్మసూత్రములందు వివరించెను. కాన, ప్రాణులకు కర్మఫలమును ఇచ్చునది దేవియే.

381. ఓ దుర్గా! దారిద్ర్యము, రోగము మొదలగు సంకటములందు నిన్ను స్మరించిన సమస్త ప్రాణులయొక్క భయమును నీవు తొలగించెదవు.

382. దారిద్ర్య రోగాది దుఃఖములకతీతులగు ముముక్షువులచే స్మరింపబడిన దానవై నీవు వారికి అత్యంత పవిత్రము, మంగళకరమునగు జ్ఞానము నొసగెదవు.

383. దారిద్ర్యము, రోగము మొదలగు దుఃఖముల వలన కలుగు భయమును పోగొట్టు ఓ దేవీ! ప్రాణుల నన్నిటిని అనుగ్రహించుటకు ఎల్లప్పుడు అనురాగముతో నిండిన హృదయముగల దైవము నీవు కాక మరెవ్వరు?

విశేషాంశములు: గీతాచార్యులు భక్తులను నాల్గురకములుగ వర్ణించిరి. "ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ". పై మంత్రములలో ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థుల భక్తి చెప్పబడెను. ఇక జ్ఞాని గురించి చెప్పునదేమున్నది? జ్ఞానికి, దేవికి భేదమే లేదు. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్".

384. "ఈ రాక్షసుల సంహారముచే జగత్తు సుఖమును పొందును. మరియు, వీరు చిరకాలము నరకమును పొందుటకు తగిన పాపమును చేసి యుండవచ్చుి గాక! అయినప్పటికీ, వీరుగూడ యుద్ధములో మృత్యువును పొంది స్వర్గమును చేరుదురు గాక!" అని తలచి, నీవు శత్రువులను సంహరించుచున్నావు. ఇది నిజము.

విశేషాంశములు: పూర్వమంత్రములో భక్తుల యందు దేవ్యనుగ్రహము వర్ణింబడెను. ఈ మంత్రములో ఉదాసీనులయందు, అభక్తులయందు, ఆమెను ద్వేషించు వారియందు కూడ ఆమె అనుగ్రహము వర్ణింప బడెను. తల్లి తన కుమారుల నందరిని, వారి ప్రవృత్తులెట్టివైనను, సమానముగనే ప్రేమించి, హితమును చేకూర్చును. సర్వప్రాణులు దేవీ భక్తులు కారు. అయినను, సర్వజగద్రక్షణ కొరకై దేవి రాక్షససంహారము చేసెను. తనను ద్వేషించు రాక్షసులు కూడ కృతార్థులు కావలెననియే, దేవి వారికి వీరమరణమును ప్రసాదించెను.

"ద్వావేతౌ పురుష వ్యాఘ్రౌ సూర్యమండల భేదినౌ|
పరివ్రాడ్యోగ యుక్తశ్చ రణే చాభిముఖో హతః||.

యోగి యగు సన్న్యాసి, యుద్ధములో శత్రువునకభిముఖముగా వీరమరణమును పొందిన వాడు, వీరిద్దరు సూర్యమండలమును భేదించి, దివ్య లోకములను పొందెదరు.

385. నీవు రాక్షసులనందరినీ నీ కంటి చూపుచేతనే భస్మము చేయలేవా? శస్త్రము ను ప్రయోగించ పనియేమి? శత్రువులైనను, రాక్షసులుకూడ నీ శస్త్రముచే పవిత్రులై పుణ్యలోకములను పొందవలెనని, నీకు వారియందు కూడ గొప్ప అనుగ్రహ బుద్ధి గలదు.

386. నీ కత్తి యొక్క భయంకరములగు తేజఃపుంజముల ప్రసారముల చేత, మరియు శూలము యొక్క అగ్ర భాగము నుండి వెలువడే కాంతి సమూహము చేత రాక్షసుల నేత్రములు గుడ్డివి కాక పోవుటకు కారణమేమనగా వారు అమృత కిరణుడగు చంద్రుని కళతో గూడిన నీ ముఖమును చూచు చుండుటయే.

387. ఓ దేవీ! పాపాత్ముల దురాచారములను తొలగించుట నీ స్వభావము.

387-1ఈ నీ రూపము ఇతర రూపముల కంటె విలక్షణ మైనది, ఊహింప శక్యము కానిది.

387-2నీ పరాక్రమము దేవతల పరాక్రమమును త్రిప్పి కొట్టిన రాక్షసులను సంహరించునది.

387-3నీవీ విధముగా శత్రువులయందు కూడ దయనే చూపితివి.

388. ఈ నీ పరాక్రమమునకు పోలిక ఎక్కడిది? శత్రువులకు భయమును కలిగించునదియు, భక్తుల మనస్సుల కాహ్లాదము కలిగించు నీ రూపము వంటి రూపము, మరెక్కడ గలదు?

389. వరములనిచ్చు ఓ దేవీ! ముల్లోకములలో నీయందు మాత్రమే మనస్సులో దయ, సమరములో కాఠిన్యము కనబడును.

**విశేషాంశములు:** దేవి రాక్షసులను సంహరించు నపుడు కాఠిన్యమును, వారికి దివ్య లోకముల నిచ్చుటలో దయను చూపెను.

390. రాక్షస వధచే ఈ సమస్తమైన భువన త్రయము రక్షింపబడెను. ఆ రాక్షస గణములను గూడ యుద్ధము నందు సంహరించి స్వర్గమును ఇచ్చితివి. పొగరుతో నిండిన రాక్షసుల వలన భయము కూడ మాకు తొలగించితివి.

391. అట్టి నీకు నమస్కారము.

**విశేషాంశము:** నమస్కరించుట తప్ప ఇకమేము నీకు ఏమి చేయగలము. (చేయజాలము అనిభావము.)

392. ఓ దేవీ! మమ్ములను శూలముతో రక్షింపుము. ఓ జగన్మాతా! ఖడ్గముతో కూడ రక్షింపుము. మమ్ములను ఘంట యొక్క ధ్వనితే, నారిత్రాటి యొక్క ధ్వనితో రక్షింపుము.

**విశేషాంశము:** 'కుమారులను రక్షించుట తల్లి కర్తవ్యము' అను భావము 'అంబికే' అను సంబోధనలో వ్యక్తమగును.

393. రక్షణ సమర్థురాలవగు ఓ చండికా! నీ శూలమును త్రిప్పుటచే తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరములను దిక్కులందు రక్షింపుము.

394. ముల్లోకములలో సంచరించు నీ శాన్త రూపములు, ఘోరరూపములు ఏవి కలవో వాటితో మమ్ములను, జగత్తును కూడ రక్షింపుము.

**విశేషాంశములు:** శ్రుతి శివునికి కూడ ఘోర, అఘోర రూపములను వర్ణించెను.

"అఘోరేభ్యోzథ ఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః|
సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః||"

భక్తులకు ఆహ్లాదము, చిత్త సమాధానము కలిగించు రూపము శాన్తరూపము. శత్రువులకు భయమును గొల్పు రూపము ఘోర రూపము. మరియు,

బ్రహ్మాండమంతయు దేవీ రూపమే గనుక, దానిలోని చంద్రుడు, జలము మొదలగునవి శాన్త రూపములు. సూర్యుడు, అగ్ని మొదలగునవి ఘోర రూపములు.

395. ఓ జగన్మాతా! చిగురుటాకుల వంటి నీ చేతుల యందు ఖడ్గము, శూలము, గద మొదలగు ఏ శస్త్రాస్త్రములు కలవో, వాటితో మమ్మెలను సర్వత్ర రక్షింపుము.

విశేషాంశములు: ఖడ్గాద్యాయుధములు భయంకరములే యైనను, వానిని ధరించు చేతులు పల్లవముల వంటివిగాన, మాకు ఆ ఆయుధములు రక్షణనే ఇచ్చును అని ధ్వని. లేదా, ఖడ్గాద్యాయుధముల ధరించినను, చేతుల మృదుత్వము పోలేదు అనియు ధ్వని.

మహర్షి పలికెను.

396. దేవతలీ విధముగా స్తుతించి, జగన్మాతను నందన వనమునందు ఉద్భవించిన దివ్యపుష్పములతో, గంధము యొక్క లేపనములతో అర్చించిరి. దేవతలందరు ఆమెను సుగంధ యుక్తములగు ధూపములచే భక్తితో పూజించిరి. అనుగ్రహముతో ప్రకాశించు ముఖము గల దేవి, నమస్కరించిన దేవతల నందరిని ఉద్దేశించి పలికెను.

397. "సమస్త దేవతలారా! నా నుండి కోరదలచిన కోర్కెలను కోరుకొనుడు. మీ యీ స్తోత్రములచే లెస్సగా పూజింపబడిన నేను ఆనందముతో మీ కోర్కెలను తీర్చెదను. నేను చేయదగిన ఇతర కార్యము ఎంత కఠినమైనదైనను చెప్పుడు. మీ స్తోత్రము చేత, ఆరాధన చేత సంతసించితిని. మీరు చేసిన పూజలకు, నమస్కారములకు, మీ భక్తికి సంతసించితిని. మహాపరాక్రమ శాలి యగు మహిషుని యుద్ధము నందు సంహరించితిని. జగత్కల్యాణము కొరకు ఇంకను చేయ దగిన దేమున్నది? నేను మీ కార్యమును కఠినమైనను ఆనందముగ జేసెదను. జగత్కల్యాణ కారియగు వరమును కూడ ఇచ్చెదను." అనెను. దేవి యొక్క ఈ మాటలు విని దేవతలు సంతోషించి, ఆమె ఎదుట అంజలి ఘటించి ఇట్లు పలికిరి.

దేవతలు పలికిరి.

398. భగవతియగు నీచే సర్వము సాధింపబడినది. ఏమియు మిగులలేదు. ఏలయన, ఈ మా శత్రువగు మహిషాసురుడు వధింపబడినాడు గదా!

399. ఓ మహేశ్వరీ! నిన్ను మేము స్మరించినపుడెల్ల మా ఆపదలను తొలగింపుము.

400. ప్రసన్నమగు ముఖముకల ఓ దేవీ! ఏ మానవుడు ఈ స్తోత్రములచే నిన్ను స్తుతించునో, వానికి నీవు ఎల్లపుడు జ్ఞానమును, గోధనమును, సర్వసమృద్ధిని, ధనము, భార్య ఇత్యాది సంపదలను అభివృద్ధి పరిచి అనుగ్రహించ వలెను.

ఓ జగన్మాతా! నీవు ఎల్లపుడు మాయందు అనుగ్రహము కలిగి యుండవలెను.

402. మనస్సునకు ఉల్లాసము కలిగించు విస్తారమైన సంపదను ఇమ్ము. దేవతలకు కూడ నియంత్రితవగు ఓ తల్లీ! ఇంతియే చాలును. నీవు మాకు పూర్వమే వరమిచ్చియుంటివి. మా మాటను మన్నించి, నీవు ముల్లోకముల క్షేమము కోరి రాక్షస గణములను వధించి, దేవతలకు హితము చేసితివి.

ఋషిపల్కెను.

403. ఈ విధముగా దేవతలు తమకొరకు, జగత్తు కొరకు దేవిని ప్రార్థించిరి. ఓ రాజా! ఆ భద్రకాళి వారి ప్రార్థనలనంగీకరించి, అంతర్ధానము చెందెను.

404. ఓ రాజా! పూర్వము దేవి ముల్లోకముల హితము చేయ గోరి, దేవతల శరీరముల నుండి ఎట్లు ఉద్భవించెనో, నేను వివరించితిని.

405. ఆ దేవి ఏ విధముగా గౌరీ దేహము నుండి ఉద్భవించి, కౌశికి యను పేరుతో, దుష్ట రాక్షసులగు చండముండాదులను, శుంభనిశుంభులను వధించి, దేవతలకు ఉపకారము చేసి, లోకములను రక్షించెనో, ఆ విధమును నేను జరిగినది జరిగినట్లుగా చెప్పెదను వినుము.

ఇది శ్రీమార్కండేయ మహా పురాణమందు సావర్ణిక మన్వంతర గాథలో దేవీ మాహాత్మ్యము నందు 'మహిషాసురవధ' యని ప్రసిద్ధి గాంచిన, మూల్మంత్ర మంత్రవిభాగ రూపమగు నవశతీ మంత్రమాల యందలి తృతీయాధ్యాయము సమాప్తమయ్యెను.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః
# చతుర్థాధ్యాయము
## ఓం నమశ్చండికాయై

ఋషి పలికెను.

406. ఓ రాజశ్రేష్ఠా! కశ్యపునకు ధనువు అను భార్య ఉండెను.

407. ఆమెకు ఇంద్రుని కంటె ఎక్కువ బలము గల ముగ్గురు కుమారులు జన్మించిరి.

408. జ్యేష్ఠుడు 'శుంభుడు' అని ప్రసిద్ధి చెందెను. రెండవ రాక్షసుడు నిశుంభుడు. నముచియను మూడవ వాడు గొప్ప బలము, పరాక్రమము గలవాడు.

409. వారిలో శుంభ నిశుంభులు దేవతల నేడించుటకై యౌవనము రాకమునుపే గొప్ప తపస్సు చేసిరి.

410. వారు లోక పావనమగు పుష్కరక్షేత్రమునందు పదివేల సంవత్సరములు ఆహారము లేకుండగా, మనస్సును నియమించి, దేవతలకు ఆశ్చర్యము గొలిపే గొప్ప, దివ్యమగు తపస్సు చేసిరి.

411. అపుడు ముల్లోకములకు పితామహుడు, భగవానుడు అగు బ్రహ్మ ప్రసన్నుడై వారు కోరిన సర్వోత్తమములగు కోర్కెలను వారిద్దరికి ఇచ్చెను.

412. "ఓ ప్రభూ! మేము దేవతలచే, సిద్ధులచే, గంధర్వులచే, కిన్నరులచే, మానవులచే సంహరింపబడ కూడదు. మావధ ఏపురుషులచేత సాధ్యపడకుండుగాక!

413. అని వారు కోరగా, బ్రహ్మ "అటులనే అగుగాక" అని పలికెను.

414. ఇట్లు బ్రహ్మ వలన వరములను పొంది దేవతలను హింసింపజొచ్చిరి.

415. తరువాత శుంభాసుర, నిశుంభాసురులకు, ఇంద్రునకు, పూర్వము మహిషునకు, ఇంద్రునకు జరిగిన రీతిని, మహా భయంకరమగు యుద్ధము జరిగెను. వారిద్దరు సమస్త దేవతలను నిర్జించి, దేవతల నివాసమగు స్వర్గమును చేజిక్కించు కొని, బలముతో గర్వించిన వారై, ఇంద్రుని త్రిలోకాధిపత్యమును దేవతల యజ్ఞభాగములను అపహరించిరి.

416. వారిద్దరే సూర్యుడు, చంద్రుడు, కుబేరుడు, యముడు, వరుణుడు వీరి యొక్క అధికారములను నిర్వహింప జొచ్చిరి.

417. వారిద్దరే స్వయముగా వాయువు యొక్క, అగ్నియొక్క అధికారములను గూడ నిర్వహించిరి. అపుడు దేవతలు తమ తమ పదవుల నుండి తొలగింపబడిన వారై, రాజ్యభ్రష్టులై, పరాజితులై ఉండిరి.

418. ఓ రాజా! ఆయా అధికారములందు, ఆయాలోకములందు తమ వారైన ప్రఖ్యాతులగు రాక్షసులనే నియమించిరి.

419. ఆ శుంభ నిశుంభులను మహాసురులచే అపహరింప బడిన అధికారములుగల దేవతలందరు స్వర్గము నుండి తరుమ బడిన వారై, రాక్షసులను జయించు శీలముగల ఆ దేవిని స్మరించిరి.

420. 'మీచే ఆపదలయందు స్మరింప బడిన వెంటనే మీయొక్క మహా విపత్తులనన్నిటిని నశింపజేయ గలను' అని ఆమె మనకు వరమిచ్చినది

421. ఇట్లు తలచి, దేవతలు పర్వత శ్రేష్ఠమగు హిమవత్పర్వతమునకు వెళ్లిరి తరువాత అచ్చట విష్ణుమాయ యగు మహా దేవిని స్తుతించిరి.

"అపరాజితా సూక్తమ్"

దేవతలు పలికిరి.

422. దేవికొరకు నమస్కారములు.

విశేషాంశము: ఇంద్రాది దేవతలలో ఏ శక్తి గలదో, అది దేవీ స్వరూపమే. అట్టి దేవి కొరకు నమస్కారము అని భావము.

423. మహా దేవి కొరకు నమస్కారములు.

విశేషము: మహాదేవులనగా బ్రహ్మ విష్ణు మహేశులు. వారిలోని శక్తియు దేవియే. అట్టి దేవికొరకు నమస్కారము అని భావము.

424. మంగళస్వరూపురాలగు దేవి కొరకు ఎల్లపుడు నమస్కారములు.

425 మూలప్రకృతియగు దేవికొరకు నమస్కారములు.

426. మంగళముల నిచ్చు ఆ దేవిని నియమవంతులమగు మేము నమస్కరించు చున్నాము.

427. ఉగ్రమైన ఆకృతిగల దేవి కొరకు నమస్కారములు.

428. నిత్యయగు దేవి కొరకు నమస్కారములు.

విశేషము: 'నిత్యా' యనగా జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, పరిక్షీయతే, నశ్యతి అను ఆరు భావవికారములు లేనిదియని అర్థము.

429. గౌరి కొరకు నమస్కారములు.

విశేషము: గౌరియనగా శ్వేతవర్ణ, లేక పీతవర్ణ లేక అరుణవర్ణ యని అర్థము.

430. ధాత్రి కొరకు నమస్కారములు.

విశేషము: ధాత్రి యనగా పోషించు తల్లి లేక పృథివి యని అర్థము.

431. వెన్నెల రూపము గల దేవి కొరకు నమస్కారములు.

432. చంద్ర రూపిణి యగు దేవి కొరకు నమస్కారములు.

433. సుఖముల నిచ్చు దేవి కొరకు (సుఖస్వరూపురాలగు దేవి కొరకు) ఎల్లప్పుడు నమస్కారములు:

434. జగత్కల్యాణమును చేయు దేవి కొరకు మేము నమస్కరించుచున్నాము.

435. అభివృద్ధి రూపురాలగు దేవి కొరకు నమస్కారములు.

436. సిద్ధి కొరకు నమస్కారము.

**విశేషము:** సిద్ధియనగా కర్మ ఫలము లేక అణిమాద్యష్టైశ్వర్యములు. అవియేవన, అణిమా లఘిమా ప్రాప్తిః ప్రాకామ్యం మహిమా తథా|
ఈశిత్వం చ వశిత్వం చ తథా కామావసాయితా||
అనగా, సూక్ష్మ పరిమాణము పొందు శక్తి, తేలికగా అగు శక్తి, కోరిన వస్తువును పొందే శక్తి, అప్రతిహతమగు ఇచ్ఛా శక్తి, స్వేచ్ఛగా పరిమాణమును పెంచు శక్తి, సర్వాధిక్యము, ఇతరులను వశము చేసుకొను శక్తి, కోర్కెలను నియమించు శక్తి అనునవి అష్టసిద్ధులు.

437. కూర్మరూపుడగు విష్ణువు యొక్క శక్తి యగు దేవి కొరకు నమస్కారములు.

**విశేషాంశము:** విష్ణువు కూర్మ రూపమున భూమిని ధరించెను. ఆ సామర్థ్యము దేవీ రూపమే. కూర్మి యనగా పృథివియందు అనేక రూపములుగా అవతరించునది అని యర్థము కూడ గలదు.

438. నిర్రృతి దేవత యొక్క శక్తియగు దేవి కొరకు నమస్కారములు.

**విశేషాంశము:** నైరృతి యనగా అలక్ష్మి అని కూడ అర్థము కలదు.

439. రాజుల యొక్క రాజ్యలక్ష్మి యగు దేవి కొరకు నమస్కారము.

**విశేషాంశము:** పర్వతముల శోభ, సంపద దేవీ స్వరూపమే యని కూడ చెప్పవచ్చును.

440. శర్వాణియగు నీ కొరకు నమస్కారములు.

**విశేషాంశములు:** శర్వుని పత్ని శర్వాణి. శర్వుడనగా
"చరాచరాణాం భూతానాం ధాతా విశ్వంభరాత్మకః|
శర్వ ఇత్యుచ్యతే దేవైస్సర్వశాస్త్రార్థ కోవిదైః||
(లింగపురాణము). సమస్త చరాచర జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు హేతువగు పరమశివుడు శర్వుడనబడును.

441. దుర్గ కొరకు నమస్కారము.

**విశేషాంశము:** దేవీ తత్త్వము తెలియుట దుస్సాధ్యము గనుక ఆమె దుర్గ.

442. సంకటమునందు రక్షించు దేవికి నమస్కారము.

443. సర్వశ్రేష్ఠురాలగు దేవికి నమస్కారము.

444. జగత్తు యొక్క సృష్టిస్థితిలయములనన్నిటిని చేయు దేవి కొరకు నమస్కారము.

445. జ్ఞానస్వరూపు రాలగు దేవి కొరకు నమస్కారము.

446. కృష్ణ వర్ణము గల దేవి కొరకు నమస్కారము.

**విశేషాంశము:** కృష్ణ వర్ణము తమోగుణమునకు చిహ్నము కాదు. అనంతత్వమునకు గుర్తు. రాముడు, కృష్ణుడు నీలమేఘశ్యాములే. సముద్రము నీలము. ఆకాశము నీలము.

447. ధూమ్ర వర్ణము గల దేవికి ఎల్లప్పుడు నమస్కారము.

448. అతిశాన్త స్వరూపిణి, అతి భయంకర స్వరూపిణి యగు దేవి కొరకు నమస్కారములు.

**విశేషాంశము:** మొదటి రూపము భక్తుల కొరకు. రెండవది శత్రువుల కొరకు.

449. జగత్ప్రతిష్ఠ యగు దేవి కొరకు నమస్కారము.

**విశేషాంశములు:** మిథ్యా భూతము, ఆరోప్యమాణమునగు జగత్తునకు అధిష్ఠానము దేవియే. 'మిథ్యా జగదధిష్ఠానా' అని లలితా సహస్రనామము. కాన ఆమె 'జగత్ప్రతిష్ఠా' అనబడును. లేదా, ధర్మము జగదాధారము. 'ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా' అని శ్రుతి. అట్టి ధర్మ స్వరూపురాలగు దేవి కొరకు నమస్కారము.

450. ప్రకాశ స్వరూపురాలగు చండికకు నమస్కారము.

451. క్రియా స్వరూపురాలగు దేవి కొరకు నమస్కారములు.

452. ఏ దేవి సర్వభూతములందు విష్ణు మాయా రూపమున నున్నదని చెప్పబడు చున్నదో, ఆమె కొరకు అనేక నమస్కారములు.

453. ఏ దేవి సర్వప్రాణులందు చైతన్య(ప్రాణ)రూపముననున్నదో, ఆమె కొరకు అనేక నమస్కారములు.

454. ఏ దేవి సర్వప్రాణులందు బుద్ధి రూపముననున్నదో, ఆమె కొరకు అనేక నమస్కారములు.

455. ఏ దేవి సర్వప్రాణులందు నిద్రారూపమున నున్నదో, ఆమె కొరకు అనేక నమస్కారములు.

విశేషాంశములు: నిద్రించుట యనగా పురుషుడు స్వస్వరూపమును పొందుటయని ఛాందోగ్యోపనిషత్తు వర్ణించెను. "యత్రైతత్పురుషస్స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి". దీనిపై శంకరభాష్యము - "యదా స్వపితీత్యుచ్యతే పురుషస్తదా తస్మిన్కాలే సతా సచ్ఛబ్ద వాచ్యయా ప్రకృతయా దేవతయా సంపన్నో భవతి. సంగత ఏకీభూతో భవతి". పురుషుడు నిద్రించుచున్నాడనగా, 'సత్' అనబడు దేవతతో ఏకీభావమును పొందు చున్నాడు అని అర్థము. మరియు, నిద్ర యొక్క మహిమ ఇట్లు వర్ణింపబడెను. "స యథా శకునిస్సూత్రేణ ప్రబద్ధో దిశం దిశం పతిత్వా అన్యత్రాఽయతన మలబ్ధ్వా బంధనమేవోపశ్రయత ఏవమేవ ఖలు సోమ్య తన్మనో దిశం దిశం పతిత్వా అన్యత్రాఽయతనమలబ్ధ్వా ప్రాణమేవోపశ్రయతే". అనగా పక్షి త్రాటితో బంధమునకు కట్టబడినదై, అన్ని వైపుల తిరిగి తిరిగి విశ్రాన్తి పొంద జాలక, బంధమునే ఆశ్రయించి విశ్రమించును. అటులనే పురుషుడు జాగ్రత్స్వప్నావస్థ లయందు సుఖదుఃఖాత్మకమగు సంసారము నందు పరిభ్రమించి విశ్రమణ స్థానమును పొందజాలక, నిద్రయందు 'సత్' అన బడు పరదేవతనే ఆశ్రయించి, విశ్రాన్తిని పొందును. నిద్ర దేవీ రూపమే అనుటలోని రహస్యమిది.

456. ఏ దేవి సమస్త ప్రాణులందు ఆకలి రూపమున నుండునో, ఆమె కొరకు అనేక నమస్కారములు.

విశేషాంశములు: ప్రాణుల కుక్షిలోని జాఠరాగ్ని ఆ పరబ్రహ్మ స్వరూపమే యని ఛాందోగ్యోపనిషత్తు వర్ణించెను. "అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు లోకేష్విదం వావ తద్యదిదమస్మి న్నంతః పురుషే జ్యోతిః" 'అంతరిక్షము కంటె పైన సమస్తమగు సత్యలోకాది ఉత్తమలోకములందు ఏ జ్యోతి ప్రకాశించు చున్నదో, అదియే పురుషుని కుక్షియందు జాఠరాగ్ని రూపముగ ప్రకాశించు చున్నది'. ఆ జ్యోతి దేవీ రూపమే.

457. ఏదేవి సమస్త ప్రాణులందు ఛాయారూపమున నున్నదో, ఆమె కొరకు అనేక నమస్కారములు.

**విశేషాంశములు:** 'ఛాయా' అనగా ప్రతిబింబము. అంతఃకరణమునందు పరబ్రహ్మ యొక్క ప్రతిబింబమే జీవుడు. ఛాందోగ్యోపనిషద్భాష్యములో శ్రీ శంకరులిట్లు చెప్పిరి. "జీవో హి నామ దేవతాయా ఆభాసమాత్రమ్| బుద్ధ్యాదిభూత మాత్రాసంసర్గ జనిత ఆదర్శ ఇవ ప్రవిష్టః పురుషప్రతిబింబో జలాదిష్వివ చ సూర్యాదీనామ్| ఛాయా మాత్రేణ జీవరూపేణానుప్రవిష్టత్వాద్దేవ తా న దైహికైః స్వతస్సుఖదుఃఖాదిభిః సంబధ్యతే|| జీవుడనగా దేవతయొక్క ప్రతిబింబము మాత్రమే. అద్దములో పురుషుని ప్రతిబింబమువలె, నీటియందు సూర్యుని ప్రతిబింబమువలె, బుద్ధి మొదలుగాగల పాంచభౌతిక సంఘాతముతో సంసర్గము వలన ఏర్పడిన సదాభ్య దేవత యొక్క ఛాయయే జీవుడు. దేవతకు జీవదేహగతమైన సుఖదుఃఖాదులతో సంపర్కముండదు. ఏలయన దేవత ఛాయామాత్ర జీవరూపముగా దేహమునందు ప్రవేశించెను. సూర్యునకు జలమందలి మాలిన్యాది దోష సంపర్కము లేదు.

458. ఏదేవి సమస్త ప్రాణులందు శక్తిరూపమున నున్నదో, ఆమెకొరకు అనేక నమస్కారములు.

**విశేషాంశములు:** ఈ విషయమునే లింగ పురాణ మిట్లు చెప్పెను. "యస్య యస్య పదార్థస్య యా యా శక్తి రుదాహృతా! సా సా విశ్వేశ్వరీ దేవీ". ఈ సృష్టిలోని సమస్త పదార్థములయందు, పరమాణువు మొదలు గ్రహముల వరకు, ఏ స్థితిగతి శక్తులు గలవో, ఆ శక్తులు దేవీరూపమే.

459. ఏదేవి సమస్త ప్రాణులయందు తృష్ణా రూపమున నున్నదో, ఆమెకొర అనేక నమస్కారములు.

**విశేషాంశములు:** రజోగుణ కార్యమగు తృష్ణ కొందరు జీవు అధికముగా నుండును. వారే ఇహలోకమందలి జీవన ప్రమాణాభివృ ఆధారమగు చుందురు. వారి యందలి తృష్ణ దేవీరూపమే.

460. ఏదేవి సర్వప్రాణులయందు క్షమారూపమున నున్నదో, ఆమెకొరకు అ నమస్కారములు.

**విశేషాంశములు:** ఎదుటివాడు అపకారము చేసినపుడు తిరిగి ప్రతీకారము చేయు సామర్థ్యమున్నను సహించుట క్షమయనబడును. ఈ క్షమ యొక్క మహిమ రామాయణమునందిట్లు వర్ణింపబడెను.

"క్షమా దానం క్షమా సత్యం క్షమా యజ్ఞాశ్చ పుత్రికాః|
క్షమా యశః క్షమా ధర్మః క్షమయా విష్ఠితం జగత్"||
(బాలకాండ, 33 సర్గ)

461. ఏదేవి సర్వ ప్రాణులయందు జాతిరూపమున నున్నదో, ఆమెకొరకు అనేక నమస్కారములు.

విశేషాంశములు: వ్యక్తులు భిన్నమైనను జాతి ఏకరూపముగ నుండును. ఉదాహరణకు, గోవులు వేరైనను గోత్వజాతి సమానమే. అట్టి జాతి దేవీరూపమే.

462. ఏదేవి సర్వప్రాణులయందు లజ్జారూపమున నున్నదో, ఆ దేవి కొరకు అనేక నమస్కారములు.

విశేషము: 345 మంత్రవ్యాఖ్యానము గమనింపుడు.

463. ఏదేవి సమస్త ప్రాణులయందు దమరూపముననున్నదో, ఆదేవి కొరకు, అనేక నమస్కారములు.

విశేషాంశములు: దమము అనగా ఇంద్రియ నిగ్రహము. మహాభారత శాన్తి పర్వములో భీష్మపితామహుడు దమము యొక్క మాహాత్మ్యము నిట్లు వర్ణించెను. "దమో దానం తథా యజ్ఞా అధీతం చాపి వర్తతే|
దమేన సదృశం ధర్మం నాన్యం లోకేషు శుశ్రుమ||

దమము యొక్క స్వరూపమేమి? భీష్ముడిట్లు చెప్పెను.

"క్షమా ధృతిరహింసా చ సమతా సత్యమార్జవమ్|
ఇంద్రియాణాం జయో దాక్ష్యం మార్దవం హ్రీరచాపలమ్||

అకార్పణ్య మసంరంభస్సంతోషః ప్రియవాదితా|
అవిహింసాZనసూయా చ యేషాం సముదయో దమః"||

464. ఏదేవి సమస్త ప్రాణులయందు శాన్తి రూపమున నున్నదో, ఆదేవి కొరకు అనేక నమస్కారములు.

465. ఏదేవి సమస్త ప్రాణులయందు శ్రద్ధారూపమున నున్నదో, ఆదేవి కొరకు అనేక నమస్కారములు.

466. ఏదేవి సమస్త ప్రాణులయందు కాన్తి రూపమున (అనగా శోభ లేక ఇచ్ఛ) నున్నదో, ఆ దేవి కొరకు అనేక నమస్కారములు.

467. ఏదేవి సమస్త ప్రాణులయందు లక్ష్మీ (శోభ లేక సంపద) రూపమున నున్నదో, ఆ దేవి కొరకు అనేక నమస్కారములు.

468. ఏదేవి సమస్త ప్రాణులయందు "ధృతి" రూపమున నున్నదో, ఆదేవి కొరకు అనేక నమస్కారములు.

విశేషాంశములు: 'ధృతి' అను పదమును శ్రీ మచ్ఛంకరాచార్యులు గీతా భాష్యములో నిట్లు వ్యాఖ్యానించిరి. "ధృతిర్దేహేంద్రియా దిష్వవసాదం ప్రాప్తేము తస్యే ప్రతిషేధకః అంతఃకరణ వృత్తి విశేషః, యేనోత్తంభితాని కరణాని దేహశ్చ నావసీదన్తి". దేహేంద్రియ మనోబుద్ధులకు శైథిల్యము ప్రాప్తించుచుండగా, వాటికి నిశ్చలత్వమును పెంపొందించెడి శక్తి ధృతి యనబడును. ధృతి ప్రభావముచే దేహేంద్రియాదుల శైథిల్యము నివారింపబడును.

469. ఏదేవి సమస్త ప్రాణులయందు వృత్తి రూపమున నున్నదో, ఆదేవి కొరకు అనేక నమస్కారములు.

**విశేషాంశములు:** వృత్తి యనగా జీవిక కొరకు చేయు క్రియ లేదా మనోవ్యాపారము.

470. ఏదేవి సమస్త ప్రాణులయందు స్మృతి రూపమున నున్నదో, ఆదేవి కొరకు అనేక నమస్కారములు.

471. ఏదేవి సమస్త ప్రాణులయందు దయా రూపమున నున్నదో, ఆదేవి కొరకు అనేక నమస్కారములు.

**విశేషాంశములు:** గీతా చార్యులు భూత దయను దైవీ సంపదలో లెక్కించిరి. దయ ఒక దివ్యగుణము. మేఘరూప దేవత 'దదద' అని గర్జించుచూ, మానవులు దమము, దానము, దయలను నేర్వవలెనని ఆదేశించుచున్నదని బృహదారణ్యకోపనిషత్తు వర్ణించెను. "ఏషా దైవీ వాగనువదతి స్తనయిత్నుర్దదద ఇతి దామ్యత దత్త దయధ్వమితి తదేతత్త్రయం శిక్షేద్దమం దానం దయామితి." శ్రీ శంకరులు పరమాత్మను "భూత దయాం విస్తారయ తారయ సంసార సాగరతః" అని స్తుతించిరి. అట్టి దయ దేవీ స్వరూపమే.

472. ఏ దేవి సమస్త ప్రాణులయందు తుష్టి రూపమున నున్నదో, ఆ దేవి కొరకు అనేక నమస్కారములు.

473. ఏ దేవి సమస్త ప్రాణులయందు మాతృ రూపమున నున్నదో, ఆ దేవి కొరకు అనేక నమస్కారములు.

**విశేషాంశములు:** తల్లిదండ్రులలో తల్లికి విశిష్టత గలదు. 'మాతా పుత్రస్య భూయాంసి కర్మాణ్యారభతే'. పుత్రుని అభివృద్ధిలో తల్లి పాత్ర అద్వితీయము. 'పితుశ్శతగుణం మాతా' అని పెద్దలు చెప్పుదురు. ఉపనిషత్తులో కూడ ముందుగా 'మాతృదేవో భవ' అని ఆదేశము ప్రారంభమగును. మాతా అనగా మాతృకాక్షరరూప అని కూడ అర్థము చెప్పవచ్చును. "మంత్రాణాం జననీ రూపా మాతృకాపరమేశ్వరీ" (స్కాందపురాణము).

474. ఏ దేవి సమస్త ప్రాణులయందు భ్రాన్తి రూపమున నున్నదో, ఆ దేవి కొరకు అనేక నమస్కారములు.

**విశేషాంశములు:** జీవులలో జ్ఞానరూపిణియై ప్రకాశించు దేవి భ్రాన్తి రూపిణి ఎట్లగును? అను శంక ఉదయించును.

దేవి ప్రకాశస్వరూపురాలు. భ్రాన్తికి కూడ ప్రకాశమే ఆధారము. దట్టమైన చీకటిలో త్రాడును చూచి పాము అని భ్రాంతి చెందుట జరుగదు. ఎందు చేతననగా, త్రాడే కనబడదు గనుక. పూర్తి వెల్తురులోకూడ భ్రాన్తి లేదు. కాని మందాంధకారములో త్రాడును చూచి పాము అనుకొనుట జరుగును. కనుక, భ్రాన్తి కూడ చిత్త వృత్తియే గనుక ప్రకాశాధీనము. సర్వప్రకాశము దేవీ స్వరూపమే. కనుకనే ఆమె జీవుల యందు అనాది నుండి భ్రాన్తి రూపమున

నున్నది. భ్రాన్తినే శ్రీ మచ్ఛంకరా చార్యులు 'అధ్యాస' అని వర్ణించిరి. శ్రుతియు ఇట్లు చెప్పుచున్నది. "సత్యం చానృతం చ సత్యమభవత్". అన గా పరబ్రహ్మయే వ్యావహారిక సత్యముగను, భ్రాన్తి రూపము గను కూడ అయెను.

475. ఇంద్రియములకు, పంచ భూతములకు అధిష్ఠానదేవతా స్వరూపురాలైనట్టియు, సమస్త ప్రాణులయందు అంతర్యామిరూపమున నున్నట్టియు, సర్వవ్యాపిని యగు ఆ దేవి కొరకు అనేక నమస్కారములు.

విశేషాంశములు: ఇంద్రియములకు, పంచభూతములకు అధిష్ఠాన దేవత లెవరనగా 'దిశః శ్రోత్రస్య వాతస్తు త్వచస్సూర్యస్తు చక్షుషః| వరుణో రసనస్యా స్యా దశ్వినౌ ఘ్రాణ దేవతే|| మనసశ్చంద్రమా వాచేzగ్నిరుపస్థస్య వాసవః| పాయోరుపేంద్రో కరయోర్మిత్రో బ్రహ్మా చ పాదయోః| బ్రహ్మా భూమేరపాం విష్ణుస్తేజసోర్రుద్ర ఏవచ| మరుతో దేవతేశానో నభసశ్చ సదా శివః||' ఈ అధిష్ఠాన దేవతలందరు దేవీ రూపమే. వీరిలో రుద్రుడు త్రిమూర్తులలో నొకడు, సంహారకర్త. ఈశానుడు త్రిమూర్తులను నియమించు వాడు. సదాశివుడు శుద్ధచిద్రూపుడు, నిర్గుణుడు.

476. ఏదేవి జ్ఞాన రూపిణియై ఈ సమస్త జగత్తును వ్యాపించియున్నదో, ఆమెకొరకు, అనేక నమస్కారములు.

477. ఏ దేవి పూర్వము (మహిషాసుర వధానంతరము) అభీష్టసిద్ధిని పొందిన దేవతలచే స్తుతింప బడెనో, ఇంద్రునిచే ప్రతి దినము సేవింప బడునో, శుభములు నిచ్చు ఆ పరమేశ్వరి మాకు మంగళములను, సుఖమ్ములను ఇచ్చుగాక! ఆపదలను నశింపజేయుగాక!

478. మదించిన రాక్షసులచే పీడింపబడుచున్న దేవతలమగు మేము ఇపుడా పర మేశ్వరిని నమస్కరించుచున్నాము. భక్తితో వినమ్రమైన దేహములు గలవా రమై ఆమెను స్మరించినంతనే, మా సర్వాపదలను తొలగించును. ఆమె మాకు మంగళములను, సుఖములను ఇచ్చుగాక!

విశేషాంశములు: స్మరించిన వారికష్టముల నా దేవి తొలగించునని కూర్మపురాణములో దేవీ వాక్యమే స్పష్టము చేయుచున్నది. 'యేతు సర్వాన్ పరిత్యజ్య మా మేకం శరణం గతాః| తేషాం నిత్యాభియుక్తానామాపదాం పర్వతాన్నపి నాశయామి తరాం సర్వాన్||' ఎవరు సర్వము విడచి నన్నే శరణు వేడెదరో వారి ఆపదలను, పర్వతము వలె పెద్ద వైనను, నేను సమూలముగా తొలగించెదను.

479. ఓరాజపుత్రా! దేవతలచట ఈ విధముగా స్తోత్రములు, నమస్కారములు చేయుచుండ, పార్వతి గంగా నదిలో స్నానము కొరకు బయలుదేరెను.

480. పూర్వము పరమశివుని ప్రియురాలగు పార్వతి బ్రహ్మయొక్క సృష్టి చాతు ర్యము మూర్తీభవించినట్లుండెను. ఆమె సమస్తప్రాణుల క్షేమమును కాంక్షించును.

481. శివుడా జగన్మాతను పరిహాసముగా 'కాళి' (నల్లనిది) అని పిలువగా, ఆమె గొప్ప తపస్సు చేసి, గౌరవర్ణము గల దివ్య దేహమును పొందెను.

482. ఆమె యొక్క కృష్ణవర్ణము గల శరీరకోశము నుండి 'శివా' అనియు, కౌశికీ యనియు ప్రసిద్ధి గాంచిన, కృష్ణవర్ణము గల అతి సుందరి యగు యువతి ఆవిర్భవించెను.

483. ఆమె కుమార్తె వలె జగన్మాతను సేవించుచూ, ఆమె వద్దనే నివసించెను.

484. సుందరియగు ఆ పార్వతి దేవతలతో నిట్లు పల్కెను- "మీరిచట ఎవరిని స్తుతించుచున్నారు?" పార్వతి యొక్క శరీర కోశము నుండి ఉద్భవించిన 'శివా' అను నామె ఇట్లు పలికెను.

**విశేషము:** గంగా స్నానమునకు వెళ్ల బోవుచూ, పార్వతి దేవతలను ప్రశ్నించెను. దేవతలీయ దగిన ప్రత్యుత్తరమును 'శివా' యను ఆమె ఇచ్చెను.

485. శుంభుడనే రాక్షసునిచే తరుమ బడి నట్టియు, యుద్ధములో నిశుంభునిచే ఓడింప బడిన దేవతలందరు నన్నే ఇట్లు స్తుతించుచున్నారు.

486. 'శుంభుడు మొదలుగా గల రాక్షసులను సంహరించి, ఇంద్రునికి ప్రీతిని కలిగించ గలను'. అను ఆమె మాటను విని, గౌరి అప్పుడు ఆ సుందరితో ఇట్లు పలికెను.

487. నీవు భారత సమీపము నందున్న హిమవత్పర్వతము యొక్క దక్షిణశిఖరమునకు వెళ్ళి, తొందరగా దేవతల కార్యము నిర్వర్తించి, తరువాత నా సమీపమునకు రమ్ము.

**ఋషి పలికెను.**

488. గౌరీ దేవి దేవతల హితము కొరకు కౌశికిని ఈ విధముగా ఆజ్ఞాపించి, ఆమెను ఆ కార్యమునందు నియోగించి, స్నానము చేయుటకు వెళ్లెను.

489. తరువాత గౌరీదేవి స్నానము చేసి, శ్వేత వస్త్రమును ధరించి, తన ప్రాసాదమును చేరెను.

490. ఈ అంబిక (శివా) ఆ పార్వతి యొక్క శరీరకోశము నుండి ఉద్భవించినది గనుక, సమస్తలోకముల యందు ఆమె 'కౌశికి'యని కీర్తింపబడుచున్నది.

491. గౌరి నిర్గమించెను. ఆ కౌశికియు కృష్ణ వర్ణము గలది గాన కాళిక యని ప్రసిద్ధి గాంచెను. ఆమె హిమవత్పర్వతమునందు నివసించెను.

**విశేషాంశము:** ఈ మంత్రములో పార్వతీ శబ్దముచే, కార్యకారణములకు అభేదము గనుక, పార్వతి నుండి ఉద్భవించిన కౌశికి చెప్పబడును.

492. తరువాత మనస్సును హరించే అతి సుందర రూపమును కలిగి యున్న ఆ అంబికను, శుంభనిశుంభుల యొక్క భృత్యులగు చండుడు, ముండుడు చూచిరి.

493. వారిద్దరు శుంభునితో నిట్లు చెప్పిరి. 'మనస్సును హరించు గొప్ప సౌందర్యము గల ఒక స్త్రీ హిమవత్పర్వతమునే ప్రకాశింప జేయుచూ ఉన్నది'.

494. ఓ రాక్షస రాజా! అట్టి ఉత్తమమగు రూపమును ఎవ్వరైనను, ఎక్కడను చూసి ఉండరు. ఆమె ఎవరో దేవతాస్త్రీ కావలెను. ఆమె ఎవరో తెలుసు కొని నీవు స్వీకరింపుము.

495. ఓ రాక్షసరాజా! ఆమె స్త్రీలలో కెల్ల గొప్పది. అతిసుందరమగు అవయవములు కలది. ఆమె తన దేహకాంతితో దిక్కులను ప్రకాశింప జేయుచున్నది. ఆమెను నీవు చూడదగుదువు.

496. ఓ ప్రభూ! ముల్లోకములలోని అన్ని రకముల శ్రేష్ఠ వస్తువులు, మణులు, ఏనుగులు, గుర్రములు మొదలైనవి ఇపుడు నీ గృహము నందు ప్రకాశించుచున్నవి.

497. గజశ్రేష్ఠమగు ఐరావతమును, ఈ పారిజాత వృక్షమును, ఉచ్చైశ్శ్రావస్సు అను గుర్రమును ఇంద్రుని వద్దనుండి లాగుకొని, తీసుకొని వచ్చితివి.

498. హంసలతో కూడిన అతిశ్రేష్ఠమగు ఈ విమానము నీ వాకిట నున్నది. ఒకప్పుడు ఈ అద్భుతమగు విమానము బ్రహ్మ వద్ద నుండెడిది. దానిని నీవే ఇచటకు తెచ్చితివి.

499. మహాపద్మమను ఈ నిధిని కుబేరుని వద్ద నుండి తీసుకు వచ్చితివి.

500. సముద్రాధిష్ఠాన దేవత ఎల్లప్పుడు వికసించి ఉండే పద్మములు గల, కేసరములతో నిండిన మాలను ఇచ్చెను.

501. బంగరు ద్రవ బిందువులను స్రవించు వరుణుని ఛత్రము నీ గృహమునందున్నది.

502. ఈ గొప్ప రథము పూర్వము ప్రజాపతి వద్ద నుండెడిది. ఇపుడు నీ వద్ద నున్నది.

503. ఓ ప్రభూ! మృత్యువునుండి 'ఉత్క్రాన్తిద' అను శక్తి నీచే లాగు కొనబడెను.
విశేషాంశము: ఉత్క్రాన్తిని అనగా మరణమును ఇచ్చునది గాన 'ఉత్క్రాన్తిద' అనబడును.

504. వరుణుని పాశము నీ సోదరుని అధీనమందున్నది.

505. సముద్రమునందు పుట్టిన అన్ని జాతుల రత్నములు నిశుంభుని అధీనమందున్నవి.

506. అగ్నియు నీకు బంగరు దారములచే నిర్మింప బడిన రెండు వస్త్రములను ఇచ్చెను.

507. ఓ రాక్షస రాజా! ఈ విధముగా నీవు సమస్త శ్రేష్ఠ వస్తువులను తీసుకొని వచ్చితివి. ఈమె స్త్రీలలో శ్రేష్ఠురాలు. శుభలక్షణములు గలది. ఆమెను నీవేల

నీ దానినిగా చేసుకొనవు?

ఋషి పలికెను.

508. అపుడా శుంభుడు చండ ముండుల ఈ మాటలను విని సుగ్రీవుడను మహాసురుని దేవి వద్దకు దూతగా పంపెను.

శుంభుడు పలికెను.

509. నీవు అమె వద్దకు వెళ్లి నా మాటగా ఈ యీ విషయములు చెప్పుము. అమె నావద్దకు ప్రీతితో వచ్చు విధముగా నీవు కార్యమును శీఘ్రముగా సాధింపుము.

ఋషిపలికెను.

510. రాజనీతి విశారదుడగు సుగ్రీవుడను దూత రాజు మాటను విని 'సరే'యని పలికి, కొద్ది పాటి సైన్యముతో గూడి బయలుదేరెను.

511. ఆ దేవి అతి సుందరమగు హిమవత్పర్వత ప్రాంతము నందుండెను. సుగ్రీవుడచటకు వెళ్లి, మధురమగు వాక్కులతో మృదువుగా ఆమెతో నిట్లు పలికెను.

512. ఓ దేవీ! ముల్లోకములకు ఏకచ్ఛత్రాధిపతియగు రాక్షసరాజు శుంభుడు నన్ను నీ వద్దకు దూతగా పంపగా, నేనిచటకు నీ వద్దకు వచ్చితిని.

513. సమస్త దేవజాతులయందు సర్వదా అతని అజ్ఞకు ఎదురు లేదు. రాక్షస శత్రువుల నందరిని అతడు జయించెను. అతడు చెప్పిన సందేశమును నీవు వినుము.

విశేషాంశము: దేవజాతులనగా దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుష విద్యాధరాదులు.

514. ముల్లోకములు నావే. దేవతలు నా చెప్పు చేతలలోని వారే. నేను యజ్ఞ భాగముల నన్నిటిని వేర్వేరుగా భుజింతును.

విశేషాంశము: వరుణుడు, ఇంద్రుడు, అగ్ని మొదలగు దేవతలందరి యజ్ఞభాగములను శుంభుడే ఆయా స్థానములలో నుండి స్వీకరించెడి వాడ అని పృథక్ పృథక్ అను పదద్వయమున కర్థము.

515. ముల్లోకములందలి అతి శ్రేష్ఠ వస్తువులన్నియు నా అధీన మందున్నవి. దేవేంద్రుని వాహనమగు గజశ్రేష్ఠమును నేను లాగు కొంటిని.

516. క్షీర సముద్రమును మథించగా పుట్టిన ఉచ్చైఃశ్రవస్సు అను అశ్వశ్రేష్ఠమును దేవతలు నాకు నమస్కార పూర్వకముగా సమర్పించిరి.

విశేషాంశము: ఈ మంత్రములోని 'తు' అను పదము పూర్వవాక్యము కంటె ఈ వాక్యము యొక్క వైలక్షణ్యమును సూచించును. ఐరావతమును శుంభుడు బలాత్కారముగ లాగు కొనెను. దానితో భయ పడిన దేవతలు ఉచ్చైఃశ్రవస్సును తామే సమర్పించిరి.

517. ఓ సుందరీ! దేవతలలో, గంధర్వులలో, నాగులలో ఏయే ఇతరములగు శ్రేష్ఠ వస్తువులు గలవో, అవి యన్నియు నా వద్దనే యున్నవి.

విశేషాంశము: ఇతరములగు శ్రేష్ఠ వస్తువులనగా పారిజాతము, హంసయుక్త విమానము, పద్మనిధి ఇత్యాదులు.

518. ఓ దేవీ! నీవు ఈ లోకము లోని స్త్రీలందరిలో శ్రేష్ఠురాలవు అని మేము భావించెదము. అట్టి నీవు మమ్ములను స్వీకరింపుము. ఏలయన, మేము రత్నభోక్తలము.

విశేషాంశము: ఈ మంత్రములో వయం 'అస్మాన్' అను బహు వచన పదములు శుంభుని కన్ను మిన్నుగానని దర్పమును సూచించును. సీతను ప్రలోభ పరచుటకై రావణుడు పల్కిన పల్కులకు, ఈ శుంభుని సందేశమునకు ఎంతో సామ్యము గలదు. గొప్ప వస్తువులన్నియు తన వద్దనే ఉండ వలెనని శుంభుని భావన. విశ్వామిత్రుడు గూడ 'రాజు రత్న భోక్త' అను వాదముతోనే వసిష్ఠుని ధేనువు నపహరింప బూని భంగపాటు చెందెను.

519. ఓ చంచల మగు క్రీగంటి చూపులు గలదానా! నీవు స్త్రీ జాతిలో రత్నము వంటి దానవు. కాన నన్ను గాని, గొప్ప పరాక్రమశాలియగు నా సోదరుడు నిశుంభుని గాని నీవు సేవింపుము.

విశేషాంశము: రత్నం రత్నేన సంగచ్ఛతే అని శుంభుని తాత్పర్యము.

520. నన్ను స్వీకరించుట వలన సాటి లేని మేటి ఐశ్వర్యమును పొందగలవు. నీవీ తీరున ఆలోచించి, నాకు భార్యవు కమ్ము.

ఋషి పలికెను.

521. ఇట్లు దూత చెప్పగా, అపుడు ఈ జగత్తునకు ఆధారమై నట్టియు, మంగళ స్వరూపురాలు అయిన దుర్గా భగవతి గంభీరమగు చిరునవ్వు గలదై ఇట్లనెను.

విశేషాంశములు: ఈ మంత్రములోని విశేషణములు గంభీరమగు అర్థము కలవి. దేవియే జగదాధారము. శుంభుడు ఆ జగత్తులోని వాడు. ఆమె ఐశ్వర్యము అపరిచ్ఛిన్నము. శుంభుని ఐశ్వర్యము పరిచ్ఛిన్నము, క్షణికము. ఆమె సర్వమంగళ. ఆమెకు మంగళముల నిచ్చెదనని, శుంభుని యహంకారము. ఆమె చిరునవ్వులోని అంతరార్థమిదియే.

522. నీవు సత్యమునే పల్కితివి. నీ మాటలలో అసత్యమేమియు లేదు. శుంభుడు ముల్లోకములకు ప్రభువు. నిశుంభుడు కూడ అంతటి వాడే.

523. కాని, నేను వివాహ విషయములో చేసిన ప్రతిజ్ఞను ఇపుడెట్లు అసత్యము చేయ గలను? నేను తెలివి తక్కువ దనము చేత పూర్వమొక ప్రతిజ్ఞ చేసితిని. దానిని వినుము.

524. ఎవడు నన్ను యుద్ధములో జయించునో, నా దర్పమును అడంచునో, ఈ లోకములో ఎవడు నాతో సరితూగు బలము కలవాడో, వాడే నాకు భర్త కాగలడు

525. కాన మహాసురుడగు శుంభుడు గాని, నిశుంభుడు గాని ఇచటకు వచ్చి, నన్ను జయించి, వెను వెంటనే నన్ను వివాహము చేసుకొనుగాక! అలస్యమేల?

విశేషాంశములు: పై నాల్గు మంత్రములలో దేవి పలికిన మాటలలోని గూఢార్థమిట్లున్నది. "ఓయీ! నీవింతగా వర్ణించిన శుంభనిశుంభుల అన్యాయప్రవృత్తి యంతయు సత్యమే. వారిద్దరు ముల్లోకములకు మనస్తాపము కలుగజేసిరి. పూర్వము దేవతలు నన్ను స్తుతించినపుడు నేను వారిద్దరిని వధించెదనని ప్రతిజ్ఞ చేసితిని. మూర్ఖుడవగు నీకది తెలియదు. ఆ ప్రతిజ్ఞను నేనెట్లు విడనాడగలను? ఎవడు దేవతలను జయించి, బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు వారిని అవమానించునో, వానిని నేను సంహరించెదను. మరణించు కోరిక గలదేని, శుంభనిశుంభులు ఇచటకు వచ్చెదరుగాక! అలస్యమేల? శీఘ్రముగా నా హస్తచపేటమును స్వీకరించెదరు గాక!"

దూత పలికెను

526. ఓ దేవీ! నీవు గర్వించి ఉన్నావు. నా ఎదుట నీవిట్లు పలుక రాదు. ముల్లోకములలో ఏపురుషుడు శుంభనిశుంభుల యెదుట నిలబడ గలడు?

527. శుంభనిశుంభుల నట్లుండనిమ్ము. చండముండాది తదనుచరులగు ఇతర రాక్షసుల యెదుటకూడ యుద్ధములో దేవతలందరు కలిసియు నిలబడలేరు. ఓ దేవీ! స్త్రీవి, ఏకాకివియగు నీ గురించి చెప్పునదేమున్నది?

528. యుద్ధములో ఏ శుంభాది రాక్షసుల యెదుట ఇంద్రాది దేవతలందరు నిలబడలేకపోయిరో, అట్టివారి ఎదుట స్త్రీవైన నీవెట్లు నిలబడగలవు?

529. అట్టి నీవు నా మాటను స్వీకరించి, శుంభనిశుంభుల వద్దకు వెళ్లుము. జుట్టు పట్టుకొని లాగుటచే నశించిన గౌరవము గల దానవై వెళ్లకుము.

దేవి పలికెను.

530. శుంభుడు మహా బలవంతుడు. నిశుంభుడు కూడ అతిశయించిన పరాక్రమము గలవాడు. ఇది నిజమే. పూర్వము నేను ఆలోచించ కుండగా తొందర పాటుతో ప్రతిజ్ఞ చేసితిని. ఏమి చేయగలను?

531. కాన నీవు వెళ్లుము. నేను నీకు చెప్పిన దంతయు శ్రద్ధగా రాక్షస రాజగు శుంభునకు చెప్పుము. అతడు యోగ్యమగు రీతిని చేయగలడు.

విశేషాంశము: అసురేంద్రుడు అనగా 'నీచాతి నీచుడు' అని గూఢార్థము.

ఇది శ్రీ మార్కండేయ మహాపురాణము నందు సావర్ణిక మన్వంతర గాథలో దేవి మాహాత్మ్యము నందు 'శక్రాది కృత విభూతియోగస్తోత్రము, దేవీ సుగ్రీవ సంవాదము' అను, మూల గ్రంథ మంత్ర విభాగ రూపమగు నవశతీ మంత్రమాల యందలి నాల్గవ అధ్యాయము సమాప్తమయ్యెను.

శ్రీః శ్రీః శ్రీః

## శ్రీః

## పంచమాధ్యాయము

## ఓం నమశ్చండికాయై

ఋషి పలికెను.

532. దేవి యొక్క ఈ పలుకులను విని, ఆ దూత కోపముతో నిండిన వాడై, తిరిగి వచ్చి, రాక్షస రాజునకు సవివరముగా చెప్పెను.

533. అపుడా దూత యొక్క ఆ మాటనువిని రాక్షస రాజగు శుంభుడు కోపించిన వాడై రాక్షససేనా పతియగు ధూమ్రలోచనునితో ఇట్లు పలికెను.

534. ఓ ధూమ్రలోచనా! నీవు వెంటనే నీ సైన్యముతో కూడి ఆ దుష్టురాలిని బలముగా జుట్టు పట్టుకొని లాగి, వ్యాకుల పరిచి, తీసుకొని రమ్ము.

535. ఆమెను రక్షించుటకై వేరెవరైన సిద్ధ పడినచో, వాడు అమరుడైనను యక్షుడైనను, గంధర్వుడైనను, వానిని సంహరింపుము.

ఋషి పలికెను.

536. ఆ శుంభునిచే ఆజ్ఞాపింప బడిన ఆ ధూమ్రలోచనుడను రాక్షసుడు అపుడు వెంటనే అరువది వేల మంది రాక్షసులతో కూడిన వాడై వేగముగా వెళ్లెను.

537. అపుడాతడు హిమవత్పర్వత మందున్న ఆ దేవిని చూచి, శుంభనిశుంభుల వద్దకు వెంటనేరమ్ము అని బిగ్గరగా పలికెను.

538. పూజ్యురాలవగు నీవు ప్రీతితో నా ప్రభువగు శుంభుని వద్దకు రానిచో, అపుడు ఈ నేను నిన్ను బలముగా జుట్టులాగి వ్యాకుల పరచి, తీసుకు వెళ్ల గలను.

దేవి పలికెను.

539. నీవు రాక్షస రాజగు శుంభునిచే పంపబడితివి. నీవు స్వయముగా బలశాలివి. పైగా సైన్యముతో కూడి యున్నావు. ఈ విధముగా నన్ను బలాత్కారముగా తీసుకు వెళ్లినచో, అట్టి తరి నేనేమి చేయగలను?

విశేషాంశము: దేవి వాక్యము లోని గూఢార్థమేమనగా "ఓ రాక్షసా! బలహీనుడవగు నీవు కాకులతో కూడి దైవముచే నావద్దకు పంపబడితివి. నీవు నన్ను బలాత్కరించబూనినచో, నీ అహంకారము నడంచెదను."

మరణ మాసన్నమైన వ్యక్తుల చుట్టు కాకులు తిరుగునని వైద్యశాస్త్రములో చెప్పబడెను

ఋషి పలికెను.

540. దేవి ఇట్లు పలుకగా, ఆ ధూమ్రలోచనుడను రాక్షసుడు ఆమెపైకి పరుగెత్తెను. అప్పుడా అంబిక హుంకారము చేతనే వానిని భస్మము చేసెను.

541. తరువాత విశాలమగు ఆ రాక్షససైన్యము కోపించినదై అంబికపై వాడి బాణములను, శక్తులను, గొడ్డళ్లను వర్షించెను.

542. అపుడు దేవి యొక్క స్వీయ వాహనమగు సింహము జూలు విదల్చి, కోపముతో మిక్కిలి భయంకరమగు నాదమును చేసి రాక్షస సైన్యముపై పడెను.

543. ఆ సింహము కొందరు రాక్షసులను పంజాతో కొట్టి చంపెను.

544. ఆ సింహము మరికొందరిని నోటియందలి దంష్ట్రలతో చంపెను.

545. ఆ సింహము మరికొందరు రాక్షసులను వక్షస్థలము నాక్రమించి సంహరించెను.

546. ఆ సింహము కొందరు మహారాక్షసుల యొక్క జఠరాంతర్భాగములను గోళ్లతో చీల్చి వేసెను.

547. మరియు కొందరు మహాసురుల యొక్క శిరస్సులను పంజా దెబ్బతో శరీరము నుండి వేరు చేసెను.

548. మరియు ఆ సింహము మరి కొందరు మహాసురుల యొక్క భుజస్కంధములను పీకి వేసెను.

549. ఆ సింహము జూలును విదల్చుచూ, కొందరు రాక్షసుల ఉదరమును చీల్చి రక్తమును త్రాగెను.

550. మిక్కిలి కోపము గల్గినట్టియు, దేవీ వాహనమైనట్టియు, పెద్ద దేహముగల ఆ సింహముచే ఆ సైన్యమంతయు క్షణకాలములో నాశన మొనర్చ బడెను.

551. ధూమ్రలోచనుడను రాక్షసుడు దేవిచే సంహరింప బడినాడనియు, అపై దేవి యొక్క సింహముచే సైన్యమంతయు నాశనము చేయ బడినదనియు, విన్న రాక్షస రాజు శుంభుడు వణకుచున్న అధరోష్ఠము గలవాడై గొప్ప కోపమును పొందెను.

551-1 అపుడు శుంభుడు చండముండులనే ఆ మహాసురులను ఆజ్ఞాపించెను.

552. ఓయీ చండా! ఓయీ ముండా! మీరు పెద్ద సైన్యమును తీసుకొని అక్కడకు వెళ్లుడు. వెళ్లి, శీఘ్రముగా ఆమెను తీసుకురండు.

553. జుట్టు పట్టి లాగి తీసుకు రండు. లేదా బంధించి తీసుకురండు. మీకు సందేహమున్నచో, అపుడు యుద్ధము నందు సమస్తరాక్షసులతో కలిసి, సమస్తమైన ఆయుధములతో ఆమెను సంహరింపుడు.

**విశేషాంశము:** శుంభుడు మూడు పక్షములు చెప్పెను. మొదటిది సంభవము కానిచో రెండవది, అదియు కానిచో మూడవ పక్షమును అవలంబింప వలెనని వాని అభిప్రాయము.

554. దుష్టురాలగు ఆమెను సంహరించి, సింహమును సంహరించి వెంటనే తిరిగి రండు. అట్లు గాక, ఆ అంబికను బంధించి పట్టుకురండు.

విశేషాంశములు: కోపముచే ముందు సంహరించమని చెప్పి, తిరిగి స్త్రీ హత్యా దోషము, అకీర్తికరము అను శంకచే బంధింపుడని శుంభుడు చెప్పుచున్నాడు. హిమవత్పర్వతమందుండుటచే ఈమె శివపత్నియే అయ్యుండును. ఆ భావముతో శుంభుడు అంబికా శబ్దమును ప్రయోగించి యుండును.

ఋషి పలికెను.

555. అపుడు వానిచే ఆజ్ఞాపింపబడిన రాక్షసులు, చండ ముండులను ముందిడుకొని, చతురంగ బలముతో కూడిన వారై, ఆయుధములను యుద్ధమునకు సిద్ధముగా పట్టు కొని, వెడలిరి.

556. నేను ముందు, నేను ముందు అని పలుకుచూ, శూలములను, పట్టిశములను, ధరించి ఆ దేవిని శీఘ్రముగా బంధింపగోరు వారై వెడలిరి.

557. అపుడా పర్వతశ్రేష్ఠము యొక్క ఎత్తైన బంగరు శిఖరముపై సింహము మీద ఆసీనయై యున్నట్టియు, మందహాసము చేయుచున్న దేవిని చూచిరి.

విశేషాంశము: ఇంతకు ముందు వచ్చిన ధూమ్రలోచనుడు, వాని సైన్యము నాశనమైన సంగతి తెలిసియు, ఈ మూర్ఖులు వచ్చుచున్నారని కాబోలు ఆమె ముఖమునందు చిరునవ్వు మొలకెత్తెను.

558. గర్వించిన ఆ రాక్షసులు ఆమెను చూచి, బాణప్రయోగము కొరకు ధనస్సులను వంచి, ఆమెను బందీ చేయుటకు యత్నము మొదలిడిరి. కొందరు కత్తులను చేతబట్టి ఆమె సమీపమునకు వెళ్లి, ఆమెను బంధించుటకు ప్రయత్నించిరి.

559. అపుడు అంబికకు ఆ శత్రువులపై గొప్ప కోపము కలిగెను.

560. అపుడామె ముఖము కోపముచే కాలవర్ణమును పొందెను.

## కాళి ఆవిర్భావము

561. కను బొమలు ముడిపడుటచే భీషణమగు ఆమెయొక్క విశాలమైన ఫాలదేశము నుండి వెంటనే భయంకరమగు ముఖముకల కాళి కత్తిని, పాశమును ధరించినదై ఆవిర్భవించెను.

562. ఆ కాళి అద్భుతమైనట్టియు, శత్రు శిరస్సు గ్రుచ్చ బడిన దండమును ధరించెను. ఆహిమాలను అలంకారముగా ధరించెను. వ్యాఘ్రచర్మమును వస్త్రముగా ధరించెను. శుష్కించిన మాంసముగల దేహముతో ఆమె చాల భయమును కొల్పుచుండెను. మిక్కిలి విశాలమగునోరు కల్గి యుండెను. నాలుకను ఇటు నటు కదుపుచూ భయంకరముగా నుండెను. లోతైన ఎర్రని నేత్రములు కలిగి యుండెను. ఆమె చేయుచున్న నాదముచే దిక్కులు నిండి పోయెను. ఆమె ఆ రాక్షస సైన్యమునందు వేగముగా ప్రవేశించి సేనాపతులను సంహరించుచూ, రాక్షస సైన్యమును భక్షించెను.

విశేషాంశములు: 'నరశిరోమాల' అనగా సహస్రారమందు ఉద్భవించిన నాదము: నావేత్సన్నమైన అకారాది క్షకారాంత అక్షరమాలను ధరించిన దేవీ

అని చెప్పుట సమంజసము. 612 మహాహివలయా, 802 అహిధరే, అను మంత్రములను గమనింపుడు.

563. గజపృష్ఠ భాగమును రక్షించు సైనికులు, గజమును తోలు మావటీంద్రుడు, గజముపై కూర్చుండి యుద్ధము చేయు వీరులు, గజ పార్శ్వమునందు వ్రేలాడు ఘంటలు, వీటన్నిటితో సహా గజములను ఒకే చేతితో పట్టుకొని ఆ కాళి తన నోట వడ వేసుకొనెను.

564. మరియు ఆ కాళి గుర్రములతో సహా అశ్వికులను, సారథితో సహా రథమును నోట బడవైచుకుని దంతములతో మిక్కిలి భీకరముగా నమలుచుండెను.

565. ఆ కాళి ఒకనిని జుట్టు పట్టు కొనెను.

566. ఆ కాళి మరియొకనిని మెడ పట్టుకొనెను.

567. ఆ కాళి మరియొకనిని కాలితో తొక్కిపట్టు కొనెను.

568. ఆ కాళి మరియొకనిని వక్షస్థలాఘాతముచే సంహరించెను.

**విశేషాంశము:** పై మంత్రములలో జాతియందు ఏకవచనము ప్రయోగింప బడెను. అనగా, అనేక రాక్షసులను అయా పద్ధతులలో ఆమె సంహరించెనని భావము.

569. ఇంకను ఆ కాళి కోపించినదై తనపై రాక్షసులచే ప్రయోగింప బడిన శస్త్రములను, గొప్ప అస్త్రములను నోటితో పట్టు కొని దంతములతో చూర్ణముగ చేసెను.

570. ఆ కాళి బలవంతులు, దుష్టులునగు ఆ రాక్షసుల యొక్క సైన్యము నంతయు నాశనము చేసెను.

571. ఆ కాళి కొందరిని భక్షించెను.

572. ఆ కాళి మరి కొందరిని పాదప్రహారములతో సంహరించెను.

573. ఆ కాళి కొందరిని ఖడ్గముతో సంహరించెను.

574. ఆమె కొందరిని శత్రు శిరస్సు గ్రుచ్చ బడిన దండముచే సంహరించెను.

575. ఆ కాళి మరి కొందరు రాక్షసులను పళ్లతో కొరికి సంహరించెను.

576. క్షణకాలములో నశింపచేయ బడిన ఆ రాక్షససైన్యము నంతయూ చూచి చండుడు అతి భయంకరాకృతిగల ఆ కాళిపైకి పరుగెత్తెను.

577. మహాసురుడగు ముండుడు కూడ భయమును గొల్పు నేత్రములు గల ఆ కాళిని అతిభయంకరములగు బాణవర్షములచే, వేలాదిగా విసర బడిన చక్రములచే కప్పి వేసెను.

578. ఆమె యొక్క నోటి యందు ప్రవేశించుచున్న అసంఖ్యాకములగు ఆ చక్రములు మేఘాన్తర్భాగమందు ప్రవేశించుచున్న అనేకములగు సూర్యబింబములవలె ప్రకాశించెను.

579. అప్పుడు భయంకరమగు నాదము చేయుచున్నట్టియు, భీకరమగు నోటిలోపలి చూడ శక్యముగాని దంతములతో ప్రకాశించు కాళి అతిశయించిన కోపముతో భయంకరముగా నవ్వెను.

580. కాళీ దేవి పెద్దఖడ్గమును పైకెత్తి హుంకారమునుచ్చరించుచూ, చండుని పైకి పరుగెత్తెను.

581. వానిని జుట్టు పట్టు కొని ఆ కత్తితో శిరస్సును నరికెను.

582. అప్పుడు చండుడు సంహరింపబడుటను చూచి, ముండుడు ఆమెపైకి పరుగెత్తెను.

583. ఆమె కోపముతో ఆ ముండుని కూడ కత్తితో నరికి నేలపై బడవేసెను.

584. అప్పుడు మహా పరాక్రమశాలులగు చండముండులిద్దరూ కూడ సంహరింప బడుటను చూచి, చంపబడగా మిగిలిన సైన్యము భయముతో వ్యాకులపై అన్ని దిక్కులకు పారిపోయెను.

585. కాళియు చండముండుల శిరస్సులను పట్టు కొని, చండిక వద్దకు వచ్చి ప్రచండమగు అట్టహాసము చేయుచూ, పలికెను.

586. ఈ యుద్ధమనే యజ్ఞమునందు నేను చండముండులు అను మహాపశువులన సంహరించి, తీసుకు వచ్చితిని. శుంభనిశుంభులను నీవే స్వయముగా వధించగలవు.

విశేషాంశములు: విద్యలలో కెల్ల గొప్పది అధ్యాత్మ విద్య. అది లేని వాడ పశువు. దేవినే హతమార్చయత్నించిన చండముండులు అట్టి పశువులలో అగ్రగణ్యులు. ఆ మహా పశువులను యుద్ధయజ్ఞమునందు సంహరించి కాళి వారిని కృతార్థులను చేసినది. "పశుపాశ విమోచనీ" అని లలిత సహస్రనామము.

**ఋషి పలికెను.**

587 అప్పుడు తన వద్దకు కొనిరాబడిన చండముండుల శిరస్సులను చూచి మంగళ ప్రదయగు చండిక కాళిని ఉద్దేశించి ఈ మధురమైన వాక్కును పలికెను.

588. ఓ దేవీ! నీవు చండముండుల శిరస్సులను తీసుకొని వచ్చితివి. అందువలన నీవు లోకమునందు 'చాముండా' అని ప్రఖ్యాతిని పొందగలవు.

ఇది శ్రీమార్కండేయ మహా పురాణమునందు సావర్ణిక మన్వంతరగాథలో దేవీ మాహాత్మ్యమునందు చండముండవధ అను మూలగ్రంథ మంత్ర విభాగ రూపమగు నవశతీ మంత్రమాలయందలి ఐదవ అధ్యాయము సమాప్తమయ్యెను.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః
# షష్ఠాధ్యాయము
## ఓం నమశ్చండికాయై

ఋషి పలికెను.

589. చండుడు, ముండుడు అను రాక్షసులు సంహరింపబడగా, పెద్ద సంఖ్యలో సైన్యము కూడ నశింపచేయబడగా, రాక్షస ప్రభువగు శుంభుడు కోపించెను.

590. అపుడు పరాక్రమ శాలియగు శుంభుడు కోపమునకు వశమైన మనస్సు గలవాడై, రాక్షస సైన్యములన్నియు యుద్ధమునకు సంసిద్ధము కావలెనని ఆదేశించెను.

591. ఇపుడు ఉదాయుధులను ఎనభై అర్గురు రాక్షససేనాపతులు తమ సైన్యము లన్నిటితో యుద్ధమునకు బయలుదేరుదురు గాక!

విశేషాంశములు: ఎల్లప్పుడు ఆయుధములు సిద్ధముగానున్న సేనాపతులు గాన, ఉదాయుధులని పేరు.

592. కంబు అను పేరుగల రాక్షస సంఘములోని, యుద్ధనిపుణులగు ఎనభైమంది సేనానాయకులు తమ సైన్యముతో కూడి బయలుదేరుదురు గాక!

593. కోటివీర్యులనే ఏబది రాక్షస సంఘములు నా ఆజ్ఞచే యుద్ధమునకు బయలుదేరుదురు గాక!

విశేషాంశములు: అతిశయించిన పరాక్రమము గల వారు గనుక 'కోటి వీర్యులు' అని పేరు.

594. ధూమ్రవంశస్థులగు వందరాక్షస సంఘములు నా ఆజ్ఞచే బయలుదేరుదురుగాక!

595. కాలవంశమునకు చెందిన రాక్షసులు నా ఆజ్ఞచే తొందరగా యుద్ధమునకు సిద్ధమై బయలుదేరుదురు గాక!

596. దుర్హృద్వంశమునకు చెందిన రాక్షసులు నా ఆజ్ఞచే తొందరగా యుద్ధమునకు సిద్ధమై బయలు దేరుదురు గాక!

597. మురవంశమునకు చెందిన రాక్షసులు నా ఆజ్ఞచే తొందరగా యుద్ధమునకు సిద్ధమై బయలుదేరుదురు గాక!

598. కాలకా వంశమునకు చెందిన రాక్షసులు నా ఆజ్ఞచే తొందరగా యుద్ధమునకు సిద్ధమై బయలుద్ధేరుదురు గాక!

ఋషి పల్కెను.

599. చండశాసనుడగు రాక్షసరాజు శుంభుడు, ఈ విధముగా ఆజ్ఞాపించి అనేక సహస్రసైన్యముతో కూడినవాడై బయలుదేరెను.

600. అచట వేలాది ఉత్పాతములు ప్రాదుర్భవించెను.

601. ఉత్పాతమేఘములు ఎముకలను, రక్తమును, బురదను వర్షించెను.

602. క్రూరమృగములు భయంకరముగా నినదించినవి. నక్కలు కూడ అరిచినవి.

603. ఆ ఉత్పాతములను లెక్కచేయక ఆ శుంభుడు, హిమవత్పర్వతమును గూర్చి వెళ్లెను.

604. కౌశికి, వచ్చిన అతి భయంకరమగు నా సైన్యమును చూచి, భూమ్యంతరిక్షముల మధ్యనున్న అవకాశమును నారిత్రాటిధ్వనులచే నింపివేసెను.

605. ఓ రాజా! అపుడు సింహము గొప్పనాదమును అనేక పర్యాయములు చేసెను.

606. అంబిక ఆ నాదమును ఘంటయొక్క ధ్వనిచే వృద్ధి పొందించెను.

607. కాళి విశాలమైన వదనమును తెరిచి నాదముచే దిగంతరాళములను నింపివేసెను. ఆమె భీకరములగు తన నాదములచే ధనస్సుకు చెందిన నారిత్రాటి యొక్క, సింహము యొక్క, ఘంటలయొక్క ధ్వనులను జయించెను.

608. రాక్షససైన్యములు ఆ నాదము విని కోపించినవై, కౌశికీ దేవిని, కాళిని మరియు సింహమును నాల్గువైపుల చుట్టివేసెను.

609. ఓ రాజా! ఈ సమయములో, రాక్షసవినాశము కొరకు, దేవతల క్షేమము కొరకు, బ్రహ్మ, శివుడు, కుమారస్వామి, విష్ణువు మరియు ఇంద్రుని యొక్క దేహములనుండి గొప్ప బలము, పరాక్రమముతో కూడిన శక్తులు వారి వారి రూపములతో బయటకు వచ్చి, చండిక వద్దకు చేరిరి.

విశేషాంశములు: ఆ సమయమునందు యుద్ధమును చూచుటకై బ్రహ్మాదులు అంతరిక్షమునందు వచ్చియుండిరని గమనించవలెను. విష్ణువు యొక్క దేహమునుండి వైష్ణవి, వారాహి, నారసింహి అను మూడు శక్తులుద్భవించగా, ఇతరదేవతలనుండి ఒక్కొక్క శక్తి ఉద్భవించెను.

610. ఏ శక్తి ఏదేవతనుండి ఉద్భవించెనో, అదే దేవత యొక్క రూపమును భూషణములను, వాహనములను కలిగి, రాక్షసులతో యుద్ధమునకు వచ్చెను.

611. ముందుగా బ్రహ్మయొక్క శక్తి అక్షసూత్రమును, కమండలమును ధరించి హంసలతో కూడిన విమానమునందు వచ్చెను. ఆమెయే 'బ్రహ్మాణి' యని చెప్పబడును

612. మాహేశ్వరి వృషభము నధిష్ఠించి, శ్రేష్ఠమగు త్రిశూలమును ధరించి, శేషవాసుకి తక్షకాది మహాసర్పములను కంకణములుగా ధరించి, చంద్రరేఖ అలంకారముగా కలదై వచ్చెను.

613. కుమారస్వామినుండి ఉద్భవించి, ఆయన రూపమునే ధరించిన అంబిక, శక్తి అను ఆయుధమును చేతబట్టి, శ్రేష్ఠమగు నెమలి వాహనమునధిష్ఠించి, రాక్షసులతో యుద్ధమునకు వచ్చెను.

614. అదే విధముగా విష్ణువు యొక్క శక్తి గరుత్మంతునిపై అధిష్ఠించి, శంఖము, చక్రము, గద, శార్ఙ్గ ధనస్సు, ఖడ్గములను చేతబట్టి వచ్చెను.

విశేషాంశములు: శార్ఙ్గపదముచే ఉపలక్షితమగు బాణములతో కలిపి, వైష్ణవి ఆరు ఆయుధములను ధరించినది గాన ఆమె షడ్భుజి.

615. సాటిలేని, యజ్ఞరూపమగు వరాహము యొక్క రూపమును ధరించిన విష్ణువుయొక్క ఏ శక్తి గలదో, ఆ శక్తి కూడ వరాహదేహమును దాల్చి, యుద్ధభూమికి వచ్చెను.

విశేషాంశములు: భాగవతము వరాహావతారమును యజ్ఞరూపముగ వర్ణించెను.

"యత్రోద్ధతః క్షితితలోద్ధరణాయ బిభ్రత్ క్రౌడీం తనుం సకల యజ్ఞమయీమనన్తః"

దీనినే హరివంశము కూడ చెప్పెను.

"వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్తశ్చితీముఖః|
అగ్నిజిహ్వో దర్భరోమా బ్రహ్మశీర్షో మహాతపాః||"

616. నరసింహాశక్తి నృసింహ రూపమును ధరించి జూలు విదల్చుటచే చెల్లాచెదరైన నక్షత్రసముదాయము గలదై యుద్ధరంగమునకు వచ్చెను.

617. మరియు ఇంద్రుని నుండి ఉద్భవించిన శక్తి వజ్రము చేతబట్టి, ఐరావతము నధిరోహించి వచ్చెను. ఆమె ఇంద్రునివలెనే వేయి నేత్రములు గలిగి ఉండెను.

618. అపుడా దేవశక్తుల మధ్య నున్నవాడై మహేశ్వరుడు కౌశికితో ఇట్లు పలికెను. "నా ప్రీతికొరకు రాక్షసులను శీఘ్రముగా సంహరింపుము".

ఋషి పలికెను.

619. అపుడు కౌశికి యొక్క దేహమునుండి అతిఘోరమైన ఆకారము కలిగినట్టియు, మిక్కిలి భయము గొల్పునట్టియు, వందలాది క్రోష్టములవలె నాదము చేయుచున్న చండికయను శక్తి బయటకు వచ్చెను.

620. పరాజయ మెరుంగని ఆ చండిక ధూమ్రవర్ణముగల జటాజూటమును ధరించిన మహేశ్వరునితో ఇట్లు పల్కెను. "హే భగవన్! శుంభునిశంభుల వద్దకు నీవు దూతగా వెళ్లవలెను."

విశేషాంశములు: దూతయగుట శివునకు అపకర్ష కాదు. నీతి రహస్యములో దూతగుణములిట్లు చెప్పబడెను.

"దూతస్సమర్థో విశ్వాస్యశ్శుచిరలోలుపః|
చతురః పరమర్మజ్ఞః ప్రగల్భః ప్రతిభాన్వితః||"

దూత సమర్థుడు, నమ్మదగినవాడు, శుద్ధమగు మనస్సు కలవాడు, లోభము లేనివాడు, చతురుడు, ఇతరుల రహస్యములను తెలుసుకొనగలవాడు, గంభీరముగ ప్రసంగించగలవాడు, ప్రతిభాశాలి అయి ఉండవలెను. అట్టి

సమర్థుడు కనుకనే శ్రీకృష్ణుడు ధర్మరాజు యొక్క దూతగా కౌరవసభకు వెళ్లెను.

621. మిక్కిలి గర్వించి యున్న శుంభనిశుంభులను రాక్షసులతోను, అంతేగాక అచట యుద్ధముకొరకు వచ్చియున్న ఇతర రాక్షసులతోను ఇట్లు చెప్పుము.

622. ఓ రాక్షసులారా! ఇంద్రునకు త్రిలోకాధిపత్యమును తిరిగి ఇండు. దేవతలకు హవిర్భాగముల నిచ్చివేయుడు. మీకు జీవించు కోరికగలదేని, పాతాళమునకు పొండు.

623. అట్లుగాక, బలగర్వముచే మీరు యుద్ధమునే కోరినచో రండు. మీ మాంసముచే నాయొక్క కాళీ మొదలగు శక్తులు తృప్తిని పొందుగాక!

ఋషి పల్కెను.

624. ఆ చండికయను కౌశికీదేవిహోద్భూతయగు శక్తి స్వయముగా శివుని దూతకార్యమునందు నియోగించినదిగాన, ఆమె ఈ లోకమునందు 'శివదూతి' అని ప్రఖ్యాతిని బడసెను.

625. ఆ శుంభాది మహాసురులు శివుడు చెప్పిన దేవీ వాక్యములు విని, కోపముతో నిండినవారై కాత్యాయని (కౌశికి) ఉన్న ప్రదేశమునకు వెళ్లిరి.

విశేషాంశములు: కం సూర్యం అత్యాయయతి అతి క్రామయతి ఇతి కాత్యాయని. అనగా ఆమె అనుగ్రహమును పొందినవారు సూర్య మండలమును భేదించి ఉత్తమలోకములను పొందెదరు గాన ఆమె 'కాత్యాయని'.

ఒకప్పుడు దేవి దేవకార్యముకొరకు కతముని యొక్క ఆశ్రమములో జన్మించెను ఆమెను కతముని పెంచెను. కాన ఆమె 'కాత్యాయని' అని శివపురాణము చెప్పెను.

626. అప్పుడు వృద్ధిపొందిన కోపముగల ఆ రాక్షసులు ముందుగనే ఆ కౌశికీ దేవిపై బాణములు, శక్తులు, రెండు వైపుల పదును గల కత్తులను వర్షించిరి.

ఆ దేవియు రాక్షసులచే ప్రయోగింపబడిన ఆ బాణములను, శూలములను, [illegible] వారి త్వరతో శబ్దము చేయుచూ, ధనస్సు నుండి [illegible] బాణములతో అవలీలగా ఛేదించెను.

[illegible] శత్రువులను శూలముతో చీల్చుచూ, [illegible] ముతో పొడిచి సంహరించుచూ, సంచరించెను.

[illegible] పడుచుండెను. అచ్చటచ్చట శత్రువులపై [illegible] వారి బలము, ఉత్సాహశక్తి నశించునట్లు [illegible]

[illegible] రాక్షసులను సంహరించెను.

[illegible] రాక్షసులను సంహరించెను.

632. మరియు మిక్కిలి కోపముగల కార్తికేయశక్తి తన శక్తి అను ఆయుధముతో రాక్షసులను సంహరించెను.

633. ఇంద్రశక్తి యొక్క వజ్రప్రహారముచే చీల్చబడిన వందలాది రాక్షసులు రక్తపు ధారలను వర్షించుచూ భూమిపై పడుచుండిరి.

634. వారాహి యొక్క ముఖాగ్రభాగపు దెబ్బలచే శిథిలము చేయబడినవారై, కోరల అగ్రభాగముచే చీల్చబడిన వక్షస్థలము గలవారై, మరియు చక్రముచే ఛేదింపబడినవారై, రాక్షసులు నేల గూలిరి.

635. నారసింహి నాదముచే నిండిన దిక్కుల అవకాశము గలదై, రాక్షసులను కొందరిని గోళ్లతో చీల్చి భక్షించుచూ, యుద్ధరంగమునందిటునటు తిరుగ జొచ్చెను.

636. శివదూతి యొక్క అత్యుగ్రమగు అట్టహాసములచే రాక్షసులు మూర్ఛను పొందిరి.

637. ఇట్లు మూర్ఛను పొందిన రాక్షసులు నేలపై బడిరి.

638. అపుడామె నేలపైబడిన ఆ రాక్షసులను భక్షించెను.

639. ఈ విధముగా మాతృగణము కోపించి అనేక విధములుగా మహాసురులను సంహరించుచుండ చూచి, శుంభుని సైనికులు పలాయనము చిత్తగించిరి.

**విశేషాంశములు:** కాళినుండి శివదూతి వరకు గల తొమ్మిది శక్తులకు మాతృగణమని పేరు. కొన్ని సందర్భములలో కాళిని మినహాయించి, మిగిలిన ఎనిమిది శక్తులకు మాతృగణమని వ్యవహారము గలదు. ఇంకను కొన్ని సందర్భములలో, కాళిని, శివదూతిని తొలగించగా, మిగిలిన ఏడు శక్తులకు మాతృగణమనియు, సప్తమాతృకలనియు వ్యవహారము గలదు.

640. మాతృగణముచే హింసింపబడి పారిపోవుచున్న రాక్షసులను చూచి, కోపించినవాడై, రక్తబీజుడను మహాసురుడు యుద్ధము చేయుటకు ముందుకు వచ్చెను.

641. రక్తబీజుడు శుంభునిశుంభుల సోదరియగు క్రోధవతి యొక్క జ్యేష్ఠ కుమారుడు. అతడు గొప్ప బలము, తేజస్సు, పరాక్రమము గలవాడు.

642. రక్తబీజుని శరీరమునుండి ఒక రక్త బిందువు భూమిపై పడిన వెంటనే, భూమినుండి వానితో సమానమగు శరీర బల వయోరూపములు గల్గిన రాక్షసుడు ఉద్భవించును.

643. ఆ మహాసురుడు గదను చేతబట్టి ఇంద్రశక్తితో పోరాడెను.

644. అపుడు ఐంద్రి తన వజ్రముతో రక్తబీజుని కొట్టెను.

645. వజ్రముతో కొట్టబడిన ఈ రక్తబీజుని దేహమునుండి రక్తము అధికముగా స్రవించెను.

646. అపుడు రక్తబీజునితో సమానమగు రూపము, పరాక్రమము గల యోద్ధలగు రాక్షసులు ఉద్భవించిరి.

647. వాని శరీరమునుండి ఎన్ని రక్తపు బిందువులు పడినవో, అంతమంది పురుషులు వానితో సమమగు ప్రభావము, బలము, విక్రమము గలవారు పుట్టిరి.

648. రక్తమునుండి పుట్టిన ఆ పురుషులుకూడ యుద్ధరంగమునందు అతిభయంకరమగు శస్త్రప్రహారములు చేయుచూ, మాతృగణముతో యుద్ధము చేయుచుండిరి.

649. తిరిగి ఐంద్రియొక్క వజ్రప్రహారముచే ఈ రక్తబీజుని శిరస్సు పగిలి, ఆ శిరస్సు నుండి రక్తము ప్రవహించెను. ఆ రక్తమునుండి వేలాది పురుషులు పుట్టిరి.

650. వైష్ణవి కూడ ఈ రక్తబీజుని చక్రముతో కొట్టెను.

651. ఐంద్రి ఆ రాక్షసశ్రేష్ఠుని గదతో కొట్టెను.

652. వైష్ణవి యొక్క చక్రముచే ఛేదింపబడిన రక్తబీజుని యొక్క రక్తప్రవాహము నుండి పుట్టినట్టియు, వానితో సమానమగు శరీర బలరూపాదులు గల వేలాది మహాసురులచే జగత్తు నిండి యుండెను.

653. కౌమారి రక్తబీజుని శక్తితో కొట్టెను.

654. మరియు వారాహి రక్తబీజుని కత్తితో కొట్టెను.

655. మాహేశ్వరి రక్తబీజుని త్రిశూలముతో పొడిచెను.

656. బ్రహ్మాణి బ్రహ్మదండముతో రక్తబీజుని హృదయమునందు కొట్టెను.

657. నారసింహి గోళ్లు అనే ఆయుధముతో, వాని గుండెను చీల్చెను. అయినను వాడు చలించలేదు.

658. దితి వంశమునందు జన్మించిన మహాసురుడగు రక్తబీజుడు కోపముతో నిండినవాడై శక్తులనందరినీ వేర్వేరుగా గదతో కొట్టెను.

659. శక్తి, శూలము మొదలగు ఆయుధములచే బహుభంగులు కొట్టబడిన ఆ రక్తబీజుని రక్తప్రవాహము భూమిపై పడెను. దానినుండి వందలాది రాక్షసులు జన్మించిరి.

660. రక్తబీజుని రక్తము నుండి పుట్టిన ఆ రాక్షసులచే జగత్తంతయు నిండిపోయెను.

661. అపుడు దేవతలు గొప్ప భయమును పొందిరి.

662. అపుడు అంతరిక్షమునందు విమానము లందున్న దేవతలు పరస్పరము ఇట్లు సంభాషించుకొనిరి. "ఇట్టి మహాసురుడు ఇంతకు ముందు పుట్టలేదు. భవిష్యత్తులో పుట్టబోడు. ఇప్పుడు జగత్తులో రక్తబీజునితో సమానమైన వాడు లేడు".

663. విషాదమును పొందిన ఆ దేవతలను చూచి, చండిక చిరునవ్వు నవ్వెను. ఆమె శీఘ్రమే కాళితో ఇట్లనెను.

"హే చాముండే! నీవు నోటిని విశాలముగా తెరువుము"

**విశేషాంశములు:** చండముండులను సంహరించిన నీవు ఈ రక్తబీజ సంహారములో కూడ సహకరించవలెనని 'చాముండే' అను సంబోధన సూచించును.

664. నా శస్త్రప్రహారములచే మహాసురుడగు రక్తబీజుని నుండి స్రవించు రక్తబిందువులను వేగముగా నీవు నీ నోటితో గ్రహింపుము.

665. ఆ రక్తము నుండి పుట్టిన మహాసురులను భక్షించుచూ యుద్ధమునందు సంచరించుము. ఈ విధముగా ఈ రాక్షసుడు క్షీణించిన రక్తము కలవాడై నాశనము పొందగలడు.

666. నీవు భయంకరులగు వీరిని భక్షించుచుండ, ఇక రక్తబీజులు నూతనముగా జన్మించరు. మహాసురుడగు రక్తబీజుడీ విధముగా వినాశమును పొందగలడు.

**ఋషి పలికెను.**

667. ఇట్లు పలికిన తరువాత ఆ కౌశికీ దేవి రక్తబీజుని శూలముతో పొడిచెను.

668. కాళి రక్తబీజుని రక్తమును నోటితో గ్రహించెను.

669. అపుడు రక్తబీజుడు ఆ యుద్ధమునందు చండికను వేగముగా గదతో కొట్టెను.

670. ఆ గదాప్రహారము ఆమెకు కొంచెముకూడ బాధను కలిగించలేదు.

671. దేవికూడా ఆ దుర్మార్గుని గదతో పడవేసెను.

672. వాడు గదతో చాముండా దేవిని ముఖమునందు, కటి ప్రదేశమునందు కొట్టెను.

673. వాని యుద్ధవేగమును చూచి, భయంకరమగు పరాక్రమముగల చండిక, ఘోరమగు పరిఘయొక్క అగ్రభాగముతో వానిని వక్షస్థలమునందు కొట్టెను.

674. ఈ విధముగా కొట్టబడిన ఆ రాక్షసునియొక్క దేహమునుండి రక్తము అధికముగా స్రవించెను. వాని దేహావయవములనుండి స్రవించుచున్న ఆ రక్తమును చాముండాదేవి నోటితో గ్రహించు చుండెను.

675. రక్తము పడుటవలన ఆమెయొక్క నోటియందు ఏమహాసురులు పుట్టిరో, వారిని ఆ చాముండాదేవి వెంటనే నమిలి వేసెను. వాని రక్తమును కూడ త్రాగెను.

676. కౌశికీదేవి శూలముతో, వజ్రముతో, బాణములతో, ఖడ్గములతో, రెండు వైపుల ధారగల ఆయుధములతో ఆ రక్తబీజుని కొట్టెను. చాముండాదేవి వాని దేహమునుండి స్రవించిన రక్తమును త్రాగివేసెను.

677. ఓమహారాజా! అనేక శస్త్రములచే కొట్టబడిన మహాసురుడగు ఆ రక్తబీజుడు క్షీణించిన రక్తము గలవాడై భూమిపై పడిపోయెను.

678. మరియు ఆ మాతృగణముచేత ఇతర రాక్షసులనేకులు సంహరింపబడిరి.

679. ఓ రాజా! అపుడా దేవతలు సాటిలేని ఆనందమును పొందిరి.

680. ఆ దేవతలనుండి ఉద్భవించిన మాతృగణము రక్తమదముచే గర్వించి, నాట్యము చేసెను.

681. గంధర్వులు, అప్సరసలు, సిద్ధులు పుష్పములను వర్షించుచూ నాట్యము చేసిరి.

ఇది శ్రీమార్కండేయ మహాపురాణమునందు సావర్ణిక మన్వన్తరగాథలో దేవీమాహాత్మ్యమునందు 'రక్తబీజాసురవధ' యని ప్రసిద్ధిచెందిన, మూలగ్రంథ మంత్రవిభాగరూపమగు నవశతీ మంత్రమాలయందలి అరవ అధ్యాయము సమాప్తమయ్యెను.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః
# సప్తమాధ్యాయము
## ఓం నమశ్చండికాయై

రాజు పలికెను.

682. హే భగవన్! మీరు రక్తబీజాసురవధకు సంబంధించిన దేవి యొక్క విచిత్రమగు, ఈ చరిత్ర యొక్క మాహాత్మ్యమును నాకు చెప్పితిరి.

683. రక్తబీజుడు సంహరింపబడిన తరువాత మిక్కిలి కోపముగల శుంభుడు నిశుంభుడు తిరిగి ఏమి చేసిరో నేను వినగోరుచున్నాను.

ఋషి పలికెను.

684. యుద్ధమునందు రక్తబీజుడు సంహరింపబడగా, ఇతరరాక్షసులు సంహరింపబడుచుండ, శుంభనిశుంభులు అపరిమితమగు కోపమును పొందిరి.

685. అపుడు నిశుంభుడు సంహరింపబడుచున్న మహాసైన్యమును చూచి, కోపించినవాడై, ప్రధానమైన రాక్షస సేనతో దేవివైపుకు పరుగెత్తెను.

686. నిశుంభుని ముందు, వెనుక ప్రక్కల నున్న మహాసురులు కోపముతో క్రింది పెదవిని దంతములమధ్య నొక్కినవారై దేవిని సంహరించుటకు సమీపమునకు వెళ్లిరి.

687. మహాపరాక్రమశాలియగు శుంభుడు కూడ తన సైన్యముతో కూడినవాడై, మాతృగణముతో యుద్ధము చేసి, కోపముతో చండికను సంహరించుటకు వచ్చెను.

688. తరువాత, మేఘములవలె మిక్కిలి భయంకరమగు బాణవర్షమును వర్షించుచున్న శుంభనిశుంభులకు దేవితో తీవ్రమగు యుద్ధము జరిగెను.

689. చండిక తన బాణసమూహములచే, వారిద్దరిచే ప్రయోగింపబడిన బాణములను ఛేదించెను.

689-1 ఆ రాక్షసశ్రేష్ఠులిద్దరిని చండిక ప్రతి అవయవమునందు ఆయుధపరంపరలచే కొట్టెను.

690. నిశుంభుడు వాడియైన కత్తిని, చక్కగా ప్రకాశించుచున్న డాలును తీసుకొని, దేవియొక్క శ్రేష్ఠమగు వాహనమైన సింహమును శిరస్సుపై కొట్టెను.

691. తన వాహనమగు సింహము కొట్టబడగా, దేవి నిశుంభుని శ్రేష్ఠమగు కత్తిని, ఎనిమిది రత్నఘటిత చంద్రాకార చిహ్నములుగల డాలును, వాడియగు బాణముతో వెంటనే ఛేదించెను.

692. డాలు, కత్తికూడ ముక్కలు కాగా, ఆ రాక్షసుడు దేవిపై శక్తిని విసిరెను

693. దేవియు తన ఎదురుగా వచ్చుచున్న శుంభుని ఆ శక్తిని చక్రముతో రెండు ముక్కలు చేసెను.

694. తరువాత కోపముతో మండిపడిన నిశుంభాసురుడు శూలమును గ్రహించి దేవిపై విసరెను.

695. దేవి తనమీదకు వచ్చిన ఆ శూలమును పిడికిలితో కొట్టి ముక్కలు చేసెను.

696. తరువాత ఆ నిశుంభుడు గదను ఎత్తి చండికపై విసరెను.

697. ఆ గద దేవియొక్క త్రిశూలముచే భేదింపబడి చూర్ణము అయ్యేను.

698. తరువాత గొడ్డలిని చేతబట్టి వచ్చుచున్న ఆ రాక్షసశ్రేష్ఠుడగు నిశుంభుని, దేవి బాణసమూహములచే మూర్ఛితుని చేసి భూమిపై పడవేసెను.

699. భయంకరమగు పరాక్రమము గల తన సోదరుడు ఆ నిశుంభుడు నేలపై బడగా శుంభుడు మిక్కిలి కోపించినవాడై, అంబికను సంహరించుటకు ముందుకు వెళ్లెను.

700. అపుడు రథమునందున్న ఆ శుంభుడు మిక్కిలి ఉన్నతమైనట్టియు, ఉత్తమ మగు ఆయుధములను ధరించినట్టియు, సాటిలేని ఎనిమిది భుజములతో ఆకాశమునంతను వ్యాపించి ప్రకాశించెను.

701. తనమీదకు వచ్చుచున్న ఆ శుంభుని చూచి, దేవి శంఖమును పూరించెను.

702. మరియు దేవి ధనస్సుయొక్క నారిత్రాడు యొక్క మిక్కిలి దుస్సహమగు శబ్దమును కూడ చేసెను.

703. దేవి తనఘంటల ధ్వనితో దిక్కులను నింపివేసెను. ఆ ధ్వని సమస్త రాక్షస సైన్యముల యొక్క తేజస్సును క్షీణింపజేసెను.

704. తరువాత సింహము, గజములచే భయమువలన తమ మదమును పరిత్యజింప చేయజాలిన మహానాదములతో ఆకాశమును, భూమిని, మరియు పది దిక్కులను పూరించెను.

705. అపుడు కాళి (చాముండా) ఆకసమునకెగిరి, తిరిగి క్రిందకు గెంతి, చేతులతో భూమిని బాదెను.

706. ఆ ధ్వనిచే అంతకు ముందున్న ధ్వనులన్నియు అంతర్హితములయ్యేను.

707. శివదూతి శత్రువులకు అమంగళకరమగు పెద్ద అట్టహాసమును చేసెను.

708. ఆ శబ్దములచే రాక్షసులు భయపడిరి. శుంభుడు తీవ్రమగు కోపమును పొందెను.

708-1 కౌశికీదేవి శుంభుని గూర్చి "ఓరీ దుర్బుద్ధీ! నిలు, నిలు" అని పలుకగానే, అంతరిక్షమందున్న దేవతలు జయ జయ ధ్వానములు చేసిరి.

709. శుంభుడు ముందుకు వచ్చి, జ్వాలలతో మిక్కిలి భయమును గొల్పు శక్తిని ప్రయోగించెను. అగ్నిరాశివలె మీదకు వచ్చుచున్న ఆశక్తిని దేవి మహోల్క యను స్వీయశక్తిచే నిర్వీర్యము చేసెను.

710. ఓరాజా! శుంభుని యొక్క సింహనాదముచే ముల్లోకములు వ్యాప్తములయ్యెను. ఉల్కలను వర్షించు ఉత్పాత మేఘములయొక్క గర్జనశబ్దము ఆ సింహనాదమును అతిక్రమించెను.

711. దేవి శుంభునిచే ప్రయోగింపబడిన వందలాది వేలాది బాణములను, అటులనే శుంభుడు ఆమెచే ప్రయోగింపబడిన బాణములను, తమతమ భయంకరము లగు బాణములచే ఛేదించిరి.

712. అపుడా చండిక కోపించినదై వానిని శూలముతో పొడిచెను.

713. శూలముచే పొడువబడిన ఆ శుంభుడు మూర్ఛితుడై నేలమీద పడెను.

714. అపుడు నిశుంభుడు తెలివిని పొంది, ధనస్సును గ్రహించి, బాణములతో కౌశికీ దేవిని, కాళీదేవిని, సింహమును కూడ కొట్టెను.

715. మరియు, దితివంశ్యుడు, రాక్షసశ్రేష్ఠుడునగు నిశుంభుడు మాయచే పదివేల బాహువులు పొంది, పదివేల చక్రాయుధములతో చండికను కప్పివేసెను.

విశేషాంశములు: దితిపుత్రులు దైత్యులు. దనుపుత్రులు దానవులు. ఇట్లు మాతృభేదమున్నను, దేవశత్రుత్వము రెండు వంశముల వారికి సమానమే గనుక, సామాన్యాకారముగ రాక్షసులను బోధించుటకై దైత్యదానవ శబ్దములు ప్రయోగింపబడును. అమరకోశముకూడ అట్లే చెప్పెను. "అసురా దైత్యా దైతేయ దనుజేంద్రారిదానవాః".

716. అపుడు రాక్షసపీడను తొలగించు ఆ భగవతియగు 'దుర్గ' (కౌశికి)కోపించి, ఆ చక్రములను, వాడు ప్రయోగించిన బాణములను తన బాణములచే ఛేదించెను.

717. అపుడు రాక్షస సేనలతో పరివారితుడైన నిశుంభుడు వేగముగా గదను తీసుకొని చండికను సంహరించుటకై ఆమె పైకి పరుగెత్తెను.

718. నిశుంభుడు తన మీదకు వచ్చుచుండగనే, చండిక వెంటనే వాని చేతి యందలి గదను తీక్ష్ణధారగల ఖడ్గముచే ఛేదించెను.

719. నిశుంభుడు శూలమును తీసు కొనెను.

720. చండిక, వేగముగా ప్రయోగింప బడిన శూలముచే, శూలమును చేత బట్టి వచ్చుచున్న దేవహింసకుడగు నిశుంభుని వక్షస్థలమును చీల్చి వేసెను.

721. శూలముచే చీల్చబడిన హృదయము గల నిశుంభుని హృదయము నుండి మహాబలుడు, గొప్ప పరాక్రమశాలియగు మరియొక రాక్షసుడు "నిలు" అని పలుకుచూ, బయటకు వచ్చెను.

722. అపుడు దేవి నవ్వి బయటకు వచ్చుచున్న ఆ పురుషుని శిరస్సును పెద్ద శబ్దము కల్గు విధముగా కత్తితో నరికెను.

723. అపుడా రాక్షసుడు నేల గూలెను.

724. అపుడు సింహము తన వాడి కోరలతో రాక్షసుల మెడలను చీల్చి, చంపి, నమిలివేసెను.

725. కాళియు కొందరు రాక్షసుల నట్లే చేసెను.

726. శివదూతియు మరి కొందరు రాక్షసులనట్లే చేసెను.

727. కొందరు మహాసురులు కౌమారీ దేవి చేత శక్తి అను అయుధముచే చీల్చబడి నవారై మరణించిరి.

728. బ్రహ్మాణి, మంత్రముచే పవిత్ర మైన జలమును ప్రోక్షించగా, కొందరు రాక్షసులు పారి పోయిరి.

729. మరి కొందరు మాహేశ్వరి యొక్క త్రిశూలముచే చీల్చ బడిన వారై మరణించిరి.

730. కొందరు రాక్షసులు వారాహి యొక్క తుండప్రహారముచే చూర్ణమై నేలగూలిరి.

731. వైష్ణవి చక్రముతో రాక్షసులను ముక్కలు ముక్కలుగా నరికెను.

732. ఐంద్రియొక్క చేతినుండి విడువ బడిన వజ్రముచే మరికొందరు రాక్షసులు ఖండ ఖండములుగా చేయబడిరి.

733. కొందరు మహాసురులు నారసింహిచే గోళ్లతో చీల్చి వేయబడిరి.

734. కొందరు రాక్షసులు భయము వలన మరణించిరి.

735. మరి కొందరు ఆ మహా యుద్ధము నుండి పారి పోయిరి.

736. మరి కొందరు కాళి, శివదూతి, సింహములచే భక్షింప బడిరి.

**ఋషి పలికెను.**

737. ప్రాణప్రియుడగు సోదరుడైన నిశుంభుడు సంహరింప బడుటను, రాక్షస సైన్యము సంహరింపబడు చుండుటను చూచి, కోపించిన శుంభుడిట్లు పలికెను.

738. బల గర్వముచే దుష్టురాలవగు ఓ దుర్గా! గొప్ప అభిమానవతివగు నీవు ఇతరుల బలమును ఆధారముగా చేసుకొని యుద్ధము చేయుచుంటివి. అట్టి నీవు గర్వమును పొందకుము.

**దేవి ఇట్లు పలికెను.**

739. ఒరీ! దుష్టుడా! ఈ జగత్తునందు నేనొక్కతెనే ఉన్నాను. నా కంటె భిన్నమైనతత్త్వమేది గలదు? చూడుము. ఈ కాళి మొదలగు నా విభూతులు నా యందే ఉపసంహృతములగు చున్నవి.

విశేషాంశములు: ఈ మంత్రార్థమును సమయమత పారదృశ్వయగు శ్రీమచ్ఛంకరాచార్యులు సౌందర్య లహరిలో ఇట్లు వర్ణించిరి.

'మనస్త్వం వ్యోమత్వం మరుదసి మరుత్సారథిరసి
త్వమాపస్త్వం భూమిస్త్వయి పరిణతాయాం న హి పరమ్||

అనగా పంచభూతాత్మక కార్య పరిణామమంతయు నీవే . నీవే విరాడ్రూప ముగా వృద్ధి పొందితివి. నీ కంటె భిన్నమైన తత్త్వమేమియు లేదు.

ఇందుచేతనే దేవిని "కబలీ కృత నిశ్శేషతత్త్వగ్రామస్వరూపిణీ" అని స్మృతులు వర్ణించెను.

'విశేషణ భూతిః భవనం విభూతిః' అను వ్యుత్పత్తిచే సర్వవ్యాపియగు పరబ్రహ్మము విశేషముగా. ఏ స్థానమునందు ప్రకటితమగునో, అది విభూతి యనబడును. సూర్యుడు, చంద్రుడు, వరుణుడు, ఇత్యాదులు పరమాత్మ విభూతులుగా భగవద్గీత యందు వర్ణింపబడెను. అదే రీతిని, ఈ మంత్రము కాళి, శివదూతి మొదలగు మాతృగణాంతర్గతములగు శక్తులన్నియు దేవి విభూతులే అని స్పష్టపరచు చున్నవి.

మహామాయా ప్రభావముచే దేవి కంటే భిన్నముగా ప్రకటమగు ఈ ఈ విభూతులు తమ తమ కార్యములను నిర్వర్తించి, తిరిగి స్వస్వరూపమునందు లీనమగును.

ఋషి పలికెను.

740. అపుడు బ్రహ్మాణి మొదలగు శక్తులన్నియు ఆ దేవి యొక్క దేహమునందు విలీనము కాగా, అపుడు అంబిక ఒక్కతెయే ఉండెను.

దేవి పలికెను.

741. నేను ఇచట నా విభూతి చేత అనేకరూపములతో ఉంటిని. ఇపుడవి అన్నియు నాచే ఉపసంహారింప బడినవి. నే నొక్కతెనే యుద్ధమునందు నిలబడి యున్నాను. నీవు పారిపోక స్థిరముగా నిలువుము.

ఋషి పలికెను.

742. అపుడు సమస్త దేవతలు, రాక్షసులు చూచుచుండగా, దేవి, శుంభుడు, వీరిద్దరికి భీషణమగు యుద్ధము ప్రారంభమయ్యెను.

743. బాణముల వర్షములతో, పదునైన ఆయుధములతో, మరియు, భయంకరమగు అస్త్రములతో వారిద్దరికి సమస్తలోకములకు భయమును గొల్పు అతిశయించిన యుద్ధము జరిగెను.

744. అంబిక వందలాది దివ్యాస్త్రములను ప్రయోగించెను. రాక్షస శ్రేష్ఠుడగు శుంభుడు వాటికి ప్రతీకారము చేయు అస్త్రములచే వాటిని భంగము కావించెను.

విశేషాంశము: అగ్నేయాస్త్రమునకు పార్జన్యాస్త్రము, పార్జన్యమునకు వాయవ్యము, వాయవ్యమునకు పార్వతము, పార్వతమునకు వజ్రాస్త్రము ఇత్యాదులు ప్రతీకారములన బడును.

745. శుంభుడు కూడ దేవిపై దివ్యాస్త్రములను ప్రయోగించెను. పరమేశ్వరి వాటిని భీషణమగు హుంకారమును ఉచ్చరించుట ఇత్యాది విధములచే అవలీలగ భగ్నము కావించెను.

విశేషాంశము: దేవి ప్రయోగించిన అస్త్రములను శుంభుడు ప్రతీకారాస్త్రములచే వారించగా, శుంభుని అస్త్రములను దేవి లీలగా హుంకారమాత్రము చేతనే వారించెను. ఇది దేవియొక్క మహిమాధిక్యమును నిరూపించును.

746. ఓ రాజా! దేవి, శుంభుడు భయంకరమగు యుద్ధము చేయుచుండగా, వేయి దివ్యసంవత్సరములు గడిచెను.

747. అపుడు విమానములందున్న దేవతలు, మహర్షులు ఇట్లు సంభాషించిరి. "ఇట్టి యుద్ధము పూర్వమెన్నడును జరుగలేదు. భవిష్యత్తులో జరుగ బోదు."

748. అపుడు శుంభుడు వందలాది బాణములతో దేవిని కప్పి వేసెను.

749. దేవి కూడ ఆ శుంభునిపై కోపించి, బాణములతో వాని ధనస్సును విరుగ కొట్టెను.

750. ధనస్సు విరిగిన వెంటనే ఆ రాక్షసేశ్వరుడు శక్తి అను ఆయుధమును తీసుకొనెను.

751. ఆ శక్తి వాని చేతిలో నుండగనే దేవి దానిని చక్రముతో ఛేదించెను.

752. తరువాత రాక్షస చక్రవర్తియగు శుంభుడు ప్రకాశించుచున్న ఖడ్గమును, డాలును తీసుకొని ఆ దేవిపైకి పరుగెత్తెను.

753. వాడు మీదకు వచ్చుచుండగనే చండిక వెంటనే ధనస్సు నుండి ప్రయోగింప బడిన వాడి బాణములతో కత్తిని, సూర్యకిరణములవలె స్వచ్ఛమగు డాలును ఛేదించెను.

754. మరియు దేవి వాని గుర్రములను, రథమును సారథితో సహా పడగొట్టెను.

755. అపుడు చంపబడిన గుర్రములు, విరిగిన ధనస్సు, మరణించిన సారథిగల ఆ రాక్షసుడు అంబికను వధించు ప్రయత్నము గలవాడై, భయంకరమగు ముద్గరమను ఆయుధమును తీసుకొనెను.

756. మీదకు వచ్చుచున్న ఆ శుంభుని యొక్క ముద్గరమును చండిక వాడి బాణములతో ముక్కలుగా చేసెను.

757. అయినను, ఆ శుంభుడు పిడికిలి బిగించి, వేగముగా ఆమెపైకి పరుగెత్తెను.

758. రాక్షస శ్రేష్ఠుడగు ఆ శుంభుడు దేవి యొక్క వక్షస్థలము నందు పిడికిలితో కొట్టెను.

759. ఆ దేవి కూడ వానిని అరచేతితో వక్షస్థలము నందు కొట్టెను.

760. దేవి యొక్క అరచేతితో కొట్టబడిన వాడై శుంభుడు నేలపై పడెను.

761. ఆ రాక్షస వీరుడు పడిన వెంటనే తిరిగి లేచెను.

762. శుంభుడు పైకి లేచి దేవిని పట్టుకొని ఆకాశములోనికి ఎగిరెను.

763. ఆ చండిక ఆకాశములో కూడ ఏ ఆధారము లేకుండగనే వానితో పోరాడెను.

764. అచట ఆకాశము నందు శుంభుడు, చండికయు ముందుగా అన్యోన్యము బాహు యుద్ధమును చేసిరి. ఆ యుద్ధము సిద్ధులకు, మహర్షులకు ఆశ్చర్యమును కలిగించెను.

765. తరువాత అంబిక చాలసేపు వానితో బాహు యుద్ధము చేసి, వాని కాళ్లను పట్టి పైకెత్తి, గిరగిర త్రిప్పి, నేలపై బడ వేసెను.

766. అట్లు పడవేయ బడిన దురాత్ముడగు ఆ శుంభుడు భూమిపై తిరిగి లేచి, పిడికిలిని బిగించి, చండికను సంహరించు కోరికతో వేగముగా పరుగెత్తెను.

767. అపుడు దేవి తన మీదకు వచ్చుచున్న ఆ రాక్షస చక్రవర్తిని, శూలముతో వక్షస్థలమును చీల్చి, నేలపై బడ వేసెను.

768. దేవి యొక్క శూలాగ్రముచే పొడవబడిన ఆ శుంభుడు ప్రాణములను కోల్పోయి, సముద్రములు, ద్వీపములు, పర్వతములతో కూడిన భూమినంతనూ కంపింప జేయుచూ, నేల గూలెను.

769. దుర్మార్గుడగు ఆ శుంభుడు సంహరింపబడినంతనే, సమస్తమైన జగత్తు ఆనందమును, శాన్తిని పొందెను. ఆకాశము కూడ నిర్మలమయ్యెను.

770. ఆ శుంభుడు సంహరింపబడగా, అంతకు ముందు నుండి ఉన్నట్టియు, ఉల్కలతో కూడినట్టియు, అశుభమును సూచించునట్టియు, రక్తాదులను వర్షించు మేఘములు తొలగిపోయెను. మరియు నదులు తమతమ మార్గములలో ప్రవహింపజొచ్చెను.

771. ఆ శుంభుడు సంహరింపబడగా, దేవతా గణములన్నియు ఆనందముతో నిండిన మనస్సు గలవారైరి.

772. గంధర్వులు మధురముగా గానము చేసిరి.

773. మరికొందరు వాద్యములను వాయించిరి.

774. అప్సర స్త్రీలు నాట్యము చేసిరి.

775. మరియు, సుఖకరములగు వాయువులు వీచినవి.

776. సూర్యుడు చక్కని ప్రకాశము కల వాడాయెను.

777. చల్లారిన అగ్నులు తిరిగి ప్రజ్వరిల్లినవి.

778. దిక్కులయందు బయలుదేరిన ధ్వనులు అణిగినవి.

779. అంతరిక్షము నందు విమానములలో నున్న దేవతలు పూలవానలను గురిపించిరి.

780. ధర్మకార్యములు తిరిగి ప్రవర్తిల్లెను. దేవతలు తిరిగి హవిర్భోక్తలైరి.

ఇది శ్రీ మార్కండేయ మహా పురాణము నందు సావర్ణిక మన్వంతర గాథలో దేవీ మాహాత్మ్యము నందు 'నిశుంభ, శుంభవధ' యని ప్రసిద్ధి గాంచిన, మూల గ్రంథ మంత్ర విభాగ రూపమగు నవశతీ మంత్రమాల యందలి ఏడవ అధ్యాయము సమాప్తమయ్యెను.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః
# అష్టమాధ్యాయము
# శ్రీ ఆద్యాది మహాదేవీ కాత్యాయనీ సూక్తము
## ఓం నమశ్చండికాయై

ఋషి పలికెను.

781. ఆ రాక్షస శ్రేష్ఠుడగు శుంభుడు దేవిచే సంహరింపబడగనే, ఇంద్రుడు, అగ్ని మొదలుగా గల దేవతలు తమ కోర్కె సిద్ధించుటచే వికసించిన ముఖముల కాంతులచే ప్రకాశింప చేయ బడిన దిక్కులు గలవారై, కాత్యాయనిని స్తుతించిరి.

## శ్రీనారాయణీస్తుతి

దేవతలు పలికిరి.

782. శరణు పొందిన వారి దుఃఖములను తొలగించు ఓ దేవీ! ప్రసన్నురాలవుకమ్ము.

783. హే సకల. జగన్మాతా! ప్రసన్నురాలవు కమ్ము.

784. హే విశ్వేశ్వరీ! విశ్వమును రక్షింపుము.

785. ఓ దేవీ! స్థావర జంగమాత్మకమగు జగత్తునకు నీవే ప్రభ్వివి.

786. జయింపశక్యము కాని పరాక్రమము గల ఓ దేవీ! నీవు పృథివీ రూపమున ఉన్నావు. కనుకనే స్థావరజంగమాత్మకమగు జగత్తునకు నీవు ఒక్కతెవే ఆధారమై ఉన్నావు. జలరూపమున నున్న నీ చేతనే ఈ జగత్తు వృద్ధి పొందింప బడు చున్నది.

**విశేషాంశములు:** పృథివి దేవీ రూపమే కనుకనే, భూమిని ఎవరైన తన్నుచో, సంప్రదాయ వేత్తలు నిషేధింతురు. ఉదయము నిద్ర లేచిన తర్వాత పాదములను నేలపై మోపునపుడు "పాద స్పర్శం క్షమస్వమే" అని ప్రార్థించవలెను. భూమిని దున్నునపుడు గాని, త్రవ్వునప్పుడు గాని నమస్కరించి, క్షమాపణ కోరి ప్రారంభించవలెను. ఈ విషయములో "మాతా భూమిః పుత్రోZహంపృథివ్యాః" అను శ్రుతి ప్రమాణము.

పృథివి దేవీ రూపము గనుకనే, మనము జన్మించిన భూమిని 'మాతృభూమి' యని వర్ణింతుము. తత్త్వవేత్తయగు రవీంద్రనాథ్ ఠాగూరు మాతృభూమిని ఇట్లు స్తుతించెను. "దేవి భువన మన మోహినీ నీల సింధుజల ధౌతచరణ తల". 'వందే మాతరం' గీతంలో ఈ భూమియే సర్వదేవతా స్వరూపంగా కీర్తింపబడింది.

"త్వంహి దుర్గా దశప్రహరణ ధారిణీ కమలా కమలదల విహారిణీ వాణీ విద్యాదాయినీ".

యోగి అరవిందులు ఇట్లా అన్నారు. "మాతృదేశం మట్టి ముద్దకాదు. జడ పదార్థం కాదు. సాక్షాత్తు జగజ్జననీ స్వరూపమే".

జలములు కూడ దేవీ స్వరూపమే. శ్రుతి ఇట్లు చెప్పుచున్నది. "శివేన మా చక్షుషా పశ్యతాపశ్శివయా తనువోపస్పృశత త్వచం మే", ఓ జలములారా! మీ మంగళకరమగు చూపుతో నన్ను చూడుడు. మీ శివాస్వరూప మగు తనువుతో నన్ను స్పృశింపుడు", కాన జలములను పాదములతో తన్నరాదు. జలములయందు నిష్ఠీవనాదికము మహాదోషము.

787. నీవు అనంతపరాక్రమముగల వైష్ణవీ శక్తివి.

788. నీవే జగత్తు యొక్క సృష్టిస్థితిలయములకు హేతువు.

789. నీవు సర్వోత్తమమగు మూల ప్రకృతివి. ఈ జగత్తంతయు నీ చేత మోహింప చేయ బడుచున్నది.

790. నీవు ప్రసన్నురాలవైనచో ఈ లోకమునందే మోక్షమును ఇచ్చెదవు.

791. ఓ దేవీ! విద్యలన్నియు నీ అంశలే.

**విశేషాంశములు:** విద్యలు పదు నెనిమిది. అవి యేవన నాల్గు వేదములు. ఋగ్వేదము, యజుర్వేదము, సామ వేదము, అథర్వణవేదము. వేదాంగములు ఆరు. ఛందస్సు, కల్పము, జ్యోతిషము, నిరుక్తము, శిక్ష, వ్యాకరణము. ఇవి కాక మీమాంస, న్యాయము, ధర్మశాస్త్రము అను శాస్త్రములు,పురాణములు, ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వవేద, శస్త్రాస్త్రవేదములు కలిపి మొత్తం పదునెనిమిది.

792. లోకములందలి స్త్రీలందరు నీ కళలు, అనగా అంశలతో కూడి యుందురు.

**విశేషాంశములు:** భారత సంప్రదాయములో స్త్రీకి ప్రత్యేకస్థానము గలదు. ఆమె దేవీ రూపముగా గౌరవింపబడును. పరాశరస్మృతి ఇట్లు చెప్పెను.
"స్త్రియో రుష్టాస్త్రియస్తుష్టా రుష్టాస్తుష్టాస్తు దేవతాః|
వర్ధయన్తి కులం తుష్టా నాశయంత్యవమానితాః||"
స్త్రీలు కోపించిన, దేవతలు కోపింతురు. స్త్రీలు సంతోషించిన, దేవతలు సంతోషింతురు. సంతోషముతో నున్న స్త్రీలు కులమునకు అభివృద్ధి కలిగింతురు. స్త్రీలు అవమానింప బడినచో కులము నాశనమగును. మనుస్మృతి ఇట్లు చెప్పెను. "యత్ర నార్యస్తు పూజ్యన్తే మోదన్తే తత్ర దేవతాః ", అనగా, స్త్రీలు గౌరవింపబడు చోట దేవతలు సంతసింతురు.

"దేవ్యా ఉపాసకైః పుంభిస్త్రియో నింద్యా న జాతుచిత్|
దేవీవన్మాననీయాశ్చ దేవ్యంశాస్తా యతస్స్మృతాః||

అనగా, దేవీ ఉపాసకులగు పురుషులు స్త్రీల నెన్నడు నిందించరాదు. వారిని దేవిని వలె గౌరవించవలెను. ఏలయన, వారు దేవి యొక్క అంశలే. గీతా వాద్యాది చతుష్షష్టి కళలు. సకలా; అనిన్నీ, శ్రద్ధా ప్రీత్యాది షోడశ కామ కళలు సమస్తా; అనిన్నీ, పద్మిన్యాది లక్షణ లక్షితాః అని స్త్రీల యందుకల భేధములు; ఈ శ్లోకమునందు వివరింపబడినది.

793. జగజ్జనని వగు నీచేత మాత్రమే ఈ జగత్తంతయు వ్యాప్తమై యున్నది.

విశేషాంశము: 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'నేహ నానాస్తి కించన' అను శ్రుతులు ఈ మంత్రార్థమునే చెప్పును.

794. నిన్ను యథార్థముగా స్తోత్రము చేయగల ఉత్తమ వాక్కు ఎట్లు ఘటించును?

విశేషాంశము: "యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ" అని శ్రుతిచే వర్ణింప బడిన పరబ్రహ్మను ఏ వాక్కులు వర్ణింప గలవు?

795. ఓ దేవీ! 'నీవే సర్వభూతాత్మికవు. నీవే భుక్తిని, ముక్తిని ఇచ్చుదానవు' అని నీవు మాచే స్తుతింపబడగా, ఇతోZధికములగు స్తుతి పరములైన వాక్కులేమి యుండును?

796. సర్వజనుల యొక్క హృదయము నందు బుద్ధి రూపమున నుండి, స్వర్గ మును, మోక్షమును ఇచ్చు ఓ దేవీ! నారాయణీ! నీకు నమస్కారము.

విశేషాంశము: నిశ్చయాత్మకమగు అంతః కరణ వృత్తి బుద్ధి యనబడును. జడ మగు అంతః కరణము స్వతంత్రముగ జ్ఞానమును గ్రహించ లేదు. అంతః కరణము నందు చిదంశము ప్రతి ఫలించి, జ్ఞేయాకార వృత్తి రూపముగ పరిణమించుచుండును. అ చిదంశము చిద్ఘనమగు దేవియే గనుక, అంశాంశి భావము ఉపాధి కృతము గనుక, దేవియే బుద్ధిరూపమున నున్నది.

వేదోక్తమగు కర్మ విద్యకు స్వర్గము ఫలము, బ్రహ్మవిద్యకు ఆత్యన్తిక సంసారో పరమ రూపమగు మోక్షము ఫలము. ఇట్టి రెండు విధముల ఫలమును అ పరమేశ్వరియే జీవులకు వారి సుకృతము ననుసరించి అనుగ్రహించును.

"నరాణామయనం నారాయణః" అనగా సమస్త జీవులకు లయ స్థానము నా రాయణుడు. నారాయణుని శక్తియే నారాయణీ యన బడును. ఈ అధ్యాయము నకు మహా గరుడ వాహినియగు వైష్ణవి దేవత. ఈ స్తోత్రమునకు నారాయణీ స్తుతి అనియు పేరు గలదు.

797. ఓ నారాయణీ ! నీవే కళా, కాష్ఠా, క్షణ, నిమేష, అహో, రాత్రి, పక్ష, మాస, ఋతు, సంవత్సరములనే కాలావయవరూపమున సమస్త జగత్తునకు వృద్ధి క్షయములను కలిగించుచున్నావు. సర్వజగత్తును నీయందే లయము చేసుకొన గల సామర్థ్యము గల దానవు. నీకు నమస్కారము.

798. హే భవానీ! నీవు సర్వమాంగళిక వస్తువులకు మాంగల్యమునిచ్చు దానవు. నీవే సర్వకార్యములను సాధించుట యందు హేతుభూతురాలవు. నీవు భక్తుల ను రక్షింప సమర్థురాలవు. మూడు నేత్రములు గల ఓ దేవీ! నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

విశేషాంశములు: లోకములో మంగళము లెనిమిదియని భావప్రకాశములో చెప్ప బడెను. అవి బ్రహ్మవేత్త, గోవు, అగ్ని, బంగారము, వెన్న, సూర్యుడు, స్త్రీలు, రాజు. జ్యోతిశ్శాస్త్రమునందు- పెరుగు, నెయ్యి, పాలు, సిద్ధార్థము, పసుపు, తులసి, అదము, పుష్పము, బిల్వపత్రము, సువాసిని మంగళములని చెప్పబడెను.

ఇట్టి సర్వమంగళ వస్తువులకు మూలమగు పరబ్రహ్మము పరమ మంగళము.

"అశుభాని నిరాచష్టే తనోతి శుభసంతతిమ్|

స్మృతి మాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగళం పరమ్||

అతికల్యాణ రూపత్వాత్ నిత్యకల్యాణసంశ్రయాత్|

స్మర్తౄణాం వరదత్వాచ్చ బ్రహ్మ తన్మంగలం పరమ్||"

అని చెప్ప బడిన పరబ్రహ్మము దేవియే. అత్రిస్మృతియందు "ప్రశస్తా చరణం నిత్యమప్రశస్త వివర్జనమ్, ఏతద్ధి మంగళం ప్రోక్తమృషిభిర్బ్రహ్మ వాదిభిః" అని చెప్ప బడెను. నిత్యము ధర్మము నాచరించుట, అధర్మమును విడిచి పెట్టుట ఇవియే మంగళములు. ఇట్టి మంగళములు దేవ్యనుగ్రహముచే సిద్ధించును. ఇది ప్రశస్తమైన మంత్ర రాజము.

799. నీవే సృష్టి స్థితి లయములకు హేతువు. నీవు నిత్యురాలవు. సత్త్వరజస్తమో గుణములకు నీవే ఆశ్రయము. ఆ గుణములు కూడ నీరూపమే. ఓ నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

విశేషాంశము: సత్త్వరజస్తమోగుణాశ్రయ అగు దేవియే త్రిమూర్తి రూపముగ జగత్తు యొక్క సృష్టి స్థితి సంహారములను చేయునని లలితా సహస్ర నామములలో చెప్పబడెను.

"సృష్టి కర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిందరూపిణీ|
సంహారిణీ రుద్రరూపా తిరోధాన కరీశ్వరీ||"

'అగుణమయే' అనగా 'నిర్గుణే' అనికూడ అర్థము చెప్పవచ్చును.

800. నీవు శరణు కోరిన దరిద్రులను, రోగాదిపీడితులను రక్షించుట యందు తత్పరురాలవు. నీవు సర్వలోకముల పీడను నివారించెదవు. ఓ దేవీ! నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

విశేషాంశము: "భక్త ప్రియా భక్తి గమ్యా భక్తి వశ్యా భయాపహా|" 'దారిద్ర్యదుఃఖదహనా', 'సర్వరోగ ప్రశమనీ' అనియు లలితా సహస్రనామము వర్ణించుచున్నది.

801. నీవు బ్రహ్మాణీ రూపమును ధరించి హంసలతో కూడిన విమానము నందున్న దానిపై కమండలము నందలి జలమును ప్రోక్షించెదవు. ఓ దేవీ! నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

802. నీవు మాహేశ్వరీ రూపముతో త్రిశూలమును, చంద్రకళను, సర్పములను (శేషుడొసంగిన అత్యుత్తమ రత్నాలంకృత సర్పహారము) ధరింతువు. మహా వృషభము నీవాహనము. ఓ నారాయణీ! నీకు నమస్కారమగుగాక.

803. నీవు కౌమారీ రూపముతో నున్న దానవై మయూరము, కుక్కుటములతో కూడి యుందువు. శక్తియను గొప్ప ఆయుధమును ధరింతువు. పవిత్రురాలవగు ఓ నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

804. నీవు వైష్ణవీ రూపముతో శంఖము, చక్రము, గద, శార్ఙ్గధనస్సు అను గొప్ప ఆయుధములను ధరింతువు. ఓ నారాయణీ! ప్రసన్నురాలవు కమ్ము. నీకు నమస్కారమగు గాక!

805. నీవు వారాహీరూపముతో భయంకరమగు సుదర్శన మహాచక్రమును ధరించి, కోరలతో భూమిని ఉద్ధరించితివి. ఓ మంగళస్వరూపిణీ! నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

806. నీవు భయంకరమగు నృసింహరూపముతో రాక్షసులను సంహరించుటలో ఉద్యుక్తురాల వైతివి. నీవు ముల్లోకములను రక్షించుటలో నిత్యయుక్తురాలవు. ఓ నారాయణీ ! నీకు నమస్కారమగు గాక!

807. నీవు కిరీటమును, గొప్పవజ్రమును ధరించి, వేయి నేత్రములతో ప్రకాశించుచూ, వృత్రాసురుని సంహరించిన ఐంద్రీ శక్తివి. ఓ నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

**విశేషాంశములు:** వృత్రాసురుని చంపినది ఇంద్రుడుకాదు. ఇంద్రుని యందు శక్తి రూపమున నున్న దేవియే అని భావము.

808. నీవు శివదూతీ రూపముతో రాక్షస సంహారము చేసితివి. గొప్ప బలము, భయంకరమగు రూపము, మహానాదము గల శివదూతివి నీవే. ఓ నారాయణీ! నీకు నమస్కారము.

809. దంష్ట్రలచే భీకరమగు ముఖము కల్గినట్టియు, శిరోమాల అలంకారముగా గల్గినట్టియు, ముండాసురుని సంహరించిన చాముండవు నీవే. ఓ నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

**విశేషాంశములు:** "శిరోమాలా విభూషణే" అను పదమునకు తలల పేరును అభరణముగా ధరించినది అనిన్నీ, నరశిరస్సులను మాలగా వేసుకొని అలంకరించు కొన్నదని అని వ్యాఖ్యానించుట సమంజసము కాదు. తలయందు ధరించుటకు పాలసముద్రునిచే ఒసంగబడిన దివ్యశిరోరత్నము, అర్ధచంద్రాభరణము మొదలగు శిరోభూషణములు ధరించిన దానవు అని చెప్పుట సమంజసము. సమయాచార సమ్మతము. 186-562 మంత్రార్థము లను గమనింపుడు.

810. కాల రాత్రి రూపముగా ముల్లోకములను నశింపజేయుటకు ఉద్యుక్తురాలగు మహాకాళివి నీవే. ఓ మహా శక్తీ! నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

811. ఓ మహాలక్ష్మీ! మంగళస్వరూపురాలా! శాన్తరూపిణీ! సర్వసిద్ధులకు నీవే 816
మూలము. నీవు పరాజయము నెరుగవు. మోహరాత్రివి నీవే. గొప్పపరాక్ర
మము గల ఓ నారాయణీ! నీ కొరకు నమస్కారమగు గాక!

812. నీవే లక్ష్మివి. లజ్జ నీ రూపమే. బ్రహ్మ విద్య నీ రూపమే. నీవే శ్రద్ధవు.
పుష్టివి. స్వధవు. నీవు నిత్యవు. నీవే మహారాత్రివి. మహామాయవు. ఓనారాయణీ!
నీకు నమస్కారమగు గాక!

విశేషము: మంత్రము 343, 'లజ్జ' నందలి వ్యాఖ్యానము చూడుడు. 817.

813. నీవు మేధవు. సర్వస్వతివి. శ్రేష్ఠురాలవు. సంపద నీ రూపమే. నీవు రుద్రుని
శక్తివి. నీవు తపస్సు చే ప్రకాశించు దానవు. భాగ్యము నీ రూపమే. నీవు 818.
సర్వకర్మ సమర్థురాలవు. ఓ నారాయణీ! అనుగ్రహింపుము. నీకు నమస్కార
మగు గాక!

814. సర్వత్ర చేతులు, పాదములు, కన్నులు, తలలు, నోళ్లు, చెవులు, ముక్కులు 819.
గల ఓ నారాయణీ! నీకు నమస్కారము.

విశేషాంశములు: సర్వప్రాణి సమష్టి రూపమగు 'విరాట్' అనబడు బ్రహ్మాండ దేహము నారాయణీ రూపమే. సర్వప్రాణుల పాణిపాదాద్యవయములు ఆ బ్రహ్మాండ దేహాంతర్గతములే గాన, దేవీ దేహాంతర్భాగములుగనే వర్ణింపబడినవి. ఈ మంత్రము 'విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోహస్త ఉత విశ్వత స్పాత్" అను వేదమంత్రమునకు అనువాదము.

815. సమస్త ఇంద్రియముల గుణములయందు నీవు ప్రతిబింబ రూపమున నున్నావు. 820.
నీకు ఇంద్రియముల సంపర్కము లేదు. ఇంద్రియగోచరములగు శబ్దస్పర్శ
రూప రస గంధములు అను విషయముల తత్త్వము నీకెరుకయే. ఓ నారాయణీ! 821.
నీకు నమస్కారమగు గాక!

విశేషాంశములు: ప్రాణుల ఇంద్రియములకు అనుగ్రాహకములగు దేవతా
రూపములు శ్రుతిస్మృతులలో ప్రసిద్ధములే. శరీరమునకు పృథివి దేవత.
అహంకారమునకు రుద్రుడు, శ్రోత్రమునకు దిక్కు, త్వగింద్రియమునకు 822.
వాయువు, చక్షురింద్రియమునకు ఆదిత్యుడు, జిహ్వకు వరుణుడు, ఘ్రాణము
నకు అశ్వినీదేవతలు, వాక్కునకు వహ్ని, హస్తములకు ఇంద్రుడు, పాదములకు
ఉపేంద్రుడు, పాయువునకు మిత్రుడు, ఉపస్థేంద్రియమునకు ప్రజాపతి.
మనస్సునకు చంద్రుడు, బుద్ధికి బృహస్పతి అధిష్ఠాన దేవతలు. ఈ సమస్త 823.
దేవతా శక్తులు దేవీ రూపములే అని ఈ మంత్రము ప్రతి పాదించుచున్నది.

నిర్గుణ పరబ్రహ్మము శరీరేంద్రియ రహితమని శ్రుతి ప్రతి పాదించు చున్నది.
"అశరీరగ్ం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్"

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథాఽరసం నిత్యమగంధవచ్చ యత్". ఇట్టి 824.
నిర్గుణ పరబ్రహ్మము దేవీరూపమే.

816. సర్వ దేవతలకు అధీశ్వరుడైనట్టియు, అనన్త తేజోమూర్తియగు శర్వుని యొక్క సమస్త ప్రాణి హరణ శక్తివి నీవే. ఓ నారాయణీ! నీకు నమస్కారమగు గాక!

విశేషాంశములు: 'శృణాతీతి శర్వః' అను వ్యుత్పత్తి ననుసరించి, సమస్త ప్రాణులను ప్రలయకాలమునందు సంహరించు రుద్రుడు 'శర్వుడు' అన బడును. అట్టి శర్వుని సంహారశక్తి దేవియే.

817. సర్వ ప్రాణుల దేహముల యొక్క జన్మమృత్యువులకు నీవే కారణము. ప్రాణుల జాగ్రదాద్యవస్థలన్నిటి యందు అనుగతముగ నుండు సాక్షిరూపము నీవే. ఓ దేవీ! నారాయణీ! నీ కొరకు నమస్కారము.

818. సమస్త ప్రాణులకు స్వర్గాదిలోకములను, మోక్షమును కూడ ఇచ్చునది నీవే. నీవు భక్తుల సర్వదుఃఖములను పోగొట్టెదవు. ఓ దేవీ ! నారాయణీ ! నీకొరకు నమస్కారము.

819. నీ అవయవములన్నియు శక్తి రూపములే. నీవు అవిద్యలనన్నిటిని నాశన మొనర్తువు. నీవు సర్వవిద్యలకు ఈశ్వరివి. ఓ దేవీ! నారాయణీ! నీ కొరకు నమస్కారము అగుగాక!

విశేషాంశములు: అవిద్య అనాది, సాంతము. మూలా విద్య ఏకరూపమే. కాని కార్యావిద్యలు అనేకము. దేహేంద్రియాదుల యందు ఆత్మ బుద్ధి, ఆత్మయందు కర్తృత్వ భావన ఇత్యాదులు కార్యావిద్యలు. దేవియొక్క కృప లేక అవిద్య తొలగి పోదు.

820. నీవు సమస్త రోగములను పోగొట్టెదవు. కష్టములనన్నిటిని తొలగింతువు. కోర్కెలనన్నిటిని తీర్చెదవు. ఓ దేవీ! నారాయణీ! నీకొరకు నమస్కారమగు గాక!

821. ఓ దేవీ! స్థావరజంగమాత్మకమగు జగత్తంతయు నీ స్వరూపమే. సర్వప్రాణులను నియమించునది నీవే. సర్వశక్తులు నీయందే ఉన్నవి. నీ తత్త్వము నెరుంగుట దుస్సాధ్యము. ఓ దేవీ! మమ్ములను భయముల నుండి రక్షింపుము. నీకొరకు నమస్కారమగు గాక!

822. ఓ కాత్యాయనీ! మూడు నేత్రములతో భాసించు ఈ నీ సుందరమగు ముఖము మమ్ములను సర్వప్రాణుల నుండి, అగ్నిజలాది భూతముల ఉపద్రవముల నుండి రక్షించు గాక! నీకు నమస్కారమగు గాక!

823. ఓ భద్రకాళీ! జ్వాలలతో భీకరమైనట్టియు, రాక్షసులను నిశ్శేషముగ సంహరించునట్టియు, దారుణమగు నీ త్రిశూలము మమ్ములను భయము నుండి కాపాడు గాక! నీకు నమస్కారమగు గాక!

విశేషాంశము: 'భద్రాణి కలయతీతి భద్రకాళీ'. మంగళముల నిచ్చునది గాన భద్రకాళి యనబడును.

824. నీ ఘంట తన ధ్వనిచే జగత్తును నింపి రాక్షసుల తేజస్సును నశింప జేయును. ఆ ఘంట మమ్ము పాపాత్ములనుండి తల్లి బిడ్డలను వలె రక్షించుగాక!

825. రాక్షసుల రక్తము, మేదస్సుల ముద్దచే పూయబడి, నీ చేతియందు ప్రకాశించుచున్న ఖడ్గము మాకు శుభముల నిచ్చుగాక!

826. ఓ చండికా! మేము నిన్ను నమస్కరించుచున్నాము.

827. ఓ దేవీ! నీవు సంతోషించినచో రోగములను నిశ్శేషముగా పోగొట్టెదవు. నీవు కోపించినచో, ఈప్సితములగు కోర్కెలనన్నిటిని నాశనము చేసెదవు.

విశేషాంశములు: 'అశేషాన్ రోగాన్' అనగా జ్వరాది రోగములు మాత్రమే కాక, రాగ ద్వేషాది రోగములు కూడ గ్రహింప బడును. రాగ ద్వేషాదులు మోక్షమార్గములో విఘ్నములు గనుక, అవియు రోగములే.

828. నిన్ను ఆశ్రయించిన మానవులకు ఆపదలుండవు. నిన్ను ఆశ్రయించిన భక్తులు ఇతరులకు ఆశ్రయము కాగలుగు చున్నారు.

829. ఓ దేవీ! ఓ అంబికా! ఈ నాడు నీవు నీ స్వరూపమును అనేకములగు బ్రాహ్మీ, లక్ష్మీ, కాళి ఇత్యాది రూపములచే బహు ప్రకారముగా విభజించి, శ్రుతిస్మృతి సదాచార విరోధులగు మహాసురులతో ఎట్టి యుద్ధమును చేసితివో, అట్టి యుద్ధమును మరి యే ఇతర స్త్రీ చేయ గల్గును?

830. అధ్యాత్మ విద్యా ప్రతి పాదక గ్రంథములు, వేదాన్తాది దర్శనములు, ఉపనిషత్తులు ఆత్మానాత్మ వివేకమును ప్రకాశింప చేయు చున్ననూ, ఈ విశ్వమును, మిక్కిలి దట్టమగు అజ్ఞానాంధకారముతో నిండిన మమకార రూపమగు సంసారఖాతమునందు నీవే పరిభ్రమింప చేయుచున్నావు. అట్టి మహామాయ నీవు కాక మరెవ్వరు?

విశేషాంశము: వేదాన్త దర్శనము, ఉపనిషత్తులు నిరూపించు పరబ్రహ్మ స్వరూపము దేవి కాక మరెవ్వరు? ఈ విషయమునే లలితా సహస్రనామ మిట్లు వర్ణించినది.

"శ్రుతి సీమంత సిందూరీ కృత పాదాబ్జధూళికా|
సకలాగమ సందోహ శుక్తి సంపుట మౌక్తికా||
చితిస్తత్పదలక్ష్యార్థా చిదేకరసరూపిణీ"||

పరబ్రహ్మ రూపిణియగు దేవియే మాయా రూపముచే ప్రాణులను సంసారము అనే సుడిగుండమునందు పరిభ్రమింప చేయుచున్నది.

831. రాక్షసులున్న చోట, భయంకరమగు విషసర్పములున్న చోట, శత్రువులున్న చోట, చోరుల గుంపులున్న చోట, దావాగ్ని చెలరేగు చున్న అరణ్యములో, సముద్ర మధ్యమునందు, ఇత్యాది సమస్త సంకట స్థానములందు నీవే ఉండి, విశ్వమును రక్షించుచున్నావు.

832. విశ్వనియంత్రి వగు నీవే విశ్వమును రక్షించుచున్నావు.

833. నీవు విశ్వమును ధరించు చున్నావు గనుక, విశ్వాత్మికవు.

విశేషాంశము: సమస్త జగత్తు పరబ్రహ్మము నందే, రజ్జువునందు సర్పమువలె కల్పింప బడినది. రజ్జుసత్త కంటె వేరైన సత్త సర్పమునకెట్లు లేదో, అటులనే పరబ్రహ్మసత్తయే జగత్తు యొక్క సత్త. పరబ్రహ్మమే జగదాత్మ. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతి ఈ విషయమునే ప్రతిపాదించుచున్నది. అట్టి పరబ్రహ్మము దేవియే. "మిథ్యాజగదధిష్ఠానా" అనియు లలితా నామము గలదు. విశ్వాత్మికయనగా విశ్వము తనయందు గలది అని యర్థము.

834. జగత్ప్రభువులగు ఇంద్ర బ్రహ్మాదులు నీకు నమస్కరించుచున్నారు.

835. నీ యందు భక్తి విధేయతలు గలవారే (బ్రహ్మాదులే) జగత్తునకు ఆశ్రయ మగుచున్నారు.

విశేషాంశములు: ఇదే భావమును శ్రీ శంకరాచార్యులు సౌందర్యలహరిలో వర్ణించిరి.

"అతస్త్వామారాధ్యాం హరి హర విరించాదిభిరపి", "ముకుందబ్రహ్మేంద్ర స్థిరమకుట నీరాజితపదామ్".

836. ఓ దేవీ! నీవు ప్రసన్నురాలవు కమ్ము. నీవీనాడు రాక్షసులను సంహరించి మమ్ములను ఎట్లు రక్షించితివో, అటులనే శత్రుభయము నుండి ఎల్లపుడు రక్షింపుము. సర్వప్రాణుల యొక్క పాపములను, మహాపాపములు పండి పుట్టిన గొప్ప ఉపద్రవములను వెంటనే శాంతింప జేయుము.

837. సర్వప్రాణుల దుఃఖమును పోగొట్టు ఓ దేవీ! నిన్ను నమస్కరించువారికి నీవు ప్రసన్నురాలవు కమ్ము. ముల్లోకములందలి ప్రాణులచే కొనియాడబడు ఓ దేవీ! ప్రాణులకు వరముల నిమ్ము.

దేవి పలికెను-

838. ఓ దేవ గణములారా! నేను వరమునిచ్చెదను. మీరు మనస్సులో ఏ వరమును ఇష్టపడుచున్నారో, దానిని కోరుకొనుడు. లోకములకు హితమును చేయు అట్టి వరమును ఇచ్చెదను.

దేవతలు పల్కిరి.

839. హే సర్వేశ్వరీ! నీవిపుడు చేసిన విధముగనే సమస్తదుఃఖములు తొలగుట కొరకై, మా శత్రువుల నాశమును ఎల్లప్పుడు చేయుచుండుము.

దేవి పలికెను-

840. వైవస్వతమన్వంతరము రాగానే, ఇరువది ఎనిమిదవ మహాయుగము నందు ఈ శుంభనిశుంభుల కంటె వేరగు శుంభనిశుంభులు అను మరో ఇద్దరు గొప్ప రాక్షసులు పుట్టగలరు.

841. నందుడను గోపాలకుని గృహములో యశోదా గర్భమునందు జన్మించి, తరు వాత వింధ్యపర్వతమునందు నివసించుదాననై, వారిద్దరిని సంహరించెదను.

**విశేషాంశము:** సమస్త జగత్తు పరబ్రహ్మము నందే, రజ్జువునందు సర్పమువలె కల్పింప బడినది. రజ్జుసత్త కంటె వేరైన సత్త సర్పమునకెట్లు లేదో, అటులనే పరబ్రహ్మసత్తయే జగత్తు యొక్క సత్త. పరబ్రహ్మమే జగదాత్మ. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతి ఈ విషయమునే ప్రతిపాదించుచున్నది. అట్టి పరబ్రహ్మము దేవియే. "మిథ్యాజగదధిష్ఠానా" అనియు లలితా నామము గలదు. విశ్వాత్మికయనగా విశ్వము తనయందు గలది అని యర్థము.

834. జగత్ప్రభువులగు ఇంద్ర బ్రహ్మాదులు నీకు నమస్కరించుచున్నారు.

835. నీ యందు భక్తి విధేయతలు గలవారే (బ్రహ్మాదులే) జగత్తునకు ఆశ్రయ మగుచున్నారు.

**విశేషాంశములు:** ఇదే భావమును శ్రీ శంకరాచార్యులు సౌందర్యలహరిలో వర్ణించిరి.

"అతస్త్వామారాధ్యాం హరి హర విరించాదిభిరపి", "ముకుందబ్రహ్మేంద్ర స్థిరమకుట నీరాజితపదామ్".

836. ఓ దేవీ! నీవు ప్రసన్నురాలవు కమ్ము. నీవీనాడు రాక్షసులను సంహరించి మమ్ములను ఎట్లు రక్షించితివో, అటులనే శత్రుభయము నుండి ఎల్లపుడు రక్షింపుము. సర్వప్రాణుల యొక్క పాపములను, మహాపాపములు పండి పుట్టిన గొప్ప ఉపద్రవములను వెంటనే శాంతింప జేయుము.

837. సర్వప్రాణుల దుఃఖమును పోగొట్టు ఓ దేవీ! నిన్ను నమస్కరించువారికి నీవు ప్రసన్నురాలవు కమ్ము. ముల్లోకములందలి ప్రాణులచే కొనియాడబడు ఓ దేవీ! ప్రాణులకు వరముల నిమ్ము.

దేవి పలికెను-

838. ఓ దేవ గణములారా! నేను వరమునిచ్చెదను. మీరు మనస్సులో ఏ వరమును ఇష్టపడుచున్నారో, దానిని కోరుకొనుడు. లోకములకు హితమును చేయు అట్టి వరమును ఇచ్చెదను.

దేవతలు పల్కిరి.

839. హే సర్వేశ్వరీ! నీవిపుడు చేసిన విధముగనే సమస్తదుఃఖములు తొలగుట కొరకై, మా శత్రువుల నాశమును ఎల్లప్పుడు చేయుచుండుము.

దేవి పలికెను-

840. వైవస్వతమన్వంతరము రాగానే, ఇరువది ఎనిమిదవ మహాయుగము నందు ఈ శుంభనిశుంభుల కంటె వేరగు శుంభనిశుంభులు అను మరో ఇద్దరు గొప్ప రాక్షసులు పుట్టగలరు.

841. నందుడను గోపాలకుని గృహములో యశోదా గర్భమునందు జన్మించి, తరు వాత వింధ్యపర్వతమునందు నివసించుదాన్నై, వారిద్దరిని సంహరించెదను.

ఇది శ్రీ మార్కండేయ మహాపురాణము నందు సావర్ణికమన్వంతరగాథలో దేవీమాహాత్మ్యమునందు 'నారాయణీ స్తుతి' యను మూలగ్రంథ మంత్ర విభాగ రూపమగు నవశతీ మంత్రమాల యందలి ఎనిమిదవ అధ్యాయము సమాప్తమయ్యెను.

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః
# నవమాధ్యాయము
# ఓం నమశ్చండికాయై

దేవి పలికెను.

853. ఎవడు స్థిరచిత్తుడై నన్ను ఈ స్తోత్రములచే నిత్యము స్తుతించునో, వాని సర్వబాధలను నేను నిస్సందేహముగా నశింపజేయ గలను.

854. ఎవరు మధుకైటభవధను, మహిషాసుర వధను, అటులనే శుంభ నిశుంభ వధను కీర్తించెదరో, వారికే పాపము ఉండదు.

855. అష్టమి, నవమి, చతుర్దశీ తిథులయందు ఎవరు ఏకాగ్రమైన మనస్సు కలవారై, భక్తితో ఉత్తమమగు నా మాహాత్మ్యమును వినెదరో, వారికే పాపము ఉండదు.

856. వారికే పాపము ఉండదు. పాపముల వలన కలుగు ఆపదలుండవు. దారిద్ర్యము కలుగదు. భార్యా పుత్రాదులతో వియోగము కలుగదు. వారికి శత్రువుల వలన గాని, చోరుల వలన గాని, రాజు వల్లనగాని భయము కలుగదు. వారికెన్నడును శస్త్రము, అగ్ని, జలప్రవాహముల వలన భయము సంభవించదు.

857. అందువలన మిక్కిలి కళ్యాణాస్పదము, పరమ శ్రేష్ఠమునగు నాయీ మాహాత్మ్యమును స్థిరచిత్తులై పఠించవలెను. ఎల్లప్పుడు భక్తితో వినవలెను.

858. మహామారుల వలన కలుగు ఉపద్రవముల నన్నిటిని, మరియు మూడు విధముల ఉత్పాతములను ఈ నా మాహాత్మ్యము యొక్క శ్రవణ పఠనములు పోగొట్టును.

విశేషాంశములు: సన్నిపాత జ్వరము, అతి సారము ఇత్యాది బహుప్రాణి సంహారకములగు రోగములు మహామారులన బడును. ఉత్పాతములు మూడు విధములు. దివ్య, అన్తరిక్ష, భౌమములు. గ్రహముల చలనము వలన కలుగు ఉత్పాతములు దివ్యములు. పిడుగులు, ఉల్కలు మొదలగునవి అన్తరిక్షములు. భూమిపై స్థావరము లందు, జంగమములందు ఏర్పడు వికారములు భౌమములు.

859. ఏ గృహమునందు ఈ నా మాహాత్మ్యము నిత్యము యథావిధిగా పఠింపబడునో, ఆ గృహమును నేను విడువను. ఆ గృహమునందు ఎల్లపుడు నా నివాసము నిశ్చయము.

860. నైవేద్య సమయమునందు, పూజాకాలము నందు, యాగరూపమగు మహోత్సవ మునందు నాయీ చరితమును సంపూర్ణముగా పఠించవలెను. వినవలెను.

861. భక్తులు తెలిసి కాని, తెలియకకాని, నైవేద్యాదికముతో కూడిన పూజను, అగ్నిహోమమును దేవీ మాహాత్మ్య పఠన శ్రవణములతో కలిపి చేసినచో, నేనట్టి పూజను, హోమమును ప్రీతితో స్వీకరించెదను.

862. ప్రతి సంవత్సరము శరత్కాలమందుచేయబడు మహాపూజయందు భక్తితో గూడి నాయీ మాహాత్మ్యమును విన్నచో, మానవుడు నా అనుగ్రహముచే బాధలన్నిటి నుండి విముక్తుడగును. ధనధాన్యసమృద్ధిని పొందును. దీనిలో సంశయమేమియు లేదు.

863. మానవుడు నాయీ మాహాత్మ్యమును, మంగళకరములగు అవతారములను, యుద్ధములందు ప్రదర్శింపబడిన పరాక్రమములను విని, నిర్భయుడగును.

**విశేషాంశము:** సర్వత్ర శ్రవణము పఠనమునకు ఉపలక్షకము.

864. నా మాహాత్మ్యమును విన్న పురుషులయొక్క శత్రువులు క్షయమగుదురు. మంగళములు ప్రాప్తించును. వంశము వృద్ధి పొందును.

**విశేషాంశములు:** కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు పురుషునకు ముఖ్యమైన శత్రువులు. ఇవి దేవీ మాహాత్మ్య పఠన శ్రవణముల వలన నశించును.

865. శాన్తి కర్మలన్నిటియందు, చెడుకలలు వచ్చినపుడు మిక్కిలి ఉత్కటమగు గ్రహబాధలు కల్గినపుడు నా మాహాత్మ్యమును వినవలెను.

**విశేషాంశములు:** కింశుకాది వృక్షముల నధిరోహించుట, వివాహము, రక్తవస్త్రధారణము, తైలమర్దనము, మాంస భోజనము, కాంతిహీనుడగు సూర్యుని, చంద్రుని కనుట, నక్షత్రపతనము, ముక్కు,చెవులు తెగినట్లుకన పడుట, గాడిద, ఒంటెలపై అధిరోహించుట, బురదలో పడుట, నగ్నముగా నుండుట, అభ్యంగన స్నానము ఇత్యాదులు దుస్స్వప్నములు.

866. నా మాహాత్మ్యమును వినుట వలన, ఉపద్రవములన్నియు తొలగిపోవును.

867. నా మాహాత్మ్యమును వినుట వలన భయంకరములగు గ్రహబాధలు తొలగిపోవును.

868. నా మాహాత్మ్యమును వినుట వలన మానవులకు వచ్చు దుస్స్వప్నములుకూడ శుభఫలమునే ఇచ్చును.

869. నా మాహాత్మ్యమును పఠించుటతోడనే బాలగ్రహపీడితులగు బాలురకు ఆ పీడ తొలగి సుఖము లభించును.

870. నా మాహాత్మ్యమును పఠించుటతోడనే, కలిసి కట్టుగా పని చేయు జనసముదాయములో ఏర్పడిన విరోధములు తొలగి చక్కని సఖ్యత ఏర్పడును.

871. నా మాహాత్మ్యమును పఠించుట తోడనే, పాపాత్ములందరి బలమునకు హాని కలుగును.

872. నా మాహాత్మ్యమును పఠించుటతోడనే, రాక్షసులు, భూతములు,పిశాచములు నశించును.

873. నా యీ మాహాత్మ్యమునంతయు పఠించుటచే, భక్తులు నా సాయుజ్యమును పొందెదరు.

874. ఒక సంవత్సర కాలము పత్రముల, పుష్పముల సమూహములతో, ధూపము లతో, ఉత్తమమగు గంధములతో, దీపములతో, ఇంకను ఇతరములగు అనేక భోగద్రవ్యములతో నన్ను పూజించుట చేత, బ్రాహ్మణులకు అన్నదానములు చేయుట చేత, హవనముల చేత, రాత్రింబగళ్లు అభిషేకించుట చేత నాకెట్టి ప్రీతి కలుగునో, అట్టి ప్రీతి నా మాహాత్మ్యమును ఒక్కసారి ఉచ్చరించుట చేత, వినుట చేత కలుగును.

875. నా అవతారములను కీర్తించుట చేత పాపములు తొలగిపోవును.

876. నా అవతారములను కీర్తించుటచే ఆరోగ్యము కలుగును.

877. నా అవతారములను కీర్తించుటచే, క్రూరమృగముల బారినుండి రక్షణ కలుగును.

878. యుద్ధములందు నేను చేసిన ఏ దుష్ట రాక్షస సంహారము గలదో, ఆ చరిత మును వినినచో, మానవులకు శత్రు భయము కలుగదు.

879. మీ చేత, బ్రహ్మర్షుల చేత, బ్రహ్మచేత కూడ ఏ స్తుతులు చేయ బడినవో, అవి మంగళకరమగు బుద్ధిని (ఆత్మజ్ఞానమును) కలిగించును.

విశేషాంశములు: మూడవ అధ్యాయమునందలి మహిషాన్తకరీ సూక్తము, నాల్గవ అధ్యాయమునందలి అపరాజితా సూక్తము, ఎనిమిదవ అధ్యాయము నందలి కాత్యాయనీ సూక్తము ఇవి దేవతలచే చేయబడిన స్తుతులు. "మహిషాన్తకరీ సూక్తం దృష్టం దేవైర్మహర్షిభిః" అని లక్ష్మీ తంత్రములో చెప్పబడుటచే, ఋషికృతమగు స్తుతికూడ అదియే. ప్రథమాధ్యాయము నందలి దేవీస్తోత్రము బ్రహ్మకృతము. ఇవి అన్నియు ఉపనిషత్సారములు. ఆత్మజ్ఞాన మునకు పెన్నిధులు.

880. అరణ్యము నందు దావాగ్నిచే చుట్టుముట్ట బడినను, దూరనిర్జన మార్గ మునందు దోపిడి దొంగల చేతికి చిక్కినను, నిర్జనప్రదేశమునందు శత్రువులచే బంధింప బడినను, అడవిలో సింహము, వ్యాఘ్రము లేక అడవి ఏనుగులచే తరుమబడినను, కోపించిన రాజుచే రాజ్యమునుండి బహిష్కరింప బడినను, మరణ దండన విధింప బడినను, కారాగారమునందు బంధింప బడినను, మహాసముద్రములో నావయందుండి పెను గాలిచే కుదిపివేయ బడినను, మిక్కిలి భయంకరమగు యుద్ధమునందు శస్త్రములు మీద పడుచున్నను, ఘోరములగు రోగముల వేదనలచే పీడింప బడుచున్నను, మానవుడు నాయీ చరితమును స్మరించినచో, సంకటమునుండి విముక్తుడగును.

881. నా ప్రభావము వలన సింహము మొదలగు క్రూరమృగములు, దోపిడీ గాండ్రు, శత్రువులు నా చరితమును స్మరించిన వానికి సుదూరముగా పారి పోదురు.

ఋషి పలికెను.

882. భయంకరమగు పరాక్రమముగల భగవతియగు ఆ చండిక ఇట్లు పలికి, దేవతలు చూచుచుండగనే, అచటనే అంతర్ధానము చెందెను.

883. ఆ దేవతలందరు సంహరింపబడిన శత్రువులు గలవారై, తొలగిన భయము గలవారై, పూర్వమందు వలె యజ్ఞభాగములను భుజించు వారై, తమ తమ అధికారములను పొందిరి.

884. దేవశత్రువునైనట్టియు, జగత్తుకు పీడను కలిగించి నట్టియు, మిక్కిలి భయంకరుడై నట్టియు, సాటిలేని పరాక్రమముగల శుంభుడు, మహాపరాక్రమ శాలియగు నిశుంభుడు కూడ దేవిచే యుద్ధములో సంహరింపబడగా, మిగిలిన రాక్షసులు పాతాళమును చేరిరి.

885. ఓ రాజా! ఈ విధముగా భగవతియగు దేవి నిత్యురాలైనను పలుమార్లు అవతరించి జగత్తును రక్షించుచుండును.

886. ఆమె చేత ఈ జగత్తు మోహింప చేయబడు చుండును.

887. ఆమెయే జగత్తును సృష్టించును.

888. ఆమెను కోరినచో ఆత్మజ్ఞానము నిచ్చును.

889. ఆమె సంతసించినచో ఐశ్వర్యము నిచ్చును.

890. ఓ రాజా! ఈ సమస్త బ్రహ్మాండము మహామాయా, మహాదేవీ, మహాకాళీ స్వరూపురాలగు ఆమె చేత వ్యాప్తమైనది.

విశేషాంశములు: సప్తశతి పాఠములోని చరిత్రత్రయ విభాగమునందు మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ అను విభాగమును ఈ శ్లోకము ఖండించుచున్నది.

891. ఆమెయే సంహారకాలమందు మహాకాళి.

892. నిత్యురాలగు ఆమెయే సృష్టి కర్త్రి.

**విశేషాంశము:** కారణమగు దేవి, కార్యమగు సృష్టి అనన్యములు. కాన సృష్టి పదము సృష్టి కర్త్రిని బోధించును. "వాచారంభణం వికారో నామ ధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అను ఛాందోగ్య శ్రుతియు, "తదనన్యత్వమారంభణ శబ్దాదిభ్యః" అను బ్రహ్మ సూత్రము, కార్యకారణములకు అనన్యత్వమును బోధించుచున్నవి.

893. సనాతనియగు ఆమెయే స్థితికాలము నందు ప్రాణులను రక్షించుచున్నది.

894. ఆమెయే కల్యాణ కాలమునందు మానవుల గృహములలో సర్వసమృద్ధి కారిణియగు లక్ష్మియై నివసించును.

895. మరియు ఆమెయే అమంగళకాలమునందు అలక్ష్మియై సర్వసమృద్ధి వినాశమును కలిగించును.

896. ఆమెను పుష్పగంధ ధూపాదులతో పూజించిన వారికి, స్తుతించిన వారికి ఆమె సంపదను, పుత్రులను, ధర్మబుద్ధిని, మోక్షమును కూడ ఇచ్చును.

మహర్షి ఇట్లు పలికెను.

897. ఓ రాజా! ఉత్తమమగు ఈ దేవీ మాహాత్మ్యమును నీకు చెప్పితిని. ఆ దేవియొక్క ప్రభావమిట్టిది. ఆమె చేతనే ఈ జగత్తు ధరింప బడుచున్నది.

898. భగవాన్ శ్రీమహా విష్ణువు యొక్క మాయయగు ఆమె చేతనే ఆత్మజ్ఞానమీయ బడు చున్నది.

899. నీవు, ఈ వైశ్యుడు, ఇతరులగు వివేకులు కూడ ఆమెచే మోహింపచేయబడు చున్నారు. పూర్వముకూడ మోహింప చేయబడిరి. భవిష్యత్తులో కూడ మోహింపచేయ బడగలరు.

900. ఓ మహారాజా! దేవతలచే, గంధర్వులచే, మోక్షకాములగు మహర్షులచే స్తుతింపబడిన ఆ పరమేశ్వరిని శరణు పొందుము. ఆమెను ఉపాసించిన వారికి ఆమె ఇహ లోక భోగములను, స్వర్గమును, మోక్షమును ఇచ్చును.

శ్రీమార్కండేయు డిట్లు పలికెను.

901. సురథమహారాజు ఈ పలుకులను విని, ధర్మ జ్ఞాన వైరాగ్యసంపన్నుడై నట్టియు, దృఢవ్రతుడైన ఆ మహర్షికి నమస్కరించి, రాజ్యాపహారము చేతను, అతిశయించిన మమకారము చేతను, దుఃఖితుడై, వెంటనే తపస్సు కొరకు వెళ్లెను.

902. ఓ మహర్షీ! ఆ వైశ్యుడు కూడ అతిశయించిన మమకారముచే దుఃఖమును పొందిన వాడై, వెంటనే తపస్సు కొరకు వెళ్లెను.

903. రాజు, మరియు వైశ్యుడు నదియొక్క ఇసుక తిన్నెల యందున్నవారై జగన్మాతృ సాక్షాత్కారము కొరకు సర్వోత్తమమగు దేవీ సూక్తమును జపించుచు తపస్సు చేసిరి.

904. వారు ఆ ఇసుక తిన్నెయందు మట్టితో దేవి యొక్క మూర్తిని చేసి, ఆమెకు పుష్పము, ధూపము, హోమములతో పూజను గావించిరి.

905. ఇట్లు మూడు సంవత్సరములు జితేంద్రియులై వారిద్దరు ఆమెను ఆరాధించిరి. జగన్మాతయగు చండిక సంతసించి ప్రత్యక్షమై ఇట్లు పలికెను.

906. ఓ రాజా! నీ వేది కోరెదవో, దానిని నా నుండి పొందుము. కులనందనుడ వగు ఓ వైశ్యా! నీ వేది కోరెదవో, దానిని నా నుండి పొందుము. సంతసించిన నేను సర్వమును ఇచ్చెదను.

శ్రీ మార్కండేయు డిట్లు పలికెను.

907. అపుడు రాజు మరుజన్మలో సావర్ణిక మన్వంతరాధిపత్యమును, ఈ జన్మలో తన బలముచే శత్రువులను సంహరించి పొంద బడు తన రాజ్యమును కోరెను.

908. తరువాత అహంకార మమకారముల పరిణామ రూపమగు దుఃఖముల నెరింగిన ఆ వైశ్యుడు విరక్తి చెందిన మనస్సు కలవాడై, అహంకారమమకార ములను నశింప జేయు ఆత్మజ్ఞానమును కోరెను.

దేవి పలికెను.

909. ఓ రాజా! నీవు కొద్ది రోజులలో శత్రువులను సంహరించి నీ రాజ్యమును పొందగలవు. ఆ రాజ్యమునందు నీకెన్నడును పతన ముండదు.

910. మరణించిన తరువాత నీవు తిరిగి సూర్యభగవానుని వలన జన్మను పొంది, లోకములో సావర్ణికుడని ప్రసిద్ధి గాంచిన మనువు కాగలవు.

911. ఓ వైశ్యశ్రేష్ఠా! నీవు నా నుండి ఏ వరమును కోరితివో, దానిని ఈయ గలను. నీకు మోక్షహేతువగు జ్ఞానము కలుగును.

శ్రీమార్కండేయు డిట్లు పలికెను.

912. ఇట్లు దేవి వారు కోరిన వరములను వారి కిచ్చి, వారిచే భక్తి పూర్వకముగా స్తుతింప బడినదై, వెంటనే అంతర్ధానము చెందెను.

913. ఈ విధముగా క్షత్రియ శ్రేష్ఠుడగు సురథ మహారాజు వరములను పొంది, మహర్షి ఆశ్రమమునకు వచ్చి, ఆయనకు సర్వమును నివేదించెను.

914. తరువాత ఆయన ఆజ్ఞచే తన నగరమునకు వెళ్లెను. ఉత్సాహవంతుడై, గర్వముచే కన్ను మిన్ను గానని శత్రువులను సంహరించి, రాజ్యమును పొందెను.

915. తరువాత సముద్రమే మేఖలగా గల సమస్తపృథివిని పాలించెను. యావ జ్జీవము సుఖముగా అనుభవించి, తిరిగి ఎనిమిదవ మన్వంతరములో సూర్యుని వలన జన్మను పొంది, సావర్ణి అను మనువు కాగలడు.

916. వైశ్యుడు కూడ మమకారము లేనివాడై, జ్ఞానియై, దేవియొక్క ఆరాధన యందు తత్పరుడై, పుణ్యక్షేత్రములలో సంచరించుచూ, భగవతి యొక్క గుణములను కీర్తించుచూ, తొలగిన బంధములు కలవాడై కాలమును గడుపుచూ సంచరించెను.

917. హే విప్ర! అనేక అవతారముల యొక్క చరిత్రముల మహిమలతో అధికముగ ప్రకాశించు ఈ సర్వోత్తమమగు దేవీ మాహాత్మ్యమును నీకు చెప్పితిని.

918. దీనిని ఏ మానవుడు శ్రద్ధతో ప్రతినిత్యము పఠించునో, అతడు ఆ కోర్కెలను పొందును. నూరు సంవత్సరములు జీవించును.

919. సృష్టిన నాటి నుండి చేయ బడిన బ్రహ్మహత్య మొదలగు పాపములు ఈ మాహాత్మ్యమును ఒక్క సారి పఠించుట వలన నిస్సందేహముగా తొలగిపోవును.

920. ఏ మానవుడు ఈ పుస్తకమును ప్రతి నిత్యము భక్తితో పూజించునో, వాని గృహములో ధనము, ధాన్యము, సంపద వృద్ధి చెందును.

921. అట్టి భక్తులకు మానసిక వ్యాధులు గాని, భయంకరములగు శారీరక వ్యాధులు గాని కలుగవు. చోరుల వలన, శత్రువుల వలన బాధ ఉండదు. చండికా దేవియొక్క ఆజ్ఞచే పుత్రపౌత్రాభివృద్ధి కూడ కలుగును.

ఇది శ్రీ మార్కండేయ మహాపురాణము నందు సావర్ణికమన్వంతర గాథలో దేవీ మాహాత్మ్యమునందు దేవీ పారాయణ ఫలశ్రుతి యను, మూల గ్రంథ మంత్ర విభాగ రూపమగు నవశతీ మంత్రమాలయందలి తొమ్మిదవ అధ్యాయము సమాప్త మయ్యెను.

గ్రంథము సమాప్తమయ్యెను.

ఓం తత్సత్ ॥ శ్రీః శ్రీః శ్రీః ॥

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.